

"పారణి"

చిత్రకారుడు : కళ్యాణప్రసాద్ శర్మ.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25 న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 30
19-3-58

Founder : K. NAGESWARA RAO

హేవిళంబి ఫాల్గుణ బహుళ చతుర్దశి బుధవారం

## ఉగాదిలక్ష్మి

[సురభి నరసింహము]



చైత్రయాత్రలు సేయ-చైత్రమానము మొదలు
జగమునంతట ప్రీతి - మిగులఁజేసెడిరీతి
వత్సరమ్మునకాది - ఉత్సవమ్ముకుగాది
అవతరించెను ధాత్రి- నవశోభలను ప్రకృతి॥

వేపపూవులఁ గోసి - తీపు పులుపున వేసి
రోగబాధలు లేక - రాగభావము లొలుక
చవులు చూచియు ప్రజలు-ప్రభల దీపింపంగ
అవతరించెను నేడు - నవదీప్తుల నుగాది॥

చిగురుటాకుల మెక్కి- వగరుగొంతుక విప్పి
కొమ్మరెమ్మలఁ గూడి - కోయిలమ్మలుపాడ
నెమ్మనమ్మునపాట - కమ్మనై యలరార
జగమునిండెను ప్రీతి-సొగసు పండెను దీప్తి॥

మావిమావిని చివురు - పూవుపూవున మధువు
మోవులెత్తుచు మిగుల - తావిఁజిమ్ముచు దెసల
నంతనమ్ముల నొసగ - వాసంతికా ఋతువు
అవతరించెను నేడు-నవకాంతులను పుడమి॥

ద్వారబంధములందు - తోరణమ్ములఁగట్టి
పసుపుకుంకుమసొబగు-మిసమిసలఁ దేలంగ
కుసుమసంపదఁ దెచ్చి-వసుధవెలయగవిచ్చి
దీవింప వేంచేసె - దేవియై వనలక్ష్మి॥

అత్తగారలయిండ్ల - క్రొత్తయల్లుండ్రెల్ల
విచ్చేసి ముచ్చటల - మెచ్చుపొందెడివేళ
ముక్కోటియాంధ్రులకు-చుక్కానియై వెలసి
అరుగుదెంచెను నేడు-తెలుగుఁజూవ నుగాది॥

ఏ విలంబము లేక - ఏ విపత్తులు రాక
హేవిలంబమునందు- హాయినుండిరి జనులు
ఏ విలాసము కొఱకొ- ఏ వినోదముకొఱకొ
ఈ "విలంబి" యువచ్చె- హేవిలంబను దాటి॥

భవ్యభారతదేశ - మానవోత్తములార!
భావసంపదఁ గలిగి - భేదభావము తొలగి
మత్సరంబుల విడచి- సత్యమార్గమున నడచి
జ్ఞానకాంతుల మెలగి-దీనరక్షణఁజేసి

ఊరు పేరుల కీర్తి-మేరువై దీపింప
వాత్సల్యమున మీరు - వత్సరమ్మును గడప
ఉత్సాహముల నెన్నొ- ఉత్సవమ్ముల నడుప
నరుగుదెంచె నుగాది-మురువుగొల్పను నేడు॥

ఈ "విలంబిని" మనుట-ఈవి తావులఁబఱవ
స్వీయధర్మములందు- స్నేహభావము నెఱవ
దీవించి దీపించి - దేవియై వనలక్ష్మి
హర్షకమ్మున నొక్క - సారియే యేతెంచు
నవ్య దీప్తులతోడ - దివ్యమాతగ లక్ష్మి॥ ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
"అప్సరస"
....చూచి ఝళం ఝళత్కటక
సూచితవేగ పదారవిందయై...."
(మనుచరిత్ర)
చిత్రకారిణి: శ్యామసుందరీదేవి

# న్యూఢిల్లీ లేఖ

## ఆధారంలేని బడ్జెట్ అంచనాలు

**శ్రీ కృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

భారత ప్రధాని ప్రతిపాదించిన కొత్త బడ్జెట్ (1958-59) మీద దేశంలోని పత్రికలన్నీ విమర్శలు, వ్యాఖ్యలు చేశాయి. పన్నుల విధానాన్ని ధైర్యంగా సంస్కరించేందుకు బడ్జెట్ కలిగించిన అవకాశాన్ని ప్రధాని నెహ్రూ ఉపయోగించుకోలేక పోయారని, పన్నులవిషయంలో మార్పులేమీ చెయ్యకుండా ఊరుకున్నారు గనుకనే పొదుపును (సేవింగ్స్) గూర్చి, పెట్టుబడులనుగూర్చి కూడా ఏమీ చెయ్యలేక పోయారనీ పత్రికలు అభిప్రాయపడ్డాయి; రెండవ పంచవర్ష ప్రణాళికకు ప్రభుత్వం ఎంతవరకూ ధనం సమకూర్చగలదనే విషయమై కూడా అనుమానాలు వెల్లడించాయి. బడ్జెట్ లోటుపరిమితిని జాగ్రత్తగా గమనిస్తూ వ్యవహరించాలని హెచ్చరించాయి.

బడ్జెట్ నుగూర్చి లాబీలలో అభిప్రాయాలు రకరకాలుగా ఉన్నాయి. అంతమాత్రాన, బడ్జెట్ లోని పన్నులవిధానంలో గాని, ప్రభుత్వం చేయనున్న భారీఖర్చు పద్దుల్లో గాని మార్పులకు అవకాశం ఉందని భావించరాదు. పార్లమెంటులో కాంగ్రెసుకు విపరీతంగా బలం ఉంది గనుక, నాయకుడు ప్రతిపాదించిన బడ్జెట్ ప్రతిపాదనలు సాధారణంగా ఢోకా లేకుండా నెగుతాయి. దీనికితోడు ఈ ఏడు కేంద్ర మంత్రిమండలిలో రెండు పెద్దపదవులు ఖాళీఅయ్యాయి. ఈ రెండు ఖాళీల్నిగూర్చి కావలసినన్ని పుకార్లు షికార్లుచేస్తున్నాయి; ఊహాలు గానం చేస్తున్నాయి. ఆఖరికి ఆఖరి సీట్లలో కిమ్మనాస్తిగా కూర్చునే సభ్యులుకూడా, ఎక్కడలేని ఉత్సాహం ప్రదర్శిస్తున్నారు. ఆశగుడ్డదనే విషయానికి నిదర్శనాలు పార్లమెంటు రెండుసభల్లోనూ కనిపిస్తాయి. అందుచేత బడ్జెట్ నుగూర్చిన విమర్శను దేన్నీ గంభీరంగా ఆలోచించవలసిన పని లేదు. అయినా దేశక్షేమం దృష్ట్యా కొంత వ్యాఖ్యానం చేయక తప్పదు.

సాధారణంగా, ఏ బాపతు ప్రభుత్వమైనా గత సంవత్సరాల అనుభవాన్ని బట్టి ఆదాయం అంచనాలు తయారు చేస్తుంది. కాని కొత్త బడ్జెట్ ఈ సూత్రాన్ని అవలంబించకుండానే తయారైంది. ఇప్పటి పన్నులరాబడినిబట్టి ప్రధానమంత్రి రెవిన్యూ పద్దులో రూ. 33 కోట్ల లోటును అంచనా వేశారు. దీనికి పెట్టుబడి కేటాయింపు రూ. 412 కోట్లు, రాష్ట్రప్రభుత్వాలకు, ఇతరులకు అప్పులు రూ. 362 కోట్లు, ఋణపరిష్కారం రూ. 28 కోట్లు కలిపారు. మొత్తం ఇవంతా చేరి రూ. 835 కోట్లు అయింది. ఈ లోటును ఈ విధంగా భర్తీ చేయాలని ప్రధాన మంత్రి భావిస్తున్నారు:

ఋణ పరిష్కారంగా వచ్చే డబ్బు రూ. 75 కోట్లు; ప్రజలనుంచి ఋణంగా తీసుకునేది రూ. 145 కోట్లు; చిన్న మొత్తాల

# న్యూఢిల్లీ లేఖ

పొదుపు రూ. 100 కోట్లు; విదేశాలనుంచి సహాయం రూ. 285 కోట్లు; ఇంకా చిల్లర మల్లరగా వచ్చే డబ్బు రూ. 25 కోట్లు; ఇవన్నీ కలపగా రూ. 630 కోట్లు; మిగతా రూ. 205 కోట్లు లోటు విధానంద్వారా పూర్తచేసే మొత్తం రూ. 835 కోట్లు భర్తీ అవుతుంది.

1952-53 నుంచీ చిన్న మొత్తాల పొదుపు ఈ క్రింది విధంగా ఉంటూ ఉంది:

| | | | |
|---|---|---|---|
| 1952-53 | రూ. | 40.15 | కోట్లు |
| 1953-54 | రూ. | 37.85 | ,, |
| 1954-55 | రూ. | 55.16 | ,, |
| 1955-56 | రూ. | 66.55 | ,, |
| 1956 57 | రూ. | 59.01 | ,, |
| మొత్తం | రూ. | 258 72 | ,, |
| అయిదేళ్లకు సగటు | రూ. | 51.74 | ,, |
| 1957-58 లో సరిచేసిన అంచనాలు | రూ. | 60.00 | ,, |
| 1958-59 బడ్జెట్ ప్రకారం | రూ. | 100 00 | ,, |

ఈ అంకెల్నిబట్టి చిన్న మొత్తాలపొదుపు 1955-56 లో బాగా ఉధృతంగా ఉన్నదని తెలుస్తుంది. ఆ తరవాత ఏడాదిలో దాదాపు 8 కోట్ల రూ.ల దాకా పడిపోయింది. ప్రధాన మంత్రి బడ్జెట్ ప్రసంగంలో ఇలా చెప్పారు: "కొన్ని నెలలనుంచి చిన్న మొత్తాల పొదుపు ముఖ్యంగా పోస్టల్ సేవింగ్స బ్యాంకులలో అంతకుముందుకంటె బాగా తగ్గిపోయింది. వర్తమాన సంవత్సరంలో మొదటి పదినెలలకీ నికరంగా వచ్చిన డబ్బు రూ. 37.9 కోట్లు. కిందటి ఏడాది అవేనెలల్లో రూ. 44.8 కోట్లదాకా వచ్చింది. ఇలా తగడానికి ముఖ్య కారణం సేవింగ్స బ్యాంకుల పద్దులో 1956-57 లో కంటె రూ. 14 కోట్లు తగ్గదల కనబడడమే."

మొదటి పదినెలల్లోను పొదుపు రాబడి ఇంత తగ్గినా, సరిచేసిన అంచనాలు రూ. 60 కోటనీ, బడ్జెట్ అంచనాలు రూ. 100 కోట్లనీ వేశారు. పొదుపు తగ్గుదలకు కారణా లేమిటని ఆలోచించిన ప్రయత్నానపోలేదు. బహుశా జీవనవ్యయం పెరిగిపోవటంవల్ల సాధారణంగా చిన్న మొత్తాలు పొదుపుచేసే వర్గం దగ్గిర మిగల్చటానికి డబ్బే లేదేమో. కష్టపడి చెమటోడ్చి సంపాదించిన డబ్బు ప్రభుత్వానికి అప్పగిస్తే, ప్రభుత్వం దాన్ని ఎడతెరపిలేని ఉత్సవాలకు, సాంస్కృతిక, శాట్య, నాటక, సంగీత, యువక ఉత్సవాలకి, ప్రతినిధివర్గాలనిపంపించడానికి, అతిథుల్ని మర్యాదచేయటానికి ఎలా ఖర్చు చేసేస్తున్నదో చూసి, ప్రభుత్వానికి ఇవ్వడం దేనికిలే అని ప్రజలు అనుకున్నారేమో.

1957-58 తో అంతమైన అయిదేళ్ళలో ప్రభుత్వం ప్రజల్నించి తీసుకున్న ఋణ ధనం రు 257కోట్లు. అంటే సగటున ఏడాదికి రు 51 కోట్లు. 1957 58 లో ప్రజల్నించి నికరంగా తీసుకున్న ఋణం రు 68 కోట్లు మరి రు 145 కోట్ల ప్రజాఋణం లభిస్తుందని ప్రధాని ఎలా అంచనా వేశారో చెప్పలేదు. గత సంవత్సరాల అనుభవం చూసి ఏమైనా నిజంగా నేర్చుకోదగింది ఉంటే, చిన్న మొత్తాల పొదుపు ద్వారానూ, ప్రజా ఋణాల ద్వారాను మొత్తము లభించేది రు 145 కోట్లు అయి ఉండాలి. అంటే బడ్జెట్ అంచనాకంటె రు 100 కోట్లు తక్కువన్నమాట. బహుశా ఈవిధముగా సమకూడని డబ్బును లోటు ఆర్థికవిధానం ద్వారా భర్తీ చేసుకుంటారని ఊహించవచ్చు.

విదేశీ సహాయానికి కూడా ఇదే విమర్శ వర్తిస్తుంది. ఎటొచ్చీ నాసిక్ ముద్రణాలయంలో విదేశీధనం తయారుకాదనేది ఒకటే తేడా. మిత్రదేశాలకు భిక్షాపాత్ర పట్టుకు వెళ్ళినంత మాత్రాన రు 285 కోట్ల అప్పు లభిస్తుందని తియ్యగా ఊహించుకుని బడ్జెటు ఎవరూ తయారుచెయ్యరు. ఏదో విధముగా ప్రణాళికను రక్షించాలనే తాపత్రయంతో మామూలుగా మూడవ ప్రణాళికకు దాని మొదటిమూడేళ్ళలోను ఉపయోగపడవలసిన ధనసాధన సంపత్తిని ఇప్పటికే తాకట్టు పెటారని ఒక జర్నలిస్టు వ్రాయనే వ్రాశాడు. ఇది ఇలా ఉండగా, ప్రణాళిక సంఘ ఉపాధ్యక్షుడు రాష్ట్రాల ముఖ్యమంత్రులకు 'మీమీ బడ్జెట్లలో ఆయవ్యయాలను సరిపుచ్చుకోండి' అని హెచ్చరిస్తూ వ్రాసిన లేఖను అంతా ఆహా అంటే ఓహో అన్నారు. ఈ లేఖ కాపీని భారత ప్రధానికి కూడా పంపించి ఉండాల్సింది. ఇలాంటి సలహా లేకనే పాపం, ఆయన పార్లమెంటుకు లోటుబడ్జెట్ సమర్పించారల్లే వుంది. అసలు ఈ నాయనమ్మ సలహాలకి రాష్ట్ర ప్రభుత్వాలు అలవాటు పడిపోయాయి. వీటివల్ల జరిగేదీ, ఒరిగేది ఏమీఉండదు. ప్రణాళికా సంఘం మొదటి ప్రణాళికనుగూర్చి ఏటేటా ప్రచురించిన సమీక్షలుచూస్తే, రాష్ట్రాలు సేకరిస్తామని చెప్పినంతధనం సేకరించనే లేదనీ, ఆ లోటును ప్రణాళికా సంఘం కేంద్రం నుంచి తీసుకొచ్చి ఇచ్చి భర్తీచేసిందనీ తెలుస్తూనేఉంది. ఆర్థికశాఖ ప్రచురించే "ఎకనామిక్ సర్వే" లో ఇలా ఉంది:



## గమనిక

విలంబ సంవత్సర ఫలితాలు

వచ్చే వారం ప్రచురిస్తాము.

—సం॥

"ధరలు కొంచిగా తగ్గుముఖంపట్టినా, డబ్బు చెలామణీ పరిస్థితి ఇదివరకుకంటె కొంత మెరుగుగా ఉన్నా ప్రధానంగా ఆర్థిక పరిస్థితి ద్రవ్యోల్బణాభిముఖంగానే ఉంటోందని చెప్పాలి." పైన చేసిన పరిశీలనను బట్టి అంటే ప్రభుత్వ వ్యయం పెరగటాన్ని బట్టి, లోటు ఆర్థిక విధానం అనుసరించటాన్ని బట్టి, ద్రవ్యోల్బణం అంతకంతకూ ఎక్కువై, ధరలు పెరగటం, తద్వారా జీతాలు పెంచమని ఒత్తిడి పెరగటం, మళ్లీ దానివల్ల ఇంకా ధరలు పెరగటం ఇది ఇలా అనంతంగా సాగుతూనే ఉంటుందని స్పష్టమవుతోంది. పన్నులు చెల్లించేవాణ్ణి, ధర ఇచ్చి వస్తువులు కొనుక్కునే వాణ్ణి వెనకేసుకొస్తున్నానని కాదు ఉద్దేశం. ఎందుకంటే ప్రస్తుత సోషలిస్టు వ్యవస్థలో ఈ దుర్భర అవస్థలూ పట్టించుకునే వాళ్ళు, వీరి మొరాలకించేవారూ ఎవరున్నారు గనక? సుస్థిర ప్రభుత్వానికి పునాది అయిన సుస్థిర ఆర్థికవ్యవస్థగతి సంగతేమిటీ అని నా తహతహ.

ద్వితీయ ప్రణాళికకు డబ్బు చూపించటం కోసం సేకరించిన అదనపు పన్నుల ధనమంతా హరించుకుపోయిందనీ, ఇక ఋణంగా తెచ్చిన పణమే అభివృద్ధి కార్యక్రమాలకు చాలవరకూ ఆధారమనీ బడ్జెట్ వలన స్పష్టమవుతోంది.

* * *

వాటాదారులైన భారతీయ ప్రజలకు లాభాలు సంపాదించిపెట్టేందుకు మరొక ప్రభుత్వ పరిశ్రమను సిద్ధంచేశారు. హిందుస్తాన్ గృహనిర్మాణ కర్మాగారం వార్షిక నివేదిక ఇలా తెలుపుతోంది:—

"1955_56 సం॥ పు ఆస్తి అప్పుల పట్టిక లోంచి రూ. 4, 94, 186 నష్టాన్ని మరు సంవత్సరపు పట్టికలో చేర్చారు. ఈ కర్మాగారం ఒక ప్రైవేటు సంస్థతో కలిసి పని చేసిన 1953 ఏప్రిల్ 1 నుంచి 1955 ఆగస్టు 15 వరకూగల మధ్యకాలంలో ప్రభుత్వం వాటాకు వచ్చిన నష్టం రూ 5 లక్షలు. ఈ నష్టాన్ని ప్రభుత్వం రద్దుచేసేసింది. అందుచేత ఆకంపెనీ 1956_57 లో రూ 5818. 81 లాభం చూపించగలిగింది. లాభ నష్టాల పద్దులో మరు సంవత్సరానికి చేర్చిన నిలవ రూ. 44, 78,538. పునర్వ్యవస్థీకరణ పథకం ప్రకారం కంపెనీ తాలూకు అనుమతి పొందిన మూలధనం రూ. 75 లక్షలు, చెల్లించ

(46-వ పేజీ చూడండి]






"ఇదిగో విరుందు"—ప్రతిశుక్రవారము రేడియో సిలోన్ 41.72 మీటర్లమీద సాయంత్రం 6-30 నుండి 6-45 వరకు విని ఆనందించండి.





# వసంతోత్సవం

(సంగీత రూపకం)

జూలూరి
హనుమంతరావు

### పూలకన్నెలు:

వచ్చినదే క్రొత్త ఉగాది!
వచ్చినదే క్రొత్త గులాబి!
చిఱుగాలుల తరగలలో
చిఱునవ్వులు చిలికిచిలికి,
చిగురాకుల వెలుగులలో
చెలువమ్ములు నిలిపి నిలిపి॥ వచ్చి॥
కలకంఠుల గీతులలో
ఫలరసములు నింపి నింపి,
తొలిపంజల కాంతులలో
చెలువములను పంపి పంపి॥ వచ్చి॥
సుమనో మధువీధులలో
భ్రమరాలకు శ్రుతులు నేర్పి,
చవులూరెడి తావులలో
పవనాలకు రుచులు చేర్చి॥ వచ్చి॥

### మలయానిలుడు:

మంచు తెరల దుప్పటిలో
మాటుమణగి వణకి వణకి
తిలకింపవదేల నే?
పులకింపవదేల నే?
తలిరాకుల పవ్వళించి
కలలు గనెడి మల్లెమొగ్గ!
కనువిప్పవదేల నే?
మనసు విప్పవేల నే?
మలయగంధవహుడ నేను,
చెలుడ వసంతునికి నేను,
శుభవార్తలు తెచ్చితి నే,
సొగసు నగలు తెచ్చితి నే,
కనువిప్పవె మల్లికా!
కలలుగనకె మల్లికా!

### మల్లిక:

ఓహో మధు మలయానిలసఖుడా!
ఈ హాయికి తుదిలేదని చెప్పుడా!
వికసించెను మనసు తేనెలూర,
ప్రియుడు నన్ను కలియ బయలుదేర.
చైత్రరథముపై వసంతసఖుని విలాసాలు!
కనువిప్పిన చిఱుమల్లెల ఎలనవ్వుల చాలు
ఓహో మధురమలయానిల సఖుడా!
ఈ హాయికితుది లేదని చెప్పుడా!

### మలయానిలుడు:

మురువులు, ముచ్చటలు, నగవు
ముడుపులు, తెలివన్నెసిరులు,
ప్రియుని కానుకలివిగో, నవ
ప్రియగీతము లివిగో!
భ్రమరీవీణానాదము
రాణించెను నిదిగో
కొనవె మల్లికారాణీ!
వినవె మల్లికారాణీ!

### పూలకన్నెలు:

నగవుదొంతరలసిరిలో
సొగసు వయసు పొంగి పొంగి
సొగసు లూరు కదలికలో
నిగనిగలకు పొంగిపొంగి
వచ్చినదే క్రొత్త ఉగాది,
వచ్చినదే మల్లికమోవి.
చైత్రరథముపై వసంతవిభుడు,
సరసన మధుమలయ గంధవహుడు:
కళలూరెడినవ వసంత
కాలము మనకాలము.
సుమవసంత విభుడు లేక
నిముసము మనజాలము-॥వచ్చి॥

### మల్లిక:

పొగడకన్నె కనుసన్నల
నను వసంత విభుడు
నన్ను జూచి సుంతయినను
నవ్వబోవ డిపుడు.

### భ్రమర బృందం

ఝుంకారం...ఝుంకారం
మధుమాస శుభోదయ నవ
ఝుంకారం...ఝుంకారం
మల్లికాదేవేరి మందహాసము విరియ
మందహాసాలలో మా వసంతుడు మురియ,
మురువులందున విరిసి విరులు తేనెలు కురియ,
కురియు తేనెల భ్రమరకులము సాములు
సేయు.

ఝుంకారం...ఝుంకారం
మధుమాస శుభోదయ నవ
ఝుంకారం...ఝుంకారం
కోపమేలే మల్లికారాణీ!
సైపలేమే మల్లికారాణీ!
పొగడ కన్నెల జూచు
నగవు లేపాటివే?
నీ సొగసు నగవులో
నిలచె లోకమ్మురే ॥కోపమేలే॥

### పొగడకన్నె:

రావోయి రావోయి సామీ! నా మేని
తావులే వికసించె సామీ!
చిఱుగాలి తెరల వి
చ్చిన మనసు పులకించి
చిరుతేనె వాకలను
చిమ్మె నీకోసమై ॥రావోయి॥
ఈ నూత్నవత్సరము
నా నోము ఫలమేమొ



**"తెగిపోయిన తీగ"**

చిత్రకారుడు : అ. పైడిరాజు.

[ఇటీవల కేరళ ప్రభుత్వము చిత్రకళాప్రదర్శనములో ప్రథమబహుమానముగా బంగారుపతకము పొందిన చిత్రము.]

---

నినుజూచు నా కనుల
మినుకులు వికాసించె ॥రావోయి॥

**వసంతుడు :**

రావోయీ మలయగంధవహుడా!
పొగడకన్నె
కేవోయీ తావిసిరులు చెలుడా!
మొగలికన్నెలారా
పొగడ
మురువులు కనినారా!
పగటిపూట వెన్నెలలను
పఱచి నవ్వినారా?
జగజగమున చైతన్యము
జనియింపగ విరియండి.
అణువణువున ఆనందము
అవతరింప మురియండి.
మొగలికన్నెలారా!
పొగడకన్నెలారా!
కోయిలలకు గొంతులందు
కుహూగీతి నిలపండి.
నలుదిక్కులు వెలుగొందగ
చిలువపాడులు చిలకండి.
మావికన్నెలారా:
తావిపూవులారా!

**మల్లిక:**

మలయగంధవహుని రాక
మదిని పెంచె నాసలు
పొగడపై వసంతవిభుని
మురువుల నడియాసలు—
దక్షిణపవనము నెచ్చెలుడా!
తానొక దక్షిణ వాయకుడా!
ఎవరేవిన్నను నగిపోరే!
ఈ మల్లికగతి యేమనరే!
మిలమిలలాడుచు నాకర్షింపగ
మేని సొబంగులు పంపుదునా?
ఘుమఘుమలాడగ దశదిశలందున
క్రొత్తవాసనల నింపుదునా?

**భ్రమరబృందం:**

కోపమేలే మల్లికారాణీ!
సైపలేమే మల్లికారాణీ!
మల్లెలేని వసంతమా
వసంతము కాదు
నీవులేని వసంతుడా
వసంతుడు కాడు—

**సుమబాణుడు:**

అంది మొలయు మావికొమ్మ
లందు చిలుక తేజి.
చిందు తేనెలందు పదును
లందె పూలరాణి.
చెఱకువింట మల్లెతలపు
జిలుగు నారిత్రాత.
ఆవసంతవిభుని మనసు
నందు ప్రేమగీత.
రతీ రావె సతీరావె
రావె యిదే సమయము
పూవుటమ్ము బలముజూపె
రావె యిదే సమయము.

**వసంతుడు :**

మలయపవన చెప్పలేను
మనసులోన బరువుగా
హత్తుకొనెను తెలియరాని
మెత్తని సుమబాణము
మనసులోన వలపుచవుల
జానుపుతావు లేరివో
జిగిజిగిగా జగమువెలుగ
నిగనిగకళ లేరివో—
అదో మల్లెకన్నె!
అదో విరులమిన్న!

# వసంతోత్సవం

రావే నవపరిమళ సుమరాణీ!
రావే కళ లొలుకు మధురవాణీ!
మనలేనే నీవులేని
మనుగడ నిముసమ్మైగాని
కావవే మధుమాసములో
చనుదెంచిన సఖుని నన్ను— ॥రావే॥

మలయానిలుడు :

తలపుముడుల విప్పినదో,
వలపుపొదుల గుప్పినదో,
నవుతూపుల గుండెయలో
నాటెనో వసంతునిలో.
మల్లెరాణి జాణలే
మరులుగొలుపు వీణలే.

మల్లిక :

రావోయి రావోయి
రావోయి ప్రియసఖా!
నందనముగా హృదయ
మందిరము కళలూర
అందమ్మౌగా భ్రమర
బృందమ్ము రేతేర ॥రావోయి॥

భ్రమరబృందం :

మధుమాస సుమోదయ నవఝుంకారం
మధుపరిమళ మిళిత సుఖద ఝుంకారం
లలిత మల్లికా లవంగవిలసితాళిఝుంకారం
కలకూజితకోకిల శుకవలయిత నవఝుంకారం
వసంతోత్సవ ప్రముదిత రసాలముల
ఝుంకారం
ఫుల్లకుసుమమంజరీ ప్రపూత భ్రమర
ఝురకారం
ఝుంకారం...ఝుంకారం...ఝుంకారం.

పూలకన్నెలు :

నేడే మన వసంతోత్సవాలు
నేడే మన అనంతోత్సవాలు.
మలికోవసంత ప్రణయమాధురి
మనసులందు పొంగు ప్రేమ నిర్ఝరి,
వెన్నెలలై వెల్లువలై
ప్రియముగూర్చు నేడు— ॥నేడే॥
మాలతీ సుమాల తేనెసోనలు
మాధవీ సుమాల జలుగువానలు
అందములై చందములై
హాయిగూర్చు నేడు— ॥నేడే॥
కిసలయాల క్రొత్త పట్టుచీరలు
బిసరుహాముల కనుల స్వైరచారలు
సుఖదములై శుభదములై
సొంపుగూర్చు నేడు ॥నేడే॥
మావిచిగురు తోరణాల జిలుగులు
పూవు మొగ్గ ముగ్గులందు వెలుగులు
నిత్యములై సత్యములై
సొగసు గూర్చు నేడు ॥నేడే॥
తెలుగు పొలములందు గలుగు చేవలు
తెలుగు ప్రజల మనసులందు తావులు
భోగ్యములై భాగ్యములై
పొలుపుగూర్చు నేడు—
నేడే మన వసంతోత్సవాలు!
నేడే మన అనంతోత్సవాలు!





ఉగాదికి గృహాలంకరణ
—చిత్రకారుడు: జె. అప్పారావు, కాప్సాక్.




[ ఉద్యోగపర్వంనుండి ]

క. కురుసేనఁ గదా గెలుచుట, కరము భరం బర్జునునకు గాండీవమునం
బెరిఁగిన యమ్ములమంటల, దరికొని తెగఁ గాల్చునట్టిదయ యగుఁ జుమ్మీ.

వ. భీమార్జునుల కోలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ రెఱుంగుదు రెఱింగియు మానుషంబు వాటించి సేన మొగంబున నిలుతురు కీర్తి వట్టి ప్రాణంబులు విడుతు రింతియ కాని చేయునది లే దదియునుం గాక పౌత్రు లగుటయు శిష్యు లగుటయు గాంగేయునకు గురునకు సామాన్యం బగుటంజేసి రెండు దెఱంగులవారికి వీ రొక్క రూప మనకడ నున్న తప్పునకు మనముందట నిలువవలయు నను నింతమాత్రకుంగా వీరల కింత వలపె నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుం జాల మొదల విదురుం డే మని చాటి చెప్పె నది యంతయు బాటిలె జూదంబునాఁటనుండియుఁ గురుజాతికిం జేటు మూఁడుట దోఁచుచుండు మందబుద్ధియు లోభోపహతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుఁ డింత సేసెఁ గాలపర్యాయంబునఁ గౌరవులకుఁ గడవరానియవస్థ వచ్చె సంజయా నే నేమి సేయుదు నెందుఁ జొత్తు నెద్దియెరు వెవ్వరు శరణంబు వా రిరువురుఁ గలయంతటన పోయెనే విను మని మరియు ని ట్లనియె.

చ. అనుజులు నట్టివార ద్రుపదాదిసుహృజ్జను లెల్ల నంతకం
బెను బలవంతు లాహవపటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు స
ద్వినయ వివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు బంధుభృత్యులం
దనకు వశంబు సేసికొనుదానికి నేర్చుఁ బ్రభుత్వ సంపదన్.

ఆ. సత్యశౌచధర్మశాలి దయాపరుం, డట్టిధర్మపుత్రు నాక్రమింప
మనము దలఁచు టెల్ల మంటలో మిడుత లు, దగ్రవృత్తి నుఱుకఁ దలఁచునట్లు.

వ. కావునఁ బాండవులతోడి భండనంబునఁ గులక్షయం బగుట దప్పదు శాంతిఁ బొందుటయ మేలు మనవారల కది ప్రియం బగునేని దానికిఁ దగినయత్నంబు సేసెద ననిన విని ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె.

క. దేవర యానతి యిచ్చిన, యీ వాక్యము లెన్న నాఁడు నీవ యుపేక్షం
బో విడిచితి వింకను నీ, చే వత్తురు వారు వీరిచే టొప్పదు రే.

వ. అది యె ట్లంటేని.

క. వారు దెన లొత్తికొనియు ధ, రారాజ్యం బిచ్చి పోయిరా పోరా తా
రారణ్యపీడఁబడియును, రారాజుం జెఱుకుఁ బాపరా మన మెఱుఁగన్.

వ. అట్టియెడ నైనను.

క. రావించి తగవుమై నం, భావింపవ కాక నాఁడ పాండవు లలుకం
బో విడువరె మిగులుదు రే, నీవచనంబులకుఁ బిలిచి నిలుపుము వారిన్.

## దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరుల సామర్థ్యంబు సెప్పుట

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కి ట్లనియె.

చ. అడవులఁ గొండలం బడి మహాపద రూపఱి చన్నవారి ని
ప్పుడు కొని వచ్చి కృష్ణుఁ డొకపోవుగఁ గూటువమూఁకఁ గూర్చినం
బొడుతురె పాండునందనులు భూవర యేటికి నింతభీతి మా
కడిమియు లావు నీ వసదు గా గణుతింపకు గెల్తు మెమ్మెయిన్.

తే. పరశురాముని గెలిచిన బల్లిదుండు, భీష్ముఁ డవనీశ వీతని పేరు వినినఁ
బాఱుచుండుట యెఱుఁగవే పాండుపుత్రు, లనఁగ నెంతటివా రితం డలిగెనేని.

క. కృపుఁడును గురుఁడు నయోనిజు, లపరిమితభుజాబలాఢ్యు లాహవకేళీ
నిపుణు లజేయులు వీరలు, కుపితాత్మకులైన మాఱుకొనునే హరుఁడున్.

క. ఈశ్వరవరజనితుఁడు హరి, దశ్వప్రతిమానతేజుఁ డస్త్రకళాని
త్యైశ్వర్యధురంధరుఁ డీ, యశ్వత్థామ గలుగ మన కని వెఱ పేలా.

ఆ. సహజకుండలుండు శౌర్యధుర్యుఁడు సము, దీర్ణబాహుబలుఁడు గర్ణుఁ డిందుఁ
గలఁడు వీని కెదురు గలఁ డని యెన్నుమా, ధర్మపుత్రుపాల ధరణినాథ.

క. వినుము నరేశ్వర కర్ణుని, పెనుపు మహేంద్రుండు వచ్చి ప్రియమున శచికై
తను నర్థింపఁగ నిచ్చెను, గొను మని లోకంబు లెఱుఁగఁ గుండలయుగమున్.

వ. వీర లాధర్మపుత్రాదులచేతన కా దెవ్వరిచేతనుం జెడమి దెల్లంబు బాహ్లిక సోమదత్త భూరిశ్రవశ్శల్య సింధురాజ గాంధారరాజ ప్రభృతిమహావీరులు వీరలకంటెను శక్తిసమగ్రులో దక్కటి రాజలోకంబును సహాయులై వచ్చిన వివిధ దేశాధీశులును నా తోడి సుఖదుఃఖంబుల కియ్యకొని యగ్గలికమై నగ్గినైన నుఱుకను సముద్రంబైన నీఁదను దెంపు సేసి పొంపిరివోవుచున్నవారు గావునఁ బాండవులకు మాదిక్కు దేఱి చూడనుం గొలంది గా దనుమానింపకు మిట్లునుం గాక మాకు నెవ్వరును లేక చుట్టంబులును జెలులును విడిచి తోడు వచ్చినవారును విచ్చిపోయి భృత్యులును విరక్తులై వారిక పోటుమానుసులును బంధు మిత్ర సహాయులును ప్రజానురాగంబునుం గలిగినట్టి దైన నది ప్రాప్తకాలం బింతియ కాని యే మింక వారి యడుగు లొత్తను బాఱిపోవనుం జాల మెల్లభంగుల సమరంబు సేయుదుము తలపెట్టిన నాతలంచినట్లొండె వాసుదేవుండు దలంచినట్లొండె నయ్యెడు నెట్లయిన మే లింతవట్టును నిర్ణయంబని పలికి మఱియు నిట్లనియె.

తే. కులములోఁ దలవం పగు కూడు గుడువఁ, బంపఁ జూచెద వోకళులఁ బఱతురట్టి
వారు పైనెత్తి వచ్చినఁ బోరి కోప, మనిన ధృతిచేట కాక పొందగునె చెపుమ.

క. నీవు బతిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలక యిమ్మై
వావిడిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను నే మన నేర్తున్.

తే. భీమసేనుని నీ వింత పెద్ద చేసి, పెక్కుభంగులఁ జెప్పితి యుక్కుగలఁడు
గదకు నేర్పునం చెంతయు బెదరె దతఁడు, నన్నుఁబోలమి యెఱుఁగవే నరవరేణ్య.

మ. గద నాతో సరి మూఁడులోకముల నేఁ గానం జలం బెత్తి యు
న్మదుఁ డాభీముఁడు నన్ననిం దొడరిన న్వజ్రప్రహారంబు బె
ట్టిద మై తాఁకినఁ గూలు పర్వతముమాడ్కిం గుంభినిం గూల వ్రే
సెద నాకోర్కి గదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్.

ఆ. అతఁడు వడిన వెండి యాసేనఁ గోల్తల, సేయ నొకఁడు లేమి సిద్ధ మింత
యెఱిఁగి వెఱచికాదె యేనూళ్లలైనను, దమకుఁ జాలు ననియె ధర్మసుతుఁడు.

వ. అర్జునుండు గలం డని తలంచితి వేని.

తే. కర్ణువడసిన యాశక్తి గలుగఁ బోర, బ్రదుకవచ్చునె నరునకు నదియుఁ గాక
యతని భీష్మాదిరథికుల యతులితాప్ర, మేయదివ్యబాణంబులు ప్రమింగికొనవె.

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదు లగు నీకొడుకు లొకం డొకండ జగంబు లెల్ల జయింపఁ జాలుదు రందఱు నొక్క మొగంబై త్రోచి నడచిన సవ్యసాచి నొక్కరుని న కాదు పాండవుల నెల్ల నొక్కెత్తున వైచికొన నోపుదు రట్టునుం గాక మాకు నక్షౌహిణులు పదు నొకండు వారికి నేడక్షౌహిణులు మాసైన్యంబు సారవంతంబు వారిబలంబు నిస్సారంబు వారు మమ్మెవ్విధంబున జయింపనోపుదు రీ యెక్కుడుదక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముక్కుఱి వగచుచున్నవాఁడవు నిన్ను వగవకుండ నుడుపం జాల మంతియ కాని తక్కెల్ల పనులకుం జాలుదు మని పలికి సంజయుదెసఁ గనుంగొని సుయోధనుం డిట్లనియె.

క. నానాదేశంబుల బలు, మానుసులం గూర్చికొని సమత్సరబుద్ధిం
దా నే మనియెడు నయ్యమ, సూనుం డతని తెఱంగు సూతము చెపుమా.

వ. అనిన విని సంజయుం డిట్లనియె.

## సంజయుఁడు దుర్యోధనునకు ధర్మరాజునిశ్చయం బెఱింగించుట

ఉ. ఆతఁడు భండనం బనిన నార్చిన మూఁరేఁడు వేర్చు నెంతయుం
ప్రీతి వహించి తమ్ము లొకపెండ్లికిఁ బోయెదునట్లు యున్న వా
రా తెలి వెందునుం గలదె యందలినాయకు లెవ్వ రొక్కొ మా
చేతులతీఁట వుత్తు మను చిత్రమ కాని చలింప రేమియున్.

తే. నరుని పాశుపతాది బాణముల పెంపు, భీముగదసొంపు నమ్మి యుద్దామలీలఁ
జెలఁగి వెఱ పేది యక్కడిబలము ముసురు, గవిసి యెపుడు గయ్యమునకుఁ గాలుద్రవ్వు.

క. నావుడు నిది యౌ సంజయ, కైవారము సేసె దీవు కౌంతేయుల వా
రేవి రణసాధనమ్ములు, గా వెఱవక నడచువారు కౌరవులపయిన్.

వ. అనిన సుయోధనునకు సూతనందనుం డర్జును దివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవదత్తంబుల మహానుభావంబులు వేఱు వేఱ వర్ణించి చెప్పి యుధిష్ఠిర భీమ నకుల సహదేవుల యరదంబులు దురంగాది పరికరంబు లిట్టిట్టి వని యేర్పడం బలికి విరాటద్రుపదాదులకు వలయు నుపకరణంబులు గొఱంతలేమియు నెఱింగించిన ధృతరాష్ట్రిం డిందుఁ గల బలమానుసు లెవ్వరికి నసాధ్యులు వీరి సాధించు తెఱం గూహించిరే యని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె.

సీ. గంగాసుతుండు శిఖండి పాలతనికిఁ ద్రాపు మత్స్యేశ్వరుబలము గుంభ
భవుఁడు ధృష్టద్యుమ్ను పా లతనికిఁ దోడుపడు ద్రౌపదీపుత్రపంచకంబు
రారాజుఁ దమ్ములు మారుతిపాలు కుమారు లందఱు నభిమన్యుపాలు
శకునిసైంధవులు నశ్వత్థామకర్ణులు దక్కొరుచేఁ బోనిదండిమగలు

ఆ. సవ్యసాచిపాలు సాత్యకిపా లక్కృత, వర్మ చేకితానవసుమతీశు
పాలు సోమదత్తుఁ డాలంబునకు నిట్లు, నిశ్చయించి రచట నృపవరేణ్య.

క. నకులుఁడు సహదేవుండును, శకుని నులూకాదిసుతుల సారస్వతులం
బ్రకటబలు లైన కాళిం, గకులను సమయించువారు కౌరవనాథా.

క. కేకయులు మనలఁ గలసిన, కేకయుల జయించువారు కృతపుణ్యుఁడు సు
శ్లోకుఁడు ధర్మతనూజుఁడు లోకోత్తరు శల్యుఁ దా గెలుచువాఁ డధిపా.

వ. అట్టి పలుకుల సమయంబున నచ్చోటఁ గొందఱు జనంబులు ధర్మనందను నుద్దేశించి.

క. ఇతఁ డెక్కడ మద్రమహీ, పతి యెక్కడ నితని కతఁడు పాటియె యనుచుం
బ్రతివచనంబుల శల్యుని, యతిబలశౌర్యములు వారి కాతఁడ చెప్పెన్.

వ. ఇట్లు గాకయు నెవ్వరిమొగంబున నెవ్వరు వడిరి వారికి వార చాలియుండువా రని రివ్విధంబునఁ గ్రొవ్వు మిగిలి కొఱంత లేని తెగువం దేజరిల్లుచున్నవారు నీకు నీకొడుకునకు నెయ్యది గర్జంబై తోఁచె నదియ చేయుం డనిన విని విచిత్రవీర్య తనయుం డి ట్లనియె.

క. నాకొడుకుల కెక్కడి భ్రదు, కేకొలఁదిఁ దలంప నివ్వ డెన్నిన వీరా
నీకంబు నోర్వవచ్చునె, యీ కూడినసైనికులకు నే మనువాఁడన్.

క రాజ యుధిష్ఠిరుఁడై హరి, దా జయ మొడఁగూర్పనున్నఁ దత్సైన్యము రా
రా జెట్లు సరకుసేయమి, నాజన్మము దుఃఖభాజనం బగుటఁ జుమీ.

క. నా కుడుప నేల వశ మగు, నీకూడినభూపతులకు నింతియకాలం
బై కడ చన్నది సంజయ, నీ కీవగ నేల యింక నిలుపుము పలుకుల్.

వ. అనిన విని దుర్యోధనుండు విజజనకుతో ని ట్లనియె.

ఉ. ఏమును బాండునందనులు నేకకులంబునఁ బుట్టి యొక్కచో
నే మొకఁ డైనఁ జేసి గెడ నెప్డు చరించినయట్టివార ము
ద్దామబలంబు శౌర్యమును దర్పము వారిక కల్గి వార నం
గ్రామమునన్ జయింతు రనఁగా నొకనిశ్చయ మెట్లు గల్గెడున్.

ఉ. వారిని వారివారి నిటు వర్ణన సేసెదు గాని మమ్ము మా
వారిఁ దలంప విప్పుడమి వారికిఁ బాయను మాకు నంతయుం
జేరను ముఖ్య సృజించె విధి సిద్ధము దీని నొకండు మాన్పఁగా
నేరఁ డకారణంబ మది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్.

వ. అనిన విని సూతనందనునకు నంబికానందనుం డిట్లను నాకొడు కున్మత్తప్రలాపంబులు సేయుచున్నవాఁ డింతియ కాని సత్యధర్మనయపరాక్రమ సహాయ సంపన్నులైన పాండవులఁ దనకు గెలువ వచ్చునే తాను ద్రబలుం డయినను బెనఁకువ గీడ కాక మే లగునే యది యట్లుండె నొక్కటి యడిగెద సంజయా చెప్పుము.

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికుట్టుమాటలఁ దచ్ఛ
త్రము లుడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించువా రచట నెవ్వరొకో.

క. నావుడు సంజయుఁ డిట్లను, దేవా పాండవులయలుక ధృష్టద్యుమ్నుం
డేపెరవు మాటనైనను, నే వోసిన యగ్నిభంగి నిగుడం జేయున్

వ. అతండు ధర్మతనయుతో నిట్లను గాంగేయకుంభసంభవాది మహావీర క్రూరసత్త్వ బహుళంబును గరిఘటాగిరికదంబ కలితంబును దురంగనికరతరంగపరంపరా ఘోరంబు నగు కౌరవసేనాసముద్రంబునకు నే నొక్కఁ చెలియలికట్టనై నిలిచెద ననవుడు నయ్యుధిష్ఠిరుండు నీ వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే యెట్లును సంగరంబున మ మ్ముద్ధరింపు మనియె నిట్లు గొనియాడిన నాతండు నాదెసం గనుంగొని సంజయా మీవారల కెల్లనుం దెలియం జెప్పు మీశ్వరాదిదేవతలు సమకట్టినసవరణగల యర్జునుచేత నిర్జింపంబడిన యుత్కృష్టజాతు లనేకు లగుట యెఱుంగుదుర కాదె మనుష్యు లతని కెంత పెద్ద యిట్టిజెట్టి వెన్ను దన్ని చూడఁగలవాఁడు గావున మముబోం ట్లెల్లఁ బోక పెనంగినం బోరుభరంబైనం బ్రాణంబులపై వచ్చునంతకంటెను బరమదయాపరుండైన పాండవాగ్రజు మఱువు సొచ్చి బ్రదుకుండను మంత లంతలు దప్పులు సేసితి మని తలంక వలవ దెంతలు సేసినను గాంతేయ పూర్వజుండు శాంతిసుధానిధియగుటం జేసి శరణు సొచ్చినం గాచు నని పలికె ననిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనున కిట్లనియె.

క. పరిజనులకు నీకును ని, ద్ధరలోన నగంబు సాలుఁ దక్కటినగముం
గర ముచితంబుగఁ బాండవ, వరుఁ డగు ధర్మజున కిచ్చి బ్రదుకుము నెమ్మిన్.

## ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుతో సంధి సేయు మని చెప్పుట

చ. పెనఁకువ నాక యేల మన పెద్దల కెవ్వరి కియ్యకోలు గా
దనుచితవృత్తి గాన గురుఁ డాదిగ నాప్తులు బంధుమిత్రులుం
గొనకొని పోరికిం జొర రకుంఠితతేజుఁడు ధర్మపుత్రుఁ డా
తనిఁ దగఁ గూడి మన్కి ప్రమదంబగుఁ గౌరవజాతి కెంతయున్.

వ. అని వెండియు.

క. కర్ణుండు రేఁచి పెట్టఁగ, దుర్ణయపరులైన శకుని దుశ్శాసను లీ
నిర్ణయమె మే లనఁగ నీ, కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్.

వ. అనినఁ గటకటంబడి సుయోధనుం డి ట్లనియె.

క. నీచెప్పెడి పెద్దలు ద్రోణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లనివా
రై చేరనివారిం గొని, యే చక్కంబెట్టువాఁడ నేఁ బాండవులన్.

శా. రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నొండొకఁడు నాకుం దోడె నీ వింక నఘ
బాధం బెట్టకు వాఁడిసూదిమొన మోవం జాలునంతైన నే
నీధాత్రీతల మీను వారలకు నా కే లింత నేగిం బడన్.

వ. అనిన గాంధారీవల్లభుం డతని కి ట్లనియె.

ఆ. నీకు నంత వగవ నీపోవు తెరువునఁ, బోవువారు గాఁగఁ బూని యున్న
వారి కెల్ల నేను వగచెదఁ గయ్యంబు, వలవ దుడుగు మయ్య చలము గొనక.






నిద్రనుంచి లేచీ లేవగానే చక్కగా సూర్యుని ధ్యాన నిమగ్నులయ్యారు సుబ్రహ్మణ్యంగారు. కొంతసేపటి తర్వాత "ఈరోజు అంతా సవ్యంగా జరిగిపోవాలి" అనుకొని కళ్ళు తెరిచారు.

ఆదివారంగనక ఆయన లేచేసరికి ఉదయం తొమ్మిదయింది. ఆయన భార్య సూర్యకాంతం ఇంట్లోనే వున్నప్పటికీ, ఆయన అంతసేపూ పడుకొనేవున్నా లేపకపోవటానికి కారణం అది ఆదివారం కావటమే!

కళ్ళు తెరిచి, చెవులు 'వంటింటిరేడియో' గ్రాహకయంత్రంగా సిద్ధంచేసుకొనేసరికి—

"సుధాకరంసార్! ఎక్స్‌ప్రెస్ లెటర్" అని తపాలాబంట్రోతు కేక వినిపించింది.

"వచ్చితిమి" అనుకొని లేచి, వీధి వాకిలి దగ్గరకు వెళ్ళారు.

"మాఅబ్బాయి లేడు. ఉత్తరం సంతకం చేసి నేను తీసుకోవచ్చుగదా!" అని చెయ్యి ముందుకు చాచారు.

"ఓ ఎస్, తీసుకోవచ్చును సార్" అని అతను సంతకంకోసం ఒక కాగితం ఇచ్చాడు. అందులో ఒకటో అంకె వున్న చోట సంతకం చేసి, ఉత్తరం తీసుకొని కవరుమీద అక్షరాలు చూస్తూ సుబ్రహ్మణ్యంగారు లోపలికి తిరి

# ★ సుభాషిణి ★

గారు. మామూలుగా ఆయనకు కుమారుడికి వచ్చే వుత్తరాలు చూసే అలవాటు లేదు. అది జరూరు ఉత్తరం కావటంచేత 'ఏదైనా' ఉద్యోగం వచ్చేవిషయానికి సంబంధించిన దేమో అనే ఆశచేత 'ఎక్కణ్ణుంచా' అని చూశారు.

ఆయన గుండె నిజంగా ఒక్కసారి ఆగి వేగంగా కొట్టుకోసాగింది. చెమటపోసింది. ఆ ఉత్తరాన్ని గట్టిగా చేతిలో పట్టుకొని, నిలువునా నిల్చుని, కళ్ళుమూసుకొని రెండు నిముషాలు 'పరమేశ్వరా' అని ధ్యాననిమగ్ను లయ్యారు. అప్పుడే ఎదురుగా సూర్యకాంతం వచ్చినిల్చుని ఉత్కంఠతో భర్తనుచూసింది. మొదట చేతిలో ఉత్తరం వుండటంచేత సంతోషం కలిగ చిరునవ్వు నవ్వింది. తర్వాత ఆయన ధ్యాననిమగ్నత చూసి గాభరాపడి నిల్చిపోయింది.

ఆయన కళ్ళు తెరిచారు. ఎదురుగా భార్య కనిపించింది. వెంటనే ఉత్తరాన్ని జేబులో వుంచేశారు.

'ఆ ఉత్తరం ఏమిటండీ' అని ఆమె అడగాలనుకొంది. కానీ ఆయన ఉత్తరాన్ని జేబులో దాచడంతో 'ఏదోలే' అని వూరుకొంది.

"ఇవాళ చాలఆలస్యంగా లేచారు. ముఖం కడుక్కోండి. కాఫీ తయారయింది" అని లోపలికి వెళ్ళిందామె.

ఆయన గదిలోకి వెళ్ళి మళ్ళీ మంచంమీద కూర్చున్నారు. మరోకసారి కవరు చూశారు. కవరుమ ఊరికే అటూ ఇటూ త్రిప్పిచూశారు అయినా చించడానికి మనస్కరించలేదు. దగ్గరవుంచుకొని అబ్బాయి రాగానే అడిగి తెల్సుకోవడమే మంచిదనుకొన్నారు. ఉత్తరాన్ని డ్రాయరులో పడేసి పెరటిలోకి వెళ్ళిపోయారు.

సుధాకరం వచ్చేవరకు—ఆయన ఆలోచిస్తూనే వున్నారు.

'ఎవరీ సుభాషిణి? ఎంతధైర్యంగా ఉత్తరం రాసింది. నిజానికి ఆడపిల్లలు ఉత్తరాలు రాయకూడదని కాదు ఆయన అభిప్రాయం. కానీ తన కొడుక్కు ఈ అమ్మాయెవరో ఉత్తరం రాయటంలో ఉద్దేశం ఏమైనా వుండొచ్చునూ అని!

ఉదయం కాఫీ కాగానే ఆయన భార్య సూర్యకాంతంతో అన్నారు.

"నేను నీకెప్పుడైనా...ఇన్నేళ్ళ మన జీవితంలో ఎప్పుడైనా ఉత్తరం రాశానా?"

"అయ్యో! మనకంత అదృష్టంకూడానా! ఒకసారి మీరు మద్రాసుకు పనిమీదవెళ్ళి పదిహేను రోడులుండి పోయారు. అన్నాళ్లూ ఒక కార్డు ముక్కన్నా రాయలేదు. మీ స్నేహితుడికి మాత్రం రోజుకో పెద్ద ఉత్తరం రాశారు. అసలు నేను లేనప్పుడు మీకు జ్ఞాపకం వుంటానా అని నేను ఒకసారి పుట్టింటికి వెళ్ళి రెండు నెలలున్నాను. మీగురించి ఒక్క విషయం తెలియక చచ్చిపోయాను. కానీ మీరుమటుకు "ఏం సూర్యకాంతం బావున్నావా!" అని ఒకముక్క రాయలేకపోయారు. చెప్పాచ్చారిప్పుడు..."

తెంపలేసుకున్నారాయన.

"పోనీ ఇది చెప్పు. నువ్వు నా కెప్పుడైనా ఒక ఉత్తరంలాంటిది రాశావా! పోనీ ఇంత చరికైనా రాశావా"

"అయ్యో! ఎంత మాటన్నారూ! ఇన్నాళ్ళ బ్రతుకులో లేనిది ఇప్పుడేమిటి మీకు ఉత్తరాలమీద ఏదో మోజు కలిగి నట్టుంది. రోజుకో ఉత్తరం రాస్తారా చెప్పండి. కొన్నాళ్లు హాయిగా మా పుట్టింటికి వెళ్ళికూర్చుంటాను."

"ఇక లాభంలేదు" అని ఆయన అక్కణ్నుంచి లేచి తన గదిలోకి వెళ్ళిపోయారు.

'తన భార్య అట్టే చదువుకోకపోవడం ఎంత దురదృష్టం. నిజానికి ఆమె తనదగ్గర లేనప్పుడు తనకు ఆమెతో ఎన్నో చెప్పాలనిపించేది. కానీ ఎలా చెప్పగలుగుతాడు. ఉత్తరం రాస్తే, ప్రతివాక్యమూ 'తను రాసిన ఉద్దేశంతో' ఆమె ఎలా అర్థం చేసుకోగలుగుతుంది! అందుకని ప్రతి భావాన్నీ తనలో తాను చంపుకోవలసి వచ్చేది. ఇట్లా ఎన్నో గొప్ప గొప్ప భావాల్ని తను చంపేసుకొన్నాడు.

'మనిషి' అన్నవాడికి మనిషివంటి భార్య అత్యవసరం. బాగా చదువుకొన్నవాడూ విజ్ఞుడూ, సంస్కారీ అయిన మగవాడికి తెలివిగల చదువుకొన్న భార్య అవసరం, అదీ నిసలైన దాంపత్యం. అదే...ఒక పల్లెలో వెంకయ్యకు అతనిలాగే కష్టపడగలిగినదీ, జీవంవున్నదీ అమాయకురాలూ అయిన పిల్ల పెళ్ళామయితే అందులో 'మజా'వుంటుంది. మంచి బరువువేసిన బండికి మంచి హుషారయిన ఎద్దుకట్టేవుంటే 'ఇది' ఇంకెందులో వుంటుంది!

అందుచేత బియ్యే పాసయి నేడో రేపో ఉద్యోగంలో ప్రవేశించబోతున్న తనకొడుకుకు చదువుకొన్న ఒక అందమైన, చురుకైన అమ్మాయిని పెళ్ళిచేసుకోవడం సబబుగానే వుంటుంది. పెళ్ళికి ముందు 'పిల్లా' 'పిల్లవాడూ' ప్రేమించుకోవడం కూడా ఆరోగ్యకరమైనదే. కానీ ఇలా పెళ్ళికాకముందే ఉత్తరాలు రాసుకోవడం తనకెందుకో ఇష్టపడడంలేదు. ముఖ్యంగా ఓక పెళ్ళికాని ఆడపిల్ల, ఒక పెళ్ళికాని యువకుడికి ఉత్తరమనేది రాయడాన్ని, 'తన సనాతనపు బుద్ధి' అంగీకరించలేకుండా వుంది.

ఇంతకూ ఈ అమ్మాయి ఎవరయి వుండొచ్చు. కాలేజీలో కూడా చదువుకొందేమో...కానేకాదు. అలా అవడానికి వీలు లేనేలేదు. ఆ కాలేజీలో ఆడపిల్లలు చదవరు. వాళ్ళకు వేరే కాలేజీవుంది. ఎక్కడైనా స్నేహితులింట్లో చూసుకొన్నారేమో... ఏమో... ఎవరయినా కావచ్చు. ఎక్కడైనా కలుసుకొని, ఒకర్నిగురించి ఒకరు తెలుసుకొని, ఒకర్ని ఒకరు ఇష్టపడి ప్రేమ కుదిరిపోయి

వుండొచ్చు. అవును అంతే... "హరహరా... సాంబశివా... ఏమిటి నన్నింత దుర్బుద్ధి చేశావేమిటయ్యా! స్వామీ! క్షమించు" అని వెంటనే ఆయన మానసికంగా లెంపలు వేసుకొని ధ్యాననిమగ్నులయిపోయారు.

అట్లా ఆయన కొంతసేపు మాత్రమే ధ్యానంలో వుండగలిగారు. మళ్ళీ ఆలోచనలో పడిపోయారు.

తనకొడుక్కి ఎవరూ కానీ కట్నం ఇవ్వవలసిన అవసరంలేదు. మగవాడు ఒకడు ఇచ్చినా బాగుపడుతాడు. స్వశక్తితో బాగుపడుతాడు. అమ్మాయి మంచిది కాకపోతే... ఎంతకట్నం వచ్చి ఏంలాభం? అబ్బాయికి అమ్మాయి నచ్చితే చాలు. ఉన్నది ఒకేకొడుకు. తను అతనికి పెద్ద ఆస్తి మిగల్చకపోయినా బియ్యేవరకు చదివించాడు. కావలిస్తే ఇంకా చదువుకొంటాడు. ఏదో ఒక ఉద్యోగమంటూ రాకుండాపోదు. స్వంతానికి ఈ ఇల్లుంటుంది. ఇంతకన్న ఏంకావాలి మనిషికి?

అదీగాక ఈమధ్య సుధాకరం ఒకకథ రాశాడు. అందులో ఒకయువకుడు చస్తే కట్నం పుచ్చుకోనని ప్రతిజ్ఞ చేస్తాడు. అదే కథలో మరో అమ్మాయి తనుచస్తే కట్నమడిగేవాణ్ణి పెళ్ళిచేసుకోనని పట్టుపడుతుంది. చివరికి ఈ అమ్మాయికి తగిన వరుడూ లభిస్తాడు; అబ్బాయికి తగిన వధువూ లభిస్తుంది! దీనినిబట్టి అబ్బాయికి కట్నం పుచ్చుకోవడం ఇష్టంలేదని అనుకోవచ్చు. నిజానికి తనకూ ఇష్టంలేదు. ఈమధ్య ఒకరు నాలుగువేలు కట్నమిస్తామని వస్తే తను అదే చెప్పాడు. "మా అబ్బాయికి మీ అమ్మాయి నచ్చడం అతిముఖ్యం. కట్నం విషయం కూడా అతని ఇష్టాయిష్టాలమీదనే ఆధారపడి వుంటుంది" అని. తను ఐదువేల రూపాయలు కట్నం తీసుకొన్నాడు. తీసుకుంటే ఏమయింది! దానితో తను బాగుపడ్డాడా? లేదు. ఆడబ్బుతో వ్యాపారం పెట్టారు. రెండేళ్ళలో ఆ వ్యాపారం దివాలా తీసింది. ఆ దిగులుతోనే తండ్రి ప్రాణం వదిలాడు. ఆయన పోయింతర్వాత తనకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. చాల పెద్దవాడయ్యేవరకు కూడా తను తండ్రి సంపాదన మీదే ఆధారపడుతూ, ఆయనకు అన్ని పనులలోనూ సహాయంగా వుంటూ, చాల హాయిగా గడిపేశాడు. అట్లా తనుబ్రతికి వున్నంతవరకు తన కొడుక్కికూడా హాయిగా బ్రతికే హక్కు వుంది. ఎందుకో తనకు చాలా కాలంగా ఒక అనుమానం, ఒక భయంవంటిది పీడిస్తోంది. తన కొడుక్కి కట్నం తీసుకొంటే తనుకూడా తండ్రిలాగు రెండేళ్ళలో చచ్చిపోతాడేమో!...... సుబ్రహ్మణ్యంగారు ఈ రీతిని సాయంకాలం సుధాకరం వచ్చేవరకు ఆలోచిస్తూనే వున్నారు.

సుధాకరం రాగానే ఆయన అతన్ని తన గదిలోకి పిలిచారు.

"నీకు ఏదో ఉత్తరం వచ్చినట్లుంది. చూడూ," అని తాపీగా ఉత్తరం తీసి యిచ్చారు. అతను అక్కడే ఆ కవరుచించి ఉత్తరం చదువుకోసాగాడు. ఆయన అతని ముఖంలో భావాలకోసం వెదుకుతున్నారు. సుధాకరం ముఖంలో ఎక్కువ మార్పేమీ కనిపించలేదు. ఒక్క చిరునవ్వుతో ఉత్తరం కవరులో వుంచి, జేబులో వుంచుకొని, చక్కా తన గదిలోకి వెళ్ళిపోయాడు. ప్రశ్నకు జవాబు దొరకని విద్యార్థిలా నిల్చుండిపోయారు సుబ్రహ్మణ్యంగారు.

మళ్లీ ఆ రాత్రి భోజన సమయంవరకు ఆ విషయమే ఆలోచిస్తున్నారు.

'ఆ అమ్మాయెవరో వెంటనే పెళ్ళి చేసుకొందామని రాసిందేమో. అందుచేతనే ఇప్పుడే ఏంపెళ్లి' అని చిరునవ్వు నవ్వాడేమో సుధాకరం! 'ఇప్పుడే ఏం' అని ఎందుకనుకోవాలి. ఇంతవయస్సులో ముగురు పిల్లల్ని కన్నవాళ్ళను తనెరుగును. తనుకూడా ఈ వయసులోనే పెళ్ళి చేసుకొన్నాడు. నిజానికి 'పెళ్ళి వయసు' అంటే ఇదే. తను ఇదివరకు చాలా పనులలో నిమగ్నుడై వుండటంవల్ల కొడుకు పెళ్ళివిషయం అంత శ్రద్ధగా ఆలోచించలేదు. చూడగా చూడగా ఇప్పుడు తన తక్షణ కర్తవ్యం కొడుక్కి పెళ్లి చేయడమే ననిపిస్తోంది. పెళ్ళి చేయదలచుకుంటే, సుధాకరం పెళ్లి చేసుకోడానికి సిద్ధంగా వున్నట్లయితే, తన ఎరుకలో ఇద్దరమ్మాయిలు చాల ఉత్తములైన వారున్నారు. అందులో ఎవరిని కావలసినా సునాయాసంగా కోడలుగా తెచ్చుకోవచ్చు. ముఖ్యంగా సూర్యనారాయణమూర్తి గారమ్మాయి అందంగా వుండటమేగాక చదువుకొన్నది. తెలివైనదీ, వినయవతి కూడాను. అలాంటిదయితే ఇంట్లో ఏరగడా లేకుండా చాలా సాఫీగా జరిగిపోతుంది.

హఠాత్తుగా ఆయనకు ఒక అతిముఖ్యమైన విషయం జ్ఞాపకంవచ్చింది. ఆ జ్ఞాపకం ఆయన్ను ఆనందపరవశహృదయుణ్ణి చేసి వేసింది. సూర్యనారాయణమూర్తిగారమ్మాయి పేరు 'సుభాషిణి' అని ఠక్కుమని జ్ఞాపకం వచ్చింది. దానితో ఇంక 'ఇదేదో తొందరగా తేలిపోవాలనే' తొందర ఎక్కువైంది. అయితే ఈ విషయాన్ని ఎట్లా తేల్చాలో మాత్రం ఆయనకు బోధపడలేదు. తనంత పెద్దవాడు. "అబ్బాయ్. నీకెవరో ఆడపిల్ల ఉత్తరం రాసినట్లుంది. ఆ అమ్మాయెవరూ... ఏం రాసిందీ కాస్త చెబుదూ" అని ఎలా అడగటం? అందుకని ఇక అడగక్కర్లేదని తేల్చుకొన్నారు. 'సుభాషిణీ' అంటే ఆఅమ్మాయే అయివుంటుంది. తనతో సుధాకరం సూర్యనారాయణమూర్తిగారింటికి రెండుసార్లు వచ్చాడుకూడాను. అప్పుడు ఒకరొకరు చూసుకోవడం తటసించి వుంటుంది. ఆ అమ్మాయి నీడంటే తప్పకుండా ఇష్టం కలిగివుంటుంది. అంతా తల్లిపోలిక; చక్కగావుంటాడు. ' ఎవరైనా ఇష్టపడాల్సిందే!

ఒక నిశ్చయానికి వచ్చి ఆయన వెంటనే సూర్యనారాయణమూర్తిగారికి ఒక ఉత్తరం రాసేశారు. ఉత్తరంసారాంశం "అయ్యా... మా అబ్బాయి మీ అమ్మాయి ప్రేమించుకొన్నారు. రోజులు మారిపోయాయి. మనం వాళ్ళ ఇష్టప్రకారం నడచుకోవడం ధర్మం. ఏమంటారూ?" అని ఆ ఉత్తరం 'ఉత్తర' వేగాన చిరునామాదారుకు వెళ్ళిపోయింది!

అయితే ఆరాత్రి భోజనం చేస్తున్నప్పుడు ఒకవిషయం జరిగింది

"నేను రేపుఉదయం బయలుదేరి విజయవాడ వెళ్ళాలి నాయనా! అక్కడ స్నేహితుడొకాయన 'సుభాషిణి' అని ఒక పత్రికను ఎల్లుండి సాయంకాలం ప్రారంభోత్సవం జరిపిస్తున్నాడు. ఈ రోజువచ్చిన ఉత్తరం అక్కణ్ణుంచే వచ్చింది;" అన్నాడు సుధాకరం.

సుబ్రహ్మణ్యంగారు విస్తుపోయారు. ఒక్కక్షణం అక్కడే కళ్ళుమూసుకొని "స్వామీ! నేను అనేకదౌర్బల్యాలు కలిగిన సామాన్య మానవుణ్ణి. వాటికి అతీతుణ్ణి కాలేను క్షమించు" అనుకొన్నారు.

"సరే... వెళ్ళిరా" అని వూరుకొన్నారప్పటికి.

మరునాడు సుధాకరం వెళ్ళిపోయాడు. ఆ మరునాడు సూర్యనారాయణమూర్తిగారి నుంచి ఉత్తరం వచ్చింది.

"సుబ్రహ్మణ్యం గారికి,

నమస్కారాలు. మీ ఉత్తరం ఇంతక్రితమే అందినది. మా అమ్మాయి, మీ అబ్బాయి ప్రేమించుకోవడం చాల హర్షదాయకమైనది. మీరుకూడా సుముఖంగా వున్నందుకు మాయింట్లో అందరూ చాల సరదా పడిపోతున్నారు. అన్నట్లు మా అమ్మాయిపేరు మీరు కొంత తప్పురాశారు. బహుశః రాసేప్పటి పొరబాటయివుంటుంది. మా అమ్మాయిపేరు సుభాషిణి కాదు. 'సుహాసిని!' నేను రెండురోజుల్లో అక్కడికి వస్తున్నాను. అన్ని విషయాలూ సమక్షంలో మాట్లాడవచ్చును :

ఇట్లు,
భవదీయుడు,
సూర్యనారాయణమూర్తి."

ఆనందంతో ఆయనకళ్లు ఆర్ద్రములైనాయి. "పేరేదయితేనేం! నువ్వు తప్పకుండా 'సుభాషిణి' వవుతావు తల్లీ!" అని కళ్ళు మూసుకొని ధ్యాననిమగ్నులయిపోయారు.



# చూడండి! సన్‌లైట్

## సగంబిళ్ల మాత్రమే ఈ బట్టలన్నిటిని ఉతికింది!

అట్లు చేయునట్టిది ఆ

<u>అధికమైన నురగ!</u>




## సన్ లైట్ సబ్బు

బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును!

S. 249-X52 T L.

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి ఒక తయారు.

# పంచాంగప్రసక్తి

పేరంటమున కేగు పిన్న బాలిక వాలు జడలో మల్లెపూవు కనిపించినప్పుడు, శీతోదక స్నానజాత సౌఖ్యముపైన ముకు పుటాన చెమర్పు పుట్టినప్పుడు, ఒకదినాన పికాలాపం దూరపు కోననుండి వినవచ్చినప్పుడు వసంత మరుగుదెంచెనను మధురోహ తమకు స్ఫురించినట్టుగా సెలవిచ్చారు కవిగారు.

అణువునుంచీ బ్రహ్మాండం వరకూ చరాచరాలన్నింటిలోనూ అందాన్ని తిలకింప కలిగిన కవిరాజులకు వసంతం వచ్చేసిందన్న తలపు అదొక మధురోహగానే భాసించవచ్చు, సందేహం లేదు. కానీ ప్రతి విషయానికీ బొమ్మా, బొరుసూ అంటూ రెండు ముఖాలు వుండనే వుంటాయి, తప్పదు. ఇంతలోనే మళ్ళీ ఒక సంవత్సరం కాలగర్భములో కలిసిపోయిందన్న కటిక సత్యం ఊహకు తట్టినప్పుడు పడుతూ నడుస్తూ వున్న మానవుడు ముందుకు వేసిన అడుగు ముందుకు, వెనక్కు వేసిన అడుగు వెనక్కూ అలాగే వుంచేసి కాసేపు స్తంభీభూతుడైపోతాడు.

నామటుకు నేను సంవత్సరానికొకసారి యిలా స్తంభీభూతుడినైపోవలసి వస్తున్నది. అందుకు కారణం మా నరసయ్య మామ ప్రశ్న!

“కొత్త పంచాంగాలొచ్చేశాయా బాబూ?”

నరసయ్య మామ అందుకని మా యింటికి రాడు. అతడిది బాటప్రక్కన భారీసేద్యం. ఆ బాటవెంబడే నరసయ్యమామ పొలాల్ని దాటుకుని, యింకొ రెండుమూడు ఫర్లాంగులు నడిస్తేగానీ నేను నా గమ్యస్థానాన్ని చేరుకోలేను. మానరసయ్యమామ పరిభాషలో నా యీ గమ్యస్థానానికి పలుకూటమని పేరు. పలుకూటంలో పలువురు పిల్లలతో పరివేషితుడినై కాలమొకరీతిగా నెళ్ళబుచ్చుతున్నందుకు ప్రతిఫలంగా నాకు నెలనెలకూ ఎంతో కొంత పైకం ముట్టుతున్నమాట నిజమే! కానైతే ఈ జీతంలో బడికి పోతూ, పోతూ నరసయ్యమామ ప్రశ్నలకు జవాబు చెబుతున్నందుకు ఎంతయిస్తున్నారో, ‘ఊరుకోండర్రా వూరుకోండి, సైలన్స్ సైలెన్స్’ అని గొంతు చించుకుంటూ కుర్రాళ్ళలో క్రమశిక్షణ నిరవాకంచేస్తున్నందుకు ఎంత యిస్తున్నారో, ‘బాబ్బాబూ! ఈ ప్రోనోటు కాస్త వ్రాసేయండి’ అంటూ ప్రాధేయపడ్డం మొదలు, ‘సాయంత్రం మాయింటిదాకావచ్చి పత్రాలు, దస్తావేజులు చూచి పోవలసినది’ అంటూ కోర్టు సమ్మన్సులావచ్చిపడే ఆజ్ఞలదాకా అన్నింటినీ శిరసా వహిస్తున్నందుకు ఎంతయిస్తున్నారో, కాగా పోగా పిల్లలకు పాఠాలు చెబుతున్నందుకు మాత్రం గిట్టుబాటవుతున్నదంతో నాకు తెలియదు.

ఈ కార్యకలాపాల్లోగూడా మిగిలినవన్నీ ఒక ఎత్తు. మా నరసయ్యమామ ప్రశ్నలకు జవాబు చెప్పడంమాత్రం ఒక ఎత్తు.

అసలు మానరసయ్యమామ ప్రశ్నావాహిని ఏనాడూ వట్టిపోని జీవనదిలాంటిది. భోజరాజును చూడగానే కవిత్వం పుట్టుకొచ్చినట్టు, దూరంనుంచీ నాముఖాన్ని చూడగానే అతడికి ఓ ప్రశ్న చటుక్కున స్ఫురించేస్తుంది.

## మధురాంతకం రాజారాం

ఈ ప్రశ్నల్లో రోజువారీ ప్రశ్నలు కొన్ని:
“ఈరోజు రావుకాల మెప్పుడు బాబూ?”

పిలుపులూ, పేటాకులూ లేకపోయినా భోజనానికి ఆయత్తమైవచ్చి స్వయంగా తనే పీటవేసుకుని కూర్చునే అతిథిలాంటి పెద్దమనిషి ఈ రాహువు. గ్రహాలు తొమ్మిదని అనుకున్నతర్వాత వాటిలో రెంటికి మాత్రం బంతిలో ఎందుకు చోటు లేకపోవాలో మనకు తెలియదు. రాహువుకే గనుక ఒకరోజును ప్రత్యేకించివుంటే, ఆదివారానికి బదులు ఆ రాహువారాన్ని పబ్లిక్ హాలిడేగా పరిగణించి కాలు కదపకుండా అందరూ యిళ్ళల్లోనే కూర్చుని ఈగలు తోలుకోడానికి వీలుండేది! ఎంతో శుభులైతేగానీ, తమకు అన్యాయం జరిగినప్పుడు తిరగబడకుండా వుండలేరు. అందులోనూ రాహువు శిష్టగ్రహం కానేకాదు. దుష్టగ్రహం, పైగా వక్రగ్రహం. పంచాంగంలో అతడిది పంచమాంగదళంలాంటి వ్యవహారంగావుందంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు.

ఉద్యోగంలోచేరి పేటకూ పల్లెకూ రాకపోకలు ప్రారంభించిన క్రొత్తలో ఓ రోజు వుదయం అడుసుదున్నుతున్న నరసయ్య మామ నన్ను చూడగానో నాగలి నిలిపి రావుకాల మెప్పుడని అడిగాడు. నాకప్పటికి మరచిపోయింది మరచిపోగా మిగిలివున్న వ్యాకరణ శాస్త్రవాసనవల భూతభవిష్యద్వర్తమాన కాలాల్ని గురించి కొంత తెలుసుగానీ రాహుకాలాన్ని గురించి బొత్తిగా తెలియదు.

‘నేరనన్న వాడు నెరజాణ, నేర్తునన్న వాడు నిందజెందు’ అన్నాడుగదా వేమన్న, అసమర్థతను ప్రకటించుకోడం ఉచితమైనప్పుడు, అజ్ఞతనుమాత్రం ఎందుకు ప్రకటించుకోగూడదు అనుకుని ‘రాహుకాలమా! అబ్బే, నాకు తెలియదే!’ అని తలవంచుకొని నా దోవంట నేను వెళ్ళిపోజూచాను.

“అయ్యో, అదేమిటి బాబూ! అలాగనేకావు!” అంటూ నావైపు ఆశ్చర్యంగా చూచాడు నరసయ్యమామ! “రావుకాలం పలానప్పుడు అని చెప్పడానికి బద్ధకమా! ఆయ్యోరామ! మీ తాతగారుండేవారు, పుణ్యాత్ములు గదటయ్యా! ఆడక్కపోయినా సరే, “ఒరే నరసయ్యా! ఈరోజమావాశ. పెద్దలకు ఓ విస్తరి వేయడానికి మరిచిపోయేవు” అని ఆయనే స్వయంగా చెప్పేవారు. ఆయన పోయారనుకో, మీ నాన్నగారు మాత్రం! తిథి వారం నక్షత్రం ఏదడిగితే అది టక్కుటక్కున చెప్పేసేవాడు గదటయ్యా...”

పెద్దల మంచితనం గూడా ఒక్కొక్కప్పుడు భావితరాల పిన్నలకు ఉపద్రవకరమేమో అనిపిస్తుంది. ఐనా మరేం పరవాలేదు. ఈ మాత్రం నిష్ఠూరంతో నరసయ్య మామ బారినించీ తప్పించుకోగలిగా నన్న తృప్తితో మౌనంగా వెళ్ళిపోయాను.

కానీ నరసయ్య మామ నన్ను అంతటితో వదిలిపెట్టే ఘటమని భావించడంలో నేను ఘోరమైన భ్రమా ప్రమాదానికి లోనయ్యానన్న విషయం నాకొ మరునాటి ఉదయమే విశదమైంది.

“రావుకాల మెప్పుడని అడిగితే చెప్పకపోయావు. పోనీలే నాయనా! అంతలో వుంది. ఆ మనుషులా, ఆ కాలమా!” అంటూ విడివిడిగా మాటలు కొన్ని వల్లించి “అదిసరే గానీ ఈ రోజు ఏ ప్రక్క వారశూల?” అని

# ★ పంచాంగప్రసక్తి ★

ఒక సరిక్రొత్త ప్రశ్నను నాపైకి విసిరాడు నరసయ్య మామ.

వారశూల! కడుపు శూలతో బాధపడు తున్న వాళ్ళని కొంతమందిని నేనెరుగుదును. కడుపులో శూలంతీసుకుని కుమ్మినట్లుండటం చేత ఈ బాధకు కడుపుశూల అని పేరు పెట్టటం జరిగిందని కూడా ఎవరో వివరించారు. కానీ ఈ వారశూల వృత్తాంత మేమిటి? ఇది ఎవర్ని ఎక్కడ బాధిస్తుంది?

"వారశూలా నరసయ్య మామా! మరి... మరి..." అంటూ గుటకలు మింగసాగాను.

"అదీ తెలియదని చెప్పేద్దామని చూస్తున్నావల్లే వుంది. అంతేగదూ!" అన్నాడు నరసయ్య మామ.

"అహఁ, అది కాదు. మరచిపోయినట్టున్నాను. జ్ఞాపకం చేసుకుని మధ్యాహ్నం చెబుతానులే" అంటూ వడివడిగా నడక సాగించాను.

మధ్యాహ్నం కావడానికి ఎంతసేపు పడుతుంది? ఆ లోపల నేనీ వారశూలనుగురించి తెలుసుకోక తీరదు. మెల్లగా ప్రధానోపాధ్యాయుల్ని సమీపించి "అయ్యా! ఇవేమిటో రాహుకాలమనీ, వారశూలలనీ కొన్ని ఈతిబాధలు మానవజాతిని వేధిస్తున్నట్టు తెలియవచ్చింది. ఆ యీ విషయాల్ని గురించి తెలుసుకోడానికి నాకొక ఉద్గ్రంథాన్ని సూచించగలరా?" అని అతి వినయంగా ప్రాధేయపడ్డాను.

ఆయన ముసిముసి నవ్వులు వెదజల్లుతూ మొదటి తరగతి కుర్రాడి నొకణ్ణి కేకవేసి ఒక పుస్తకాన్ని తెప్పించి "చూశావయ్యా మేష్టారూ! ఇది పెద్దబాలశిక్ష! మొదట దీన్ని చదివి ఒంటబట్టించుకోవడం మంచిది. రాహుకాలం, వారశూలల్ని గురించిమాత్రమే గాక యింకా అనేక ముఖ్యవిషయాలిందులో వుంటాయి. 'పోయెను, వచ్చెను మొదలగు వ్యవహారంబులకు కారణంబైన భగవత్స్వరూపంబే కాలంబు. అట్టి కాలం బఖండంబైననూ గ్రహరాశి నక్షత్రాద్యాత్మకంబై జ్యోతిశ్చక్రమునందు దిరుగుచున్న చంద్రసూర్యగతులబట్టి అఖండకాలమునందు ఖండకల్పనముచేసి జనులు వ్యవహారమును జరిగింతురు.' ఇదంతా ఏదో పుస్తకం చెబుతున్నాననుకోకు. పంచాంగానికి సంబంధించిన ప్రాథమికవిషయాలు తెలియక పోతే పలైటూళ్ళో బడిపంతులుగా చలామణీ కావడం కష్టం. ఆ తరువాత నీ యిష్టం" అన్నారు.

ఎంత పని చేశావయ్యా నరసయ్య మామా అనుకుంటూ 'పాడ్యమి, విదియ, తదియ' అనుకుంటూ తిథుల్ని, 'మేషమూ, వృషభము' అనుకుంటూ రాశుల్ని, 'అశ్వనీ, భరణీ, కృత్తికా' అనుకుంటూ నక్షత్రాల పటికను అధ్యయనం చేశాను.

"అంగార పూర్వగమనేచ లాభం, సోమే శనీ దక్షిణ మర్థలాభం" అంటూ, ప్రయాణానికి అనుకూలవారాల్ని గురించి, "న పూర్వే శని సోమేచ, న గురుర్దక్షిణే తథా..." అంటూ ప్రయాణ నిషిద్ధ వారాల్ని గురించి శ్లోకాలు నోటిపాఠం చేసుకున్నాను.

నారికేళపాకంలోవున్న కవిత్వంలా మొదట మొదట అయోమయంగా కనిపించిన పంచాంగం, రానురానూ కొంచ కొంచెంగా అవగతం కాసాగింది.

కానీ పంచాంగం చూడానికి తెలియడం లేదు. ప్రతిరోజూ అదొక దినకృత్యంగా పెట్టుకుని 'ఈనాటి తిథేమిటి, నక్షత్రమేమిటి, యోగమేమిటి' అని తెలిసివుంచుకోడం వేరు!

బజారునుంచీ ఒక వస్తువు తెమ్మని ఒకసారికి బదులు నాలుగుసార్లు చెప్పినప్పటికీ మరచిపోయి రావడమే మామూలయినప్పుడు ఈతిథులూ గిథులూ, నక్షత్రాలు గిక్షత్రాలు మాత్రం ఎలా జ్ఞాపకముంటాయి?

కానీ నా సాధక బాధకాలతో నరసయ్య మామకు ప్రసక్తిలేదు. అతడికి కావలిసిందల్లా అతడి ప్రశ్నకు జవాబు! పాడ్యమెప్పుడు? పంచమి వెళ్ళిపోయిందా? అమావాశ ఎప్పుడొస్తుంది?...

అనుభవానికి మించిన ఆచార్యుడు లేడన్నారు! కాలక్రమాన నేను మా నరసయ్య మామకు బదులివ్వడానికి ఒకటి రెండు సులభ పద్ధతుల్ని అన్వేషించ గలిగాను.

"పంచమా నరసయ్య మామా! నిన్న గాక మొన్న నేగదూ పున్నమి?..."

"పున్నమి ఆదివారంనాడు గదటయ్యా!"

"ఓ, అవునవును ఆది సోమ మంగళ బుధ.. ఈరోజు బుధవారం. రేపు గురువారం. అలాగైతే పంచమి రేపన్న మాట!"—ఇదీ మొదటి పద్ధతి!

"అమావాస్య నరసయ్యమామా! మరి.." అని నేను కాసేపు ఆలోచనను అభినయించ గలిగితే చాలు, ఒకటి రెండు క్షణాలు తామసించి మా నరసయ్యమామే "ఆ నీలకంఠయ్యో మో చెప్పాడు. పైవచ్చే సోమవారమేననీ..." అని తనే సమాధానాన్ని సరఫరా చేసేవాడు.

"సోమవారమని చెప్పాడా! అవునవునౌ నరసయ్య మామా! సోమవారమే అమావాస్య!" అంటూ నేను ముక్తాయించేశానంటే అప్పటి కాగండం తప్పిపోయినట్టే!

నరసయ్యమామకు నాలాటివాళ్ళెంత మంది లేరు గనుక! అతడికప్పటికప్పుడు ఏదో ఒక పర్వదినాన్ని గురించి తెలుసుకోవలసిన అవసరం వుండనే వుంటుంది. దీపావళి పండుగ నవంబరు 27 వ తేదీన వస్తుందనుకోండి. ఆ రోజుకోసం నరసయ్య మామ ఎంతో ఆదుర్దాగా వేచివుంటాడు. ఆపండుగ

తీయటికలలావచ్చి అంతలోనే అంతర్ధానమై పోతుంది. అదలా వెళ్లిందో లేదో 14వ తేదీ వుదయమే ప్రశ్నిస్తాడు వరసయ్యమామ—"సంక్రాంతి పండుగెప్పుడు బాబూ?" ఆ సంక్రాంతి పండుగ అరుమూరైనా, మూరుఅరైనా తన రివాజు ప్రకారం జనవరి పద్నాలుగో తారీఖునాటికి తప్పనిసరిగా వచ్చి హాజరుపలుకుతుంది. సంక్రాంతికి మరునాడు పశువుల పండుగ. ఆ మరునాడు పారువేట. పదిహేడో తేదీ వుదయానికల్లా నా కోసం మరొక ప్రశ్న సిద్ధంగా వుంటుంది: "కొత్త పంచాంగాలొచ్చేశాయా బాబూ?"

"కొత్త పంచాంగాలు రాకేం చేస్తాయి వరసయ్యమామా! తప్పకుండా వస్తాయి. అని నేను సమాధాన మివ్వవలసివస్తుంది.

వెంటనే ప్రశ్నల పరంపర—.

"ఐతే ఆ సంక్రాంతి పురుషుడీసారి దేనిమైన ఎక్కాడు? ఏ దిక్కుగా వెళ్తాడు? ఎలాటిబట్టకట్టుకున్నాడు? ఏంతిన్నాడు?.."

ఈ సంక్రాంతిపురుషు డెవడోగానీ, ఇతగాడు గుణగణాల్లో శనిగ్రహానికి ప్రాణమిత్రుడుగానూ, రాహుకేతువులకుతోడల్లుడులాగానూ ద్యోతకమౌతాడు. బహుశా ఇతడు పురాణాల్లో వికృతస్వరూపులుగా వర్ణించబడిన రాక్షసులకు, కొన్ని కొన్ని జానపద చలనచిత్రాల్లో పరుల్ని అరచేతిలో నిలబెట్టుకునే వేతాళుడుకు, గలివరు బ్రాబ్డింగునాగు దేశంలో కనిపించిన మహాకాయులకు మూలపురుషుడై వుంటాడు! ఇతడి ఆకారం అంత వికారం! "అష్టవక్త్రో విశాలాక్షో లంబభ్రూ దీర్ఘనాశికః—ద్విముఖం కృష్ణవర్ణంచ కురూపంచ త్రినేత్రకం...సప్తబాహుం, ద్విపాదంచ..." పనిలోపనిగా ఇతడిస్వరూపాన్ని చిత్రించదలచుకున్న చిత్రకారులకు ఒక చిన్నమనవి. స్కేలు నిష్పయికంగా కొస్తా అప్రమత్తత అవసరం! ఏభైమైళ్లకొక అంగుళమని నిర్ధరించుకున్నప్పటికీ, ఈ ఆకారాన్ని చిత్రించడానికి యిరవై అంగుళాల పొడవున్న డ్రాయింగుపేపరు కావలసివస్తుంది. ఎందుకంటే ఈ సంక్రాంతిపురుషుడి ఎత్తు 900 మైళ్ళు. ఛాతీ చుట్టుకొలత 96 మైళ్ళు!

ఆకారం సంగతలావుండగా ఇంచుమించుగా యితడి చేష్టలన్నీ అరిష్టసూచకాలు! ఎరుపురంగువస్త్రం కట్టుకున్నాడా, యుద్ధం తప్పదన్నమాటే! మెడలో పొగడ పువ్వుల దండ వేసికొన్నాడా, ఆకటిబాధలు చెప్పతరంగావు. వెండినగలు ధరించాడుబో, ఇక లోహాలకన్నింటికీ వినాశమే! ఎక్కింది వరాహమా, యిక వచ్చిందే వల్లజీవాలన్నింటికీ ముప్పు! ఇన్ని హంగులతో యితడేదిక్కుగా వెళ్తున్నాడో, ఆదిగ్భాగంలోవున్న దేశాల్లో క్షామం చెలరేగుతుంది. దారిద్ర్యదేవత విశృంఖలంగా వీరవిహారం చేస్తుంది. లేదూ, ఒకొక్కప్పుడు యిందుకు విరుద్ధంగా వర్షాలు బాగాపడినా పడవచ్చు. ఐతే అప్పుడది అతివృష్టిమాత్రమే అవుతుంది. జలోపద్రవాల్లో దేశం అతలాకుతలమై పోతుంది. రోగాలు విచ్చలవిడిగా వ్యాపిస్తాయి. మునపటికవిలో భార్య భర్తను దెప్పినట్టుగా అది అతివృష్టిగానివ్వండి, అనావృష్టిగానివ్వండి ఎలాగైనా ముప్పుమాత్రం మనుషులకే!

యుద్ధాలకు, ఈతిబాధలకు లౌకిక కారణాలను వివరిస్తే మా వరసయ్యమామ వినిపించుకోడు. లోకంలోని సర్వానర్థాలకూ సంక్రాంతి పురుషుని లీలలే కారణమని అతడి అచంచల విశ్వాసం!

ఆమాటకొస్తే మా వరసయ్యమామ పంచాంగాన్ని చింపి పోగులుపెట్టి, యిక నక్షత్రాలే లేవు పొమ్మంటే ఆమాట తిరుగులేని సత్యమని నమ్మేస్తాడు!

మా వరసయ్యమామ బహు కుటుంబీకుడు.

(55-వ పేజీ చూడండి)




ఇంటింట పంచాంగశ్రవణం

వి. వి. ఆచార్య, వల్లభాపురం

# ఆమె జీవితము

## యన్. శ్రీకృష్ణారావు

పట్టణంనుంచి భానుమతి వచ్చిందని వినగానే ఒకసారివెళ్ళిచూసి రావాలని నేను ఎంత ఆవేదనపడ్డానో చెప్పలేను. ఒకసారి వెళ్ళి కొంచెముసేపు మాట్లాడి, ఆయన పొలం నుంచి తిరిగి వచ్చేలోపుగా వచ్చేద్దామని త్వరత్వరగా యింటిపనులు చేసుకోవటం మొదలుపెట్టాను. మనస్సు భానుమతి దగ్గరకు పరిగెడుతోంది.

ఒకరోజా స్నేహమా, రెండు రోజుల స్నేహమా! ఏడుసంవత్సరాల కాలము విడిపోకుండా లతలు అల్లుకుపోయినట్లు అల్లుకుపోయాయి మా హృదయాలు. 'మీ రిద్దరూ కవలపిల్లలా!' అని అడిగేవారు చాలామంది. అంతదగ్గరిపోలిక మా యిద్దరికీ. భానుమతి నాకన్నా గొప్పది; నాకన్న అందమైనది; నాకన్నా చదువుకొన్నది.

ఆరేళ్ళప్పటినుంచి పదహారేళ్లువచ్చేదాకా యిక్కడే వాళ్ళ మేనమామగారింట్లో పెరిగింది. తరువాత పట్టణంలోవున్న తలితండ్రుల వద్దకు వెళ్ళిపోయింది. ఆ తరువాత కొంతకాలానికి ఆమెతండ్రి పోయారు. తను పెద్దచదువులో పడింది.

నాకు మావూళ్ళోనే వివాహమయింది. అందుచేత నేను గ్రామంలోనే వుండిపోయాను. కొంతకాలమువరకు మా యిద్దరి మధ్యా ఉత్తరాలు నడిచాయి. తరువాత ఎందుచేతనో ఆగిపోయాయి.

నేను యిదరుపిల్లల తల్లినయాను. నాభర్త వ్యవసాయపరీక్ష (బి. ఎస్. సి.) ప్యాసు అయారు. ఆయన చదువుకొన్న దానివల్ల, నేర్చుకొన్న దానివల్ల మాకున్న కొద్దిభూమిని ఆధునిక యంత్రాలు వుపయోగించి సాగుబడి చేస్తున్నారు. మా జీవితాలు ఆట్టేశ్రమ లేకుండా గడచిపోతున్నాయి.

నాతో సమానవయస్సున్న భానుమతి జీవితము ఎల్లా గడుస్తోందో— ఈ విషయమే ఆస్తమానూ అనుకొనే దానిని. భానుమతి అప్పట్లో ఒకోసారి ఒకోవిధంగా మాట్లాడేది. 'పెద్ద చదువుచదివి పెద్ద ఉద్యోగము చేస్తా'ననేది ఒకసారి. 'మూడొందలో నాలుగు వందలో సంపాయించే ఓ ఆఫీసరుని పెళ్ళి చేసుకొని హాయిగా సుఖంగా వుంటాను' అనేది యింకోసారి.

'ఉద్యోగమనేది ఓ గొప్ప తప్ప అది కూడా బానిసలా ఒకళ్ళకి లొంగి వుండటమే కదా! ఏమైనాకాని, వ్యాపారస్తుని జీవితమే మంచిది' అనేది మరోసారి. ఈవిధంగా మాట్లాడిన భానుమతి ప్రస్తుతము తన జీవితము ఏ విధంగా గడుపుతోందో తెలుసుకోవాలనుకోవటంలో తప్పేముంది?

మా వూళ్ళో ఆమెను గురించి వింత వింతగా చెప్పుకొంటున్నారు. భానుమతి ఎం. ఏ ప్యాసుఅయిందనీ, పెద్దఉద్యోగము చేస్తోందని, పెళ్ళయింది కాని పిల్లలు లేరని, పెళ్ళయిన కొద్దిరోజులకే భర్తకు విడాకు లిచ్చేసిందని—యిల్లాగే ఎవరికి తోచినట్లు వారు చెప్పుకుంటున్నారు. దీని కంతకీ కారణము వాళ్ళ నాన్నగారు పోయినప్పటి నుంచి వాళ్ళకుటుంబం వేరే ఊరులో వుండటం సంభవించింది. వాళ్లు యిక్కడే వుండిపోతే చాలా బాగుండి వుండేది. అందుచేతనే యిటువంటి మాటలన్నీ వినాల్సి వస్తోందనుకొన్నాను. వేసంగి సెలవులకి అందరూ గ్రామానికి వచ్చారు రాగానే భానుమతి నాకో సం కబురు పంపింది. ఆమెను చూడాలనే ఆశకన్నా, ఆమె జీవితాన్ని గూర్చి తెలుసుకోవాలనే ఆకాంక్ష నాకు ఎక్కువైంది. ఇంటి పనిఅంతా పూర్తిచేసుకొని భానుమతిని చూడటానికి వెళ్ళాను.

భానుమతి నన్ను చూసి చాలా ఆశ్చర్యపడింది. చంకనున్న ఆడపిల్ల, చెయ్యి పట్టుకొని వున్న మగపిల్లవాడుతో వున్న నన్ను చూసి "చాలా పెద్దసంసారి అయినట్టున్నావే" అంది పరిహాసంగా. చిరునవ్వునవ్వి ఊరుకొన్నాను.

"కూర్చో! ఇప్పుడేవస్తా" అంటూలోపలికి వెళ్ళి రెండు ప్లేట్లతో వేడివేడి బజ్జీలు తెచ్చి ఒక పళ్లెము నాముందుంచింది. తన పళ్లెము



లోని బజీలకన్నా నా ప్రశ్నలో నివి మూడింతలు అధికంగా వున్నాయి.

"ఎందుకిన్నీ?" అన్నాను.

"నీకూ నీ పిల్లలకీను" అంది భానుమతి కొంటెగా. నాకు చెప్పలేనంత సిగ్గేసింది. తను చిన్నప్పటినుంచి యిల్లా చిలిపితనంగా మాట్లాడటము మామూలేకదా అని నాలో నేను సమాధాయించుకున్నాను. కొంచెము సేపు కుటుంబ యోగక్షేమాలు మాట్లాడు కొన్నాము. నేను ఆమె మెడను పరీక్షించి చూశాను. మాంగల్యము కట్టిన పసుపుతాడో లేక బంగారు తాడో నాకు కనిపించలేదు. ఇంకా కన్యగానే వుందా? లేక పెళ్లయి... అని సందేహ పడ్డాను. ఎన్నాళ్ళు నాకీ విధంగా సందేహమని తననే అడిగేశాను.

"ఇంతకీ నీకు పెళ్లయిందా లేదా?" అన్నాను.

నా ప్రశ్న విన్నవెంటనే యిల్లెగిరిపోయే టట్లు నవ్వటం మొదలెట్టింది. నాకు కోపం వచ్చింది. "నేనడిగిందానికి యిదేనా సమాధాన"మన్నాను.

"నీగురించి యిక్కడ నలుగురూ నాలుగు విధాలా ఆడిపోసుకొంటున్నారు. నిజం తెలుసుకొందామని నేనడిగితే యిల్లా నవ్వుతావెందుకు. ఎల్లా అయినా చిన్ననాటి చిలిపి చేష్టలు నీకు యింకాపోలేదు." ఈ మాటలతో భానుమతి దారికొచ్చింది.

"నన్నుగురించి నలుగురూ నాలుగువిధాలా ఆడిపోసుకొంటున్నారా? ఏమని లలితా?" ఇదే సరైన సమయమని నేను విన్నవాటికి మరి నాలుగు కల్పించి మరీ చెప్పాను. చాలా ఓపిగా విని మళ్ళీ నవ్వటము ప్రారంభించింది.

నాకు చాలా కోపం వచ్చింది.—

"సరే! నువ్వుతీయబడిగా నవ్వుకో! నేను వెళ్ళొస్తా!" అంటూ లేచాను.

"కూర్చో లలితా! కోప్పడకు, నీమాటలు నాకు అంత నవ్వు తెప్పిస్తున్నాయి. నువ్వు విన్నవన్నీ కేవలం కల్పిత కథలు" అంటూ నన్ను చెయ్యిపట్టుకు కూర్చోబెట్టింది భానుమతి.

పోనీ నిజమైన కథ నువ్వే చెప్పరాదూ!" కొంచెము సేపు మౌనము వహించి వచ్చే నవ్వును ఆపుచేసుకొంటూ—.

"నాకు పెళ్ళయింది. కాని నేను కన్యగానే జీవితాన్ని గడుపుతున్నాను" అంది భానుమతి.

"అంటే"

"భర్తకు విడాకు లిచ్చేశాను"

"ఓసి భడవా! నీకిదేం బుద్ధి! కొత్తగా వుందే!"

"భానుమతి కనిపెట్టిన కొత్త!"

"నీ భర్త క్షేమంగా వున్నారా!"

"ఆహా! మహారాజులాగ!"

"మరి, నీ మెడలో......"

"నువ్వో కర్ణాటక మొద్దు! దవాలీబంట్రోతులా మెళ్ళో ఓ తాడు వేళ్ళాడుతూంటేనే భర్త వున్నట్టా? నేను చేసుకొన్నది 'రిజిష్టర్ మేరేజ్' విన్నావా ఎప్పుడేనా అటువంటిది ఒకటుందని?"

"నాకేం తెలుసునమ్మా! ఏదో నాలుగు క్లాసులు చ[illegible]ను. పెద్దలంతా చేరి పెళ్లంటూ చేశారు. సంసారంలోపడి ఏదో...రోజులు గడుపుతున్నా?"

"అల్లాగా! భర్తకు లొంగిపోయి జీవితాన్ని గడుపుతున్నావన్నమాట. నీలాంటి వాళ్లు యింకా నూటికి తొంభయిమంది వుండటం వల్లే ఈ మగాళ్ళకి కళ్ళూ కాళ్లూ కన్పించటంలేదు. ఆడవాళ్లని మృగప్రాయంగా చూస్తున్నారు...కాలిచెప్పుతో చీమలని లిపినట్లు నలిపేస్తున్నారు. ఇటు



## ఆమె జీవితము

వంటి వాళ్ళందర్నీ నీలాంటివాళ్ళంతా పతి, భర్త, ప్రత్యక్షదైవము అని ఏమేమో అంటూ వాళ్ళని పూజిస్తూ...మీ పిరికితనాన్ని చాటుకొంటున్నారు" అంది భానుమతి ఉద్రేకంగా.

"లేకపోతే నీలాగా బరి తెగించాలంటావా?"

"బరి తెగించటమా! నువ్వు ఎక్కడో మూలనున్న అడివిలో వున్నట్లు మాట్లాడుతున్నావు. ఇది ఇరవయ్యో శతాబ్దం. సామర్థ్యాన్ని చూపి మన జీవితాలకు మనమే సారథ్యం వహించవలసిన రోజులు"

"అయితే అందరూ నీ సామర్థ్యాన్ని పరీక్షించుకొంటున్నారన్న మాట!"

"సందేహమేముంది.? ఆనాడు చూడవల్సింది కోర్టులో ఆ కోలాహలాన్ని. పత్రికలన్నీ తెగపొగిడాయి పటణమంతా అల్లకల్లోలమయింది."

"అదంతా అల్లా వుండనీ! నీబుద్ధి యిల్లా పోతోందేం?"

"అదొక పెద్దగాథ. నీకిప్పుడేమీ తొందరపని లేదంటే చెప్తాను. లేకపోతే రేపు చెప్తాను."

మరేం ఫర్వాలేదు యిప్పుడే చెప్పు. ఆయన అయిదున్నరకుగాని పొలాన్నుంచి రారు. ఈలోపుగా వస్తే చాలు"

భానుమతి చెప్పటం ప్రారంభించింది—

### 2

"కాలేజీలో ఇందిర నాకు ప్రాణస్నేహితురాలు. 'హృదయాలు కలసిపోయాయి. వారి శరీరాలు రెండయినప్పటికీ ఆత్మ ఒక్కటే. ఒకరిని విడచి ఒకరు వుండలేరు. వారి అన్యోన్యభావంలో మనస్పర్థలకు తావేలేదు' అంటూ ఏదో, కవులు రాస్తూంటారే అల్లాగే వుండేవాళ్ళము. అంత దూరము ఎందుకు—అప్పట్లో మవిదరము ఎల్లా వుండేవాళ్ళము? అల్లాగన్నమాట!

ఒకరోజున నేనూ ఇందిర సముద్రపొడ్డున కూర్చొని సరదాగా మాట్లాడుకొంటున్నాము. మా సంభాషణ మెల్లిగా పెళ్ళిళ్ళ మీదకు మళ్ళింది.

'నే నసలు పెళ్ళే చేసుకోదల్చుకోలేదు' అన్నాను నేను. 'అది నా వల్లకాదు భానుమతీ! అమ్మ, నాన్నా యిష్టానికి వ్యతిరేకంగా నేను నడవలేను. వాళ్లు చెప్పినట్లు నేను వినితీరాలి! పరీక్షలవటంతో నా పెళ్ళి చేయటానికి నిశ్చయించుకొన్నారు,' అంది ఇందిర.

ఇంక మా సంభాషణ యీ కాలపు భర్తల మీదకు మళ్ళింది.

'నీకు రాబోయే భర్త నీ యిష్ట ప్రకారం రావటంలేదు. నువ్వు చూడకుండానే నీ వాళ్ళు నీ కీసంబంధాన్ని ఖాయపరిచారు. ఖర్మవశాత్తు నిన్ను నీ భర్త అష్టమైన హింసలూ పెడితే ఏం చేయగలుగుతావు?'

'పూర్వకాలపు వాళ్ళమాదిరిగా నడచుకొని, తప్పుదారి పట్టిన నా భర్తను మంచి దారికి తీసుకురావటానికి ప్రయత్నిస్తాను. సాధ్యం కాకపోతే 'విధి' అనుకొని సహించుకొంటాను.'

నేను ఇందిరను హేళన చేశాను. తను యీ నవయుగంలో వుండతగది కాదన్నాను. నేనే అయితే భర్తతో దెబ్బలాడి చక్కటి గుణపాఠము నేర్పుతానన్నాను. నేర్చుకోకపోతే విడాకులిచ్చేస్తాను, అన్నాను.

'ఇదంతా కేవలము వట్టి భ్రమ భానుమతీ! మాటలన్నీ ఆ మూడుమూళ్ళూ పడేవరకే! ఆ తర్వాత నువ్వూ అందరిమాదిరిగానే లొంగుతావు బుట్టలో పెటిన పాములా. ఇంకో విషయం భానుమతీ! దాంపత్యంలో భర్త భార్యకు లొంగాలని, భార్య భర్తకు లొంగాలనీ అనుకోవటం కేవలం మూర్ఖత్వము. దాంపత్యమనేది రెండుచక్రాలబండి. రెండు చక్రాలు కదిలితేనే బండి ఏవిధంగా సాగుతుందో అదేవిధంగా భార్యాభర్తలు ఒకరినొకరు అర్థంచేసుకొని జీవితాలను గడిపితే దాంపత్యం స్వర్గమయమవుతుంది. అంతేగాని ఒకరికొకరు లొంగివుండాలనో లేక అణిగివుండాలనో అనుకోకూడదు' అంది ఇందిర.

నాకు కోపము వచ్చింది.

'ఇందిరా! భానుమతి అంత సామాన్యమైనదని అనుకోకు. చూస్తున్నావుగా నేటి గృహలక్ష్ముల గతి; ఇరవై నాలుగు గంటలూ, వంటిల్లుదాటి బయటకు రావటానికి వీలేని మహిళలస్థితి! ఇదంతా పురుషులు చేసే అన్యాయముకాదా? నా స్వంతవిషయంలో నే కాదు! ఏ స్త్రీవిషయంలోనైనా సరే పురుషుడు అన్యాయం చేస్తే సహించను. దెబ్బలాడి విజయాన్ని సాధించి పెడతాను. ఇందుకే నేను యిదివరలో చెప్పిన మహిళా సమాజాన్ని స్థాపించబోతున్నాను' అన్నాను ఆవేశంగా.

ఇందిర ఏమనుకుందోగాని ఇంక మాట్లాడలేదు. అంతటితో మా సంభాషణకూడా ముగిసింది. ఎవరియిళ్లకు వాళ్లము వెళ్ళిపోయాము.

ఇంటికి వచ్చిన దగ్గర్నుంచి నామనస్సేమీ బాగుండలేదు. ఆరాత్రి భోజనముకూడ సరిగా చెయలేదు. ఆ సమయాన, నేనూ, ఇందిర మాట్లాడిన విషయాలే జ్ఞాపకానికి వచ్చాయి. ఇందిర చెప్పింది నిజమా? నేను చెప్పింది నిజమా? అన్న సమస్యే నన్ను చాలా బాధించింది. ఆలోచనలతో సతమతమయిన నాకు అర్ధరాత్రి దాటిన తరువాత ఎప్పుడో నిద్ర పట్టింది...

* * *

### 3

నామాటల్లో నే కనివుందని చెప్పాలి. పాపము! ఆతిరువాత నెలే, అనుకొన్న సంబంధంతో నే ఇందిరకు వివాహము జరిగింది. ముచ్చటగా మూణ్ణెల్లుకూడ కాపరం చేయలేదు ఇందిర. ఆరితేరిన పోకిరి అయిన తనభర్త తనని అష్టకష్టాల పాలుచేశాడు

ఆ కొంచెం కాలంలోనే ఇందిర భర్త తాగుబోతు జూదగాడు వ్యభిచారి ఇందిర నగలన్నీ తాగుడుకీ, జూదానికీ, వేశ్యలకు బలి అయిపోయాయి రానురాను ఇందిర జీవితం దుర్భరమయిపోయింది. చాలా వరకు ఓర్చుకొంది ఇందిర. చిట్టచివరి దశలో తన తలితండ్రులకు తెలియపరిచింది. కాని అదశలో వాళ్ళుమాత్రము ఏం చేయగలుగుతారు. మనోవర్తి దావాతప్ప వేరే శరణ్యము లేదు ఒక వేళ దావా వేసినా పరువు నష్టం, డబ్బుదండుగ తప్ప వాడి దగ్గరనుంచి ఏమీ వసూలు కాదని తెలుసుకొని 'మనమ్మాయి చేసుకొన్న పుణ్యం యింతే' అనుకొని నోరుమూసుకూర్చొన్నారు చేతకాని దద్దమ్మలు.

ఉద్యోగంనిమిత్తం బొంబాయి వెళ్ళివచ్చిన నాతో తన కథంతా చెప్పుకుని ఏడ్చింది ఇందిర. ఆ సమయంలో తన భర్త నాఎదురుగా వుండి వున్నట్టయితే అతని హత్య కూడా చేసేదాన్నేమో! నాలో అంత ఉద్రేకం కలిగింది. 'ఆనాడు మనము సముద్రపొడ్డున మాట్లాడుకొన్న మాటలు యీనాడు రూపం దాల్చాయి' అన్నాను నేను.

'భానుమతీ!... నా జీవితం... నాశనమయింది. నా ఆశలు ఒక్కటీ ఫలించలేదు. 'విధి' అనుకొని రోజులు గడుపుతున్నాను ఆనాడు నువ్వు ఏదో అన్నావే! ఇంక అదొక్కటే మిగిలింది' అంటూ వెక్కివెక్కి ఏడ్చింది.

ఆ ఒక్కమాటతో నన్ను ఒక్కపోటు పొడిచినట్లు చేసింది ఇందిర. కొంచెం సేపు ఆలోచించి, 'ధైర్యంగావుండు ఇందిరా! భయపడకు భానుమతి అన్నమాట ఎప్పుడూ తప్పదు' అన్నాను.

'నాకేదో ఉపాయంగా మంచి చేద్దామనిపోయి నువ్వు అపాయంలో చిక్కుకోనేవు జాగ్రత్త' అని హెచ్చరించింది ఇందిర.

ఏడుస్తూ నా దగ్గరకు వచ్చిన ఇందిర తన కథంతా నాతో చెప్పుకుని కొంచెము నెమ్మదిపడ్డ హృదయంతో వెళ్ళటం చూసి మనసులోని బాధ మరొకరితో చెప్పుకోవటంతో బాధోపశమనము కలుగుతుందన్న దానిలోని సత్యాన్ని ప్రత్యక్షంగా చూశాను ఆనాడు.

ఇందిరకథ నన్ను చిత్రవధ చేసిందంటే- అంతకన్న యింకేమీ చెప్ప నవసరంలేదు. చాలా దీర్ఘంగా ఆలోచించి ఇందిర జీవితాన్ని తిరిగి చిగిరింపచేసేందుకు తగిన ప్లానులు నిర్ణయించుకొన్నాను. ఇందిర భర్త చరిత్ర అంతా విచారించి తెలుసుకొన్నాను.

అతని పేరు గోపాలరావు. చేతిలో పైసా లేకపోయినా పెద్దబాబులతో మోసగించటంలో పెద్ద డిగ్రీ వున్నవాడే. తను కాపురమున్న వీధిలోనే ఓగది అద్దెకు తీసుకొని కాలేజీ స్టూడెంటులా నటించటము ప్రారంభించాను. ఆ బాబులరాయుణ్ణి నా అందంతో మైమరపించి వలవేసి పట్టేశాను. కామాంధుడైనవాడవటము చేత ఆ పనేమంత కష్టమనిపించలేదు. వెంటనే చెయ్యి చాచాడు... కామాంధుల తీరే అంతకదా! 'పెళ్ళి చేసుకొంటే తప్ప నువ్వు నన్ను పొందలేవన్నాను. 'రిజిష్టర్ మారేజీ' చేసుకొందామన్నాడు. హిందూ ధర్మశాస్త్ర ప్రకారము తను నన్ను చేసుకొంటే పదిమందికి తెలిసిపోతుందనుకొన్నాడు. కాని నాకు కావల్సింది "రిజిష్టర్ మారేజీ" అని తెలుసుకోలేకపోయాడు మూర్ఖుడు.

మా యిద్దరికీ 'రిజిష్టర్ మారేజ్' జరిగిపోయింది రిజిష్ట్రారు దగ్గర తను బ్రహ్మచారేనని ప్రమాణం చేశాడు. నేను తలితండ్రులను కోల్పోయిన మేజరు అవటము వల్ల, నా చదువు హోదావల్ల రిజిష్ట్రారు సందేహ ప్రశ్నలు లేకుండా తప్పించుకొన్నాను.

ఇంక ఆయనగారు ఆ మర్నాటినుంచి నా మీద అధికారము చెలాయించటము ఆరంభించాడు. నా నగలమీద చెయ్యి పెటటానికి కూడా సాహసించాడు. నన్ను బలాత్కారం చెయ్యటానికి కూడా చెయ్యి ఎత్తాడు. కాని నేను అతని చర్యలలో ఒక్కదానికి కూడా అవకాశము యివ్వకుండా సమయానుకూలంగా సమర్థిస్తూ తప్పించుకొన్నాను. క్రమంగా తన స్నేహితులంతా నన్ను వెతుక్కుంటూ రావటం ఆరంభించారు. వాళ్ళకి తగినట్లుగానే నేనూ నాటకము ఆడటం మొదలుపెట్టాను.

ఒకొక్కక్కళ్ళతోనూ 'నిన్నే ప్రేమిస్తున్నా'నంటూ ఒకడికి తెలియకుండా ఒకడికి చెప్పాను. గోపాలరావు నా రిజిష్టర్డ్ భర్త అని వీళ్ళకి తెలియదు పాపము! అందుకని అందరూ నన్ను చూసి నోరూరి పల్లికిలించేవారు. అందులో యిద్దరు నన్ను పెళ్ళి చేసుకొనేందుకు ముందుకొచ్చారు. ఇదంతా ఒకనాడు కనిపెట్టాడు గోపాలరావు. నన్ను నానా చివాట్లు పెట్టాడు. తిట్టాడు, అంతటితో ఆగకుండా కొట్టాడు. ఆ మర్నాడే అతనిమీద కోర్టులో దావా పడేశాను.

పురుషుడు పెడదారి తొక్కితే తప్పులేదు యీ సంఘంలో! కాని స్త్రీ పరపురుషుడితో మాట్లాడినా తప్పే. పరస్త్రీతో తన వాంఛను తీర్చుకొంటే పురుషుణ్ని దండించటం చేతకాక, స్త్రీ పరపురుషుడితో కలిస్తే స్త్రీని నిందించి నానా హింసలపాలు చేయటం పరిపాటయిపోయింది యీ మెదడులేని సంఘానికి సంఘ దౌర్బల్యానికి లొంగటం వెర్రితనం. అర్థంలేని అవకతవక సిద్ధాంతాలతో, అధికార అహంభావాలతో, డబాయింపులతో చలామణీ అయే వివేకవిజ్ఞానం లేని మూర్ఖులే మన సంఘ పెద్దలు. ఉదాహరణకు కాంగ్రెసు సిద్ధాంతం ఏమిటో తెలుసుకోకుండా కాంగ్రెస్ నాయకులుగా చెలామణీ అవుతున్న ప్రబుద్ధులు ఎంతమంది లేరు? అలాగే కొందరు పిలకరాయుళ్ళు శాస్త్రాలని పిక్కవేస్తారు. అల్లా పిక్కవేసిన శ్లోకాలలో ఒక్క శ్లోకానికి అర్థం చెప్పమను చెప్పటం చేతకాక 'ఇల్లా అర్థం చెబుతూ వెళ్లాలంటే చాలాసేపు పడుతుంది, తీరుబడిగా తర్వాత కూర్చుందాం' అంటారు. మళ్ళీ మనకంటికి కనిపించరు.



# ఆమె జీవితము



అదేమాదిరి, నేటి విద్యార్థులలో చాలామంది చదివిన దానిని అర్థం చేసుకోకుండా బట్టీ పట్టి పెద్ద పెద్ద డిగ్రీలు పొందుతారు. చివరకి తమ సొంతంగా ఒక వాక్యంకూడా వ్రాయ లేరు. ఇటువంటి వాళ్ళంతా కూపస్థమండూకాలు. ఇటీవల మన ప్రధానమంత్రి ఒకచోట తన ఉపన్యాసంలో చాలా చిత్రమైన విషయము వెల్లడించారు. సర్వీస్ కమిషన్ పరీక్షలలో చాలామంది బి.ఏ, యం.ఏ డిగ్రీలు పొందినవారు కూడా కొన్ని కొన్ని ప్రశ్నలకు అసలు సమాధానాలే రాయలేక పోయారుట. 'భాక్రా నంగల్ డామ్' అంటే ఏమిటో, 'గాంధి' అంటే ఎవరో, 'టాగూరు' అంటే ఎవరో మొదలైన కొన్ని ప్రశ్నలకు సమాధానాలు తెలియక వదిలివేశారుట. వారిలో కొంతమంది విద్యార్థులు సాహసం చేసి సమాధానాలు వ్రాశారు. 'భాక్రా నంగల్ డామ్' అనే జపాన్ సైంటిస్టు మొదట ఆటంబాంబును కనిపెట్టాడని, అది సైబీరియా ఎడారిలో పేల్చబడిందని ఒకరు రాశారుట. గాంధీ సింహళదేశ యువరాజని రాశారుట ఒకరు. టాగూరు ఆఫ్రికా ఖండంలోని అనాగరికులకు మతబోధకుడని రాశారుట మరొకరు.

ఇంక దేనికి వీళ్ళ చదువు? ఎందుకు వాళ్ళకా డిగ్రీలు? ఇటువంటి విజ్ఞానులే మన సంఘ పెద్దలు. వీళ్ళే మన రాజ్యాధికారులు. ఇట్టి కూపస్థమండూకాలు, చీడపురుగుల మధ్య పెరిగిన మనకు వాళ్ళ అధికారంలో నీతి న్యాయాలు ఎల్లా లభిస్తాయి? ఈ అప్రయోజక శిఖామణుల పరువులో మన గౌరవాలకే భంగం వాటిల్లుతోంది! వీరికున్న డిగ్రీలను శంకెలకు తగిలించేటట్లు చేసి, వీళ్ళను అణిచేయాలి. లేకపోతే ముఖ్యంగా మన మహిళా జాతిగతి అధోగతే! యీ ధడితీ భాయితే భావిభారత భాగ్యోదయానికి పారతంత్ర్యం వహించితే మన బ్రతుకులు సర్వనాశనమవక తప్పవు. పాతివ్రత్యం పేరుతో నారీలోకానికి చీడపురుగులుగా రూపొందుతూ సంఘాభివృద్ధిని అరికడ్తూ, స్వార్థంతో, అభివృద్ధి చెందుతున్నారు. ఇటువంటి వాళ్ళందరికి తగిన గుణపాఠం నేర్పాలంటే మనమహిళలే పూనుకొని పురోగమించాలి. మతానికి, నీతికి, సంఘ మర్యాదకు వుండే భేదాలను తుడిచి పెట్టే నూతన సిద్ధాంతాలను ప్రచారంలోకి తీసుకురావాలి. అప్పుడే యువతీ యువకుల జీవితాలు నిత్యకల్యాణం పచ్చ తోరణంగా మారతాయి.

ఇందిర భర్తసౌఖ్యానికి దూరమయింది. అందరూ దాని ఖర్మ అన్నారు. ఆ ఖర్మ అన్న దానిలోనే సమాధానము కూడా వుంది. కాని యీ సంఘ పెద్దలకు అందుకు దమ్ముల్లేవు" అని ఓ ఉపన్యాసం దంచేసింది భానుమతి. ఇవరం కాస్త కాఫీతాగాము.

"తర్వాత" అన్నాను నేను.

భానుమతి మళ్ళీ చెప్పటం ప్రారంభించింది:

"నేను కోరులో దావా వేసిన సంగతి అతనికి తెలియును. అకస్మాత్తుగా "సమను" రావటముతో నే తల కొట్టేసినంత పనయింది అతనికి. 'పిల్ల బలే గటిదే' అన్నాడట.

ఈ దావావల్ల తను రహస్యంగా రెండవ వివాహము చేసుకొన్నట్లు బయటపడుతుందని, భయపడి ఎక్కడికైనా పారిపోదామనుకొన్నాడు. కాని, తనని నేను ఓకంట కనిపెడుతూనే వున్నట్టు తెలుసుకోవటం వల్ల తన ప్రయత్నం సాగలేదు. ఇంక లాభం లేదనుకొన్నాడు. నాదగ్గరకు వచ్చి, చేసిన తప్పులన్నిటికి క్షమార్పణకోరాడు. కాని తను నన్ను చేసుకోకముందు బ్రహ్మచారినని నమ్మించాడు. తన అహంభావం యింకా చావలేదనీ, తను యింకా సరైన దోవకోకి రాలేదని, నేను నా దావా విరమించుకోలేదు!

మొదటి హియరింగు జరిగింది. కొద్ది విచారణతో పూర్తయింది. ఇంకో రెండు మూడు విచారణలతో కేసు పూర్తి చేయించాలని నేను తీర్మానించుకొన్నాను. పదిమందిలోనూ తన తప్పులన్నీ బయటపడి తగిన దండన విధింపబడుతుందని భయపడి తను

(48-వ పేజీ చూడండి)




(గతసంచిక తరువాయి)

## 17

పీస, దాసుడు పట్నం పరుగెత్తారు; సాయంత్రం తిరిగివచ్చి మళ్ళీ రేపు బెయిలు కోసం వెళ్ళాలన్నారు; వకీలుని పెట్టాలన్నారు. ఇంట్లో డబ్బు లేదు. ఎవర్ని అడుగుదామా అని నీలి ఆలోచిస్తూంటే, రాజిగాడి పెళ్ళాం ఇంటికి వచ్చి, మంచీ చెడ్డా మాటాడి, యాభై రూపాయలు అప్పుఅడగకుండానే ఇచ్చింది. నీలి కృతజ్ఞత తెల్పింది.

మరునాటిరోజు పదిగంటలకు మళ్ళీ పోలీసులు మినహా ముంగురోజు బృందంవచ్చారు. వాళ్ళను చూడగానే నీలి బయటికి వచ్చింది.

నిన్న పరాభవింపబడ్డ అధికారి "ధాన్యం కొలవాలమ్మా" అన్నాడు.

నీలి మాటాడకుండా కొట్టు తాళం తీసుకవచ్చి తలుపు తీసింది తీశాక అధికారి ముందు నిల్చుని, సవినయంగా, "బాబూ! అంతాపోగా మిగిలింది యీ కొట్టులోనే యేసుకొన్నాం. మనుషులకి తిండికి, యేం వుంచి రచ్చిస్తారో? పెదబాబులు మంచీ చెడ్డా మీకు తెలీదా? మీకు న్యాయం అని తోసింది చెయ్యండి" అంది.

అధికారికి ఆమె వినయంతో కూడుకున్న మాటలతీరు చూడగానే మనసు కరిగింది. కొట్టులోకి తొంగిచూసి, దగ్గరగా వస్తూ, పట్నంలో మీలాంటి ప్రజే వున్నారు. వాళ్లని రైత్వారీప్రజ పోషించకపోతే వాళ్లు మలమల మాడిపోరా?"

"నిజంబాబూ! నలుగురూ సుకంగా వుంటేనే పెపంచకం నిలుస్తాది!"

"నేనూ మనిషినికానా—ఒక్కపుట్టెడు ధాన్యం యియ్యి, ప్రొక్యూరుమెంటుకి" అన్నాడు అధికారి.

ఆమె ముఖం వెలిగింది: "బాబూ రెండు పుట్లు తీసుకోండి" అంది.

అధికారి సంతోషించాడు. ఏజంటుకు పుట్టెడు ధాన్యమే కొలుచుకొని డబ్బు చెల్లించమని చెప్పి యింకోయింటి కెళ్లాడు.

మండుటెండలో నడిచి పుల్లయ్య, పీస, దాసుడు పట్నంనుండి వచ్చారు. బెయిలు మీద విడుదలయిన పుల్లయ్యకు వీధివెంబడి రావటానికి సిగ్గువేసింది. పెరటిత్రోవవెంట వచ్చి ఇంటిలో దూరాడు. తండ్రికోసం యేడుస్తున్న మల్లు అయ్యను చూడగానే, సంతోషంతో కేక వేసి మీదకెక్కాడు. కొడుకుని నిమురుతూ "నా మల్లూ...సీపురు పుల్లలా అయిపోయావురా—యీ ఒక్క రోజుకే...!" అన్నాడు.

పీస నవ్వుతూ "నువ్వూ యీ కొడుకుని తల్సుకుని సీపురుపుల్లయ్యావు!" అన్నాడు.

నీలి ఈ అభిమానాలు స్థాయిలో పడే వరకూ మాటాడలేదు. పుల్లయ్యకు అన్నం తినేప్పుడు యెదురుగావున్న పెళ్ళాం వేపు చూడటానికి సిగు వేసింది. అంతలోనే తనను అన్యాయం చేసిన గ్రామపెద్దలమీదా ఆ కొల్లమీదా కోపం లోలోన మండుకుపోతూంది. కొడుకు తనతోకలిసి తింటున్నాడు. నీలి యేమీ మాటాడకుండా యెదర నిల్చుంది. ముసలమ్మ కర్రదువ్వెనతో వీధి అరుగుమీద జుత్తు పీక్కుంటోంది. సాలలోని పోతులు తనవేపే చూస్తున్నయ్! అన్నం తిన్నాక అంబలిపోసింది. పుల్లయ్య కొడుకు కూడా తినటానికి పోతూంటే వద్దు అని ముక్కుమీద వేలు వేశాడు. కొడుకు అలా ముఖంవేపు చూస్తూంటే దగ్గరగా తీసుకున్నాడు ఇంతట్లో పుల్లయ్య పట్నంనుంచి వచ్చాడని తెలిసి వూర్లో చాలామంది ఇంటికి వచ్చి పలకరించారు. వాళ్ళు వెళ్ళిపోయాక ఆత్మాభిమానం వుబికిపోయి, ఇంట్లో యిటూ అటూ పచారుచేనూ షీంకరించాడు. దీనికి కారకులైనవాళ్లని వూరకనే విడిచిపెట్టనన్నాడు. మళ్ళావచ్చి ధాన్యం యెలా తీసికెళ్తారో చూస్తానన్నాడు. ఈ గొడవకు ముసలమ్మ "ఎందుకలా అయిపోతావు నాయనా? నువ్వు తిట్టున్నావే వాళ్ళూ మనుషులే! మనిషికి మంచిచెడ్డలుండక మానుకుంటుందా?" ఇంకా యేదో అనబోతూంటే పుల్లయ్య "ఊరుకో" అని ఖస్సుమన్నాడు. ముసలమ్మ మాటాడలేదు నీలి భర్తకోపంలో యెక్కువభాగం కక్కేవరకు వూరుకుంది. అరుగుమీదకు వెళ్ళబోతూ మళ్ళి చటుక్కున జ్ఞాపకంవచ్చి పెరటిలోకి వెళ్ళాడు.

# ★ దగాపడిన తమ్ముడు ★

చుట్టుపట్ల గ్రామాల్లో కూడా గరిడీలో ఘటికుడైన పుల్లయ్య నీతిమంతుడైన మల్లునాయుడు కొడుకు, నడివీధిగుండా బేడీలతో వెళ్ళాడని తెలిసిపోయింది. జైదులో ఒకరోజు కూర్చున్నాడు—ఇది తనకెంత చిన్నరికం? తను కలలోనైనా ఇలావస్తుందని అనుకోలేదు. ఇది న్యాయానికి కాలంకాదని మనసులో కాకండా బైటికే అనేశాడు. రాట్నం తిప్పుతుంటున్న నీలి ఈ మాటలు విని "లోకాన్నీ కాలాన్నీ యెందుకంటావ్?"

"అననూ? ఊరు దిబ్బైపోదా?"

"ఊరు దిబ్బైతే మనం యెక్కడుంటాం? కెనవలేదా యెగిరే దూది గాలిలో యెంతసేపు వుంటాదని? పువ్వు సెటునుంచే నే పోబిక్కరం—"

"అయితే యేమంటావే?" అన్నాడు విసుగ్గా. కొడుకు యీ మూలనుంచి ఆ మూలకి ఆ-ఆ-అంటూ నడుస్తున్నాడు.

"ఆ కోపం, పౌరుషం నేకపోతే యీ గొడవంతా యెందుకొస్తాది?"

పుల్లయ్య మాటాడకుండా మీసాలు తిముడుకున్నాడు. నీలి మొగుడి కళ్ళలోకి ఒకసారి చూసి మళ్ళీ రాట్నంవైపు దృష్టి పోనిస్తూ "నువ్వు యే బాబుకి తోసినావో ఆ బాబే, రెండుపుట్లు తీసుకోమంటే, ఒక పుట్టే తీసుకున్నాడు. ఏ రాజిగాడ్ని నానా మాటలన్నావో ఆడిపెళ్ళమే, యేభైరూపాయలు యిచ్చి, నిన్ను యింటికి తెప్పించింది. నువ్వు ఒకరిని మంచి అనకపోతే, నీకొకరు మంచి అని యెందుకంటారు?"

పుల్లయ్య భార్యవేపు చూశాడు. ఇంకేమైనా అంటుందేమోనని యెదురుచూసాడు. కానీ ఆమె మరి మాటాడలేదు. కానీ ముఖంలో భర్త చేసినపనికి, ఆమె అయిష్టత స్ఫుటంగా అగుపిస్తూనేవుంది.

పుల్లయ్య రెండురోజులవరకూ ఇల్లు కదలేదు. పలుకరించడానికి వచ్చేవారు వస్తున్నారు. ఇంట్లో పెళ్ళాంతోనూ సరిగ్గా మాటాడలేదు. ఏం సన్నిహితంగా వుంటున్నాడో కొడుకుతోనే. ఆ కొడుకూ తండ్రిని విడిచిపెట్టలేదు.

ఈ కేసు వాయిదాలు పడుతూ వచ్చింది. ప్లీడరుకు ఇవ్వటానికి డబ్బు కావాలి. పట్నం వెళ్ళేటప్పుడల్లా యేదో ఖర్చు అవుతూనేవుంది. అమ్మడానికి తగ్గ ధాన్యం లేదు. ఉన్నమట్టుకి అమ్మివేస్తే మళ్ళీ ఈ ధరల ఎద్దడిలో కొనుక్కోవటం కష్టం. అంచేత అప్పుకు విధిగా వెళ్ళవలసి వచ్చింది. ఎవరూ ఇదివరలా మాటమీద అప్పుఇచ్చేవారు లేరు. పేరుకు గవర్నమెంటు రేటు ప్రకారం నెలకు నూటికి అర్ధరూపాయి వడ్డీ పత్రం మీద వుంటుంది కానీ వడ్డీ చెల్లించేటప్పుడు ధాన్య రూపంగా సంవత్సరానికి నూటికి మూడుపుట్లు చెల్లించవలసిందే ఈ వడ్డీకి వూర్లో కోమటిపేరయ్యే కాదు, పెద్ద రైతులంతా యెంత కావలిస్తే అంత యిస్తారు. యిది అన్యాయమని పుల్లయ్య అప్పుకి వెళ్ళలేదు. కాని వెళ్ళకాని వీలులేని పరిస్థితి వచ్చింది. తన స్వంతభూమి అస్వాధీనంతనఖాకు పెట్టవలసి వచ్చింది. రాజిగాడి పెళ్లమే రెండుపుట్ల ధాన్యానికి నీలి ప్రతిమాలగా యిచ్చింది.

తిరగా తిరగా వర్షాకాలానికి కేసులో తీర్పు ఇచ్చారు. ఈ అయిదు నెలలలోనూ రెండువందల వరకూ ఖర్చులయ్యాయి, మేజిస్ట్రేటు నూరు రూపాయల జరీమానా అది ఇవ్వకపోతే రెండు నెలల ఖైదు చెప్పాడు! ఆరోజున కోర్టు ఆవరణలో నవిరి వూర్లోవాళ్ళు ముప్ఫయిమంది వరకు వున్నారు. పుల్లయ్యకు యెక్కడలేని పౌరుషం వచ్చింది. ఆ గద్దెమీద కూర్చున్న మనిషికి న్యాయంలేదని ఈ లోకంలో నే న్యాయం చచ్చిందని చికాకు పడాడు. ఇలాంటి సమయంలో రాజిగాడి పెళ్ళాం తన అక్కసంతా వెళ్ళగక్కింది. ఏమన్నా నీలి మాటాడలేదు. ఊరకే వందరూపాయలు యిస్తున్నట్టు యిచ్చి నీ మొగుడితో ఇదంతా సెప్పుతావనే అన్నాను. ఎంతకాలం పద్దుమీద యిస్తాం! స్వాధీనం తనఖా పత్రం రాస్తేగానీ నీ మరిది ఒప్పుకోనంటున్నాడు"

నీలి మొగుడితో ఆ సంగతి సెప్తానంది సమయానికి ఆదుకున్నందుకు, ఆమె మేలు మరవనంది. పుల్లయ్య ఈసారి వారంరోజులవరకు ఇల్లు కదల్లేదు. ఒక్క కొడుక్కి తనకే సంబంధం. కానీ రానురాను పొలానికి, పోతులకి పచ్చగడ్డికి, వెళ్ళవలసివచ్చింది. వెళ్ళేవాడు కానీ తనేదో చిక్కిపోయినట్లు, తనను అంతా వేలెత్తి చూపిస్తూ హేళన చేసున్నట్లుగా బాధపడిపోయేవాడు. ఒక్కొక్కసారి కొడుకును తన భుజంమీద ఎక్కించుకుని నీలమ్మగుడికి వస్తున్నాడు. అక్కడె దాసుడు శివాలు వేసుంటే తండ్రికొడుకులు కూర్చునేవారు. చీకటి పడకండా ఇంటికి మరమడ్ని లేకపోతే ముసలమ్మ పులయ్యతో కయ్యమాడేది. ఏ గాలో ధూళో సోకితే పిల్లడు చిక్కిపోతాడని ఆమె భయం.

ఇంకా వరిచేను పండలేదు నెలరోజులకి గానీ పంట అందిరాదు. కొట్లో ఒక్క గింజ లేదు; చోళ్ళు కూడాసరి. ఎవర్ని అప్పు అడగడానికీ పుల్లయ్యకు నోరు రాలేదు. నీలి రాజిగాడి పెళ్ళందగ్గరకు అప్పుకి వెళ్ళింది. అప్పటికి రూపాయకి అడ్డెడు బియ్యం ఇస్తున్నారు. కరువు హోరుమంటోంది! కంట్రోలు బియ్యం యెర్రగా మేకుల్లా వున్నాయ్. పసువులు కూడా తినవు! అవి కొద్దిగా చవుకగా వున్నాయని కొనిదంచితే నూకలయ్యేయి. ఆ నూకలన్నం మానూ తినలేకపోయేవారు. బయట కొనుక్కుంటే ఒక రూపాయకి అడ్డ. పైరుపంటల ధరలు, ఉప్పు, పప్పు, నూనెలధరలు విపరీతంగా పెరిగున్నయ్. ఉన్నవాళ్లకి డబ్బు చేసుకోడానికి లేనివాళ్ళు మలమలమాడిపోడానికి కొద్దో గొప్పో ఉన్నవాళ్ళు అనుగంటిపోవడానికి ఇవేరోజులు. ఈ రోజుల్లోనూ నీలి చెయ్యి కట్టివేయబడలేదు. ఎక్కడా యేమీ దొరక్కపోతే, చచ్చిపోకండా ప్రాణం నిలుపుకోడానికి బుక్కెడు గంజి దొరికే లియిల్లునీ

ఉందని, కుష్ఠురోగికీ, వెంకన్నకు, గన్నెమ్మకు తెలుసు.

బియ్యం రూపాయికి అడ్డ చొప్పున, జొన్నలు రెండడ్డలు చొప్పున ఇస్తూ ఆఅప్పు, పంట వచ్చే సరికి, మూడువందలయాభైనుంచి నాలుగువందలయాభైకి రాజిగాడు పొడిగించాడు. పుల్లపు బట్టిలో ఒకమాదిరిగా పండింది. మెరక బట్టిలో సగానికి సగం పద్దు. ఆ భూమిమీద పండిన పంటలో మూడింట రెండువంతులు పడికి వెళ్ళింది. మిగిలిన ఐదుపుట్లలో దానధర్మం, చాకలీ మంగలికి పోను ఇంటికివచ్చింది రెండుపుట్లే! బుగతి అంబారానికి సరిపోయింది ఆపొలం మీద పంట! రెండుపుట్లతో ఒకయేడాది గడపట మెలా? ఈ ఆలోచనలు వద్దన్నా పుల్లయ్య మనసులో చొచ్చుకపోయేవి తను ఇదివరలా హుషారుగా లేదు. తను చిక్కిపోతున్నాడని తన పాతకీస్నేహితులు అనుకుంటున్నారు. వాళ్లలోనూ వయసు వచ్చింది—కానీ ఉత్సాహంలేదు. వాళ్ళ వయసులో తను యెంతహుషారుగా వుండేవాడు! వాళ్లు గరిడీలో ఘటుకులు అనిపించుకోలేదే. చుట్టుపట్ల వూర్లలో వాళ్ళలో యేవొక్కరిపేరూ యెవరికీ సరిగ్గా తెలియదు. ఈతరం వాళ్ళల్లో ఏదో లోటు కనిపిస్తూనేవుంది. గంతే తన కొడుకునిమాసి గర్వించేవాడు. కడుపునిండా తృప్తిగా భోజనం చేసినట్లనిపించేది. "నాకొడుకు తరంవాళ్లు మళ్లా ఈలోకంలో న్యాయం నీతి నిలపరా? నాకొడుకు సుక్కల్లో సెందురిడిలా అగపడడా? ఈడుండగా నాకేంనోటు?" అని తమాయించుకొనేవాడు. ఇలా గర్విస్తూనే వూర్లో కొత్తగా కట్టిన్న పెంకుటిల్లు కేసి చూసేవాడు. కోమటిపేరయ్య గుడిసెపోయి డాబా యిల్లయింది. పరపతివున్న పెద్ద రైతులు పెంకుటిళ్ళు కట్టించివేస్తున్నారు. ఇంటిమీద నిరుడు గడ్డివేసుకొని నేయించినవాళ్లు కొందరు, ఈ సంవత్సరం అదీ చెయ్యలేని పరిస్థితిలో వున్నారు. మనుషుల్లో మాటనిలకడ వున్నట్లు తనకు తోచలేదు. డబ్బుతో మంచిచెడ్డా, ఇంటా, బయటా, న్యాయం నీతికొలవటం జరుగుతోంది. ఇదంతా చూస్తూ తలచుకొని తన జుత్తు కూడా పండిపోతున్నదేమో నన్న అనుమానం కలిగింది. ఈ దారుణ పరిస్థితులు చూసి, దాసుడు వూరిలో రాత్రనక పగలనక, పెద్దవారి వందరినీ, ఎక్కడపడితే అక్కడే అడుగూతుంటే నలుగురూ వాడు పిచ్చివాడయ్యాడన్నారు.

సీన రేదో ఒకపూట పుల్లయ్యయింటికి వస్తున్నాడు. నీతికి నిలబడి బుగతకు అంబారం కొలవగా మిగిలినది అయిపోవచ్చింది. ఈపిల్లలతో ఎలాగడపటమా తోచలేదు. మల్లును చేరదీసుకున్నాడు. వాడితో ఆడుకుంటూంటే, కొంత ఈ విచారం మాయమయ్యేది. సీసతాత, భుజానెక్కి కొసి పళ్లతో ముత్యాల వర్షం కురిపించేవాడు. తాత, ముక్కూ, మీసాలు, జుత్తూ, ఒకొక్కసారి కోపంవస్తే పీకేసేవాడు.

శివరాత్రి వచ్చింది. ఊర్లో యవ్వరాళ్ళ కుటుంబాలు, వాళ్ళ ఇవు దేముడికి సంబరం చేసారు. అప్పుడు గుండెకు తిప్పిడి గుళ్లు కట్టుకొని ఆడాలి. వాళ్ళవి అసలే కలిగినకుటుంబాలు. ఈ ధరల్లో డబ్బు బాగా చేసుకున్నారు. ఆచార ప్రకారం పుల్లయ్య కూడా వెళ్ళి ఆడాడు. మల్లు తిప్పిడిగుళ్లు కడితే చేగానివూరుకోలేదు. ఉపవాసం ఉన్న యవ్వఅప్పుడు దివిటీపట్టుకొని ఆడుతున్నాడు. అలిసిపోయినట్లున్నాడు. చుట్టూ వున్న వాళ్లు "అలిసిపోయినావా నాసామి!" వాయిస్తూ గంతుతున్నాడు. తాళంవేస్తూ తండ్రిని అనుకరిస్తూ కొంతసేపు గంతాడు. కడపట్నా, అరటిపళ్లు పంచిపెట్టారు. ఇందులో సీన కూడా పాల్గొన్నాడు కానీ, ఎంతసేపో ఆడలేకపోయాడు. కాళ్లు పీకటిపోయాయ్. ముందురోజు రాత్రి నోటిలో మంచినీరు పోసుకొని నిద్రపోయాడు. ఇచ్చిన పలహారంలో కొంతలో మిగతా ఇంటికి తీసుక వెళ్లాడు.

(41-వ పేజీ చూడండి)



పండుగ అప్పచ్చులకోసం

—చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ, వల్లభాపురం.

# అత్తగారూ ఆవకాయా



సాధారణంగా మద్రాసులో వుంటే తెలుగు జనాభాకు ఆవకాయ తినే ప్రాప్తం కలగడం అదృష్టంలో ఒక భాగం అని చెప్పాల్సిందే. విజయవాడదగ్గర్నుండి విశాఖపట్నం వరకూ వుండేవూళ్ళల్లో బంధువులో, తెలిసిన వాండ్లో వుండి ఆవకాయ జాడీలు మద్రాసుకు రవాణా చేసేతప్ప బంధువులూ, తెలిసిన వాళ్ళూ, కనీసం ఆవకాయ సప్లయిచేసేరకం బంధువులు, యిద్దరూ లేని తెలుగువాళ్ళు మద్రాసులో కొనే మామిడికాయలు తినాల్సిందేకాని ఆవకాయ తినేఅవకాశం లేదు.

ఆవకాయపెట్టడం తెలిసిన భామ్మగార్లు వుంటే కుటుంబాలకు బాధేలేదు. నూజివీడు రసాల కాయలూ, సామర్లకోట పప్పునూనె తెప్పించలేకపోయినా మద్రాసు మామిడి కాయలతోనైనా ఘుమఘుమలాడే ఆవకాయ పెట్టగలరు. ఎటొచ్చీ తినటం తెలిసి ఆవకాయ పెట్టడం తెలియని మాలాటివాండ్లకే అవస్థ. పోయినసంవత్సరంవరకూ తెలిసినవాండ్లు బెజవాడప్రాంతాలనుండి ప్రతియేటా ఆవకాయ పంపుతూండేవాళ్లు రెండు మూడు



రచయిత్రి

పెద్ద జాడీల్లో. యీ సంవత్సరం వారింట్లో పెండ్లిండ్లు రెండు మూడు జరగడంవల్ల మాకు ఆవకాయ పంపే వ్యవధి వారికి లేకుండా పోయింది. ఇన్నాళ్లూ ఆవకాయనుగురించి ఆలోచించని నాకు "ఇంట్లో ఆవకాయ లేదు; యీసంవత్సరం రాదు" అని తెలియగానే గుండె గతుక్కుమంది.

## 'ఆరోజులు రావు'

కొన్ని వస్తువులు వున్నప్పటికంటే లేనప్పుడు ఎక్కువ అగ్రస్థానం వహిస్తాయి మనుషుల మనస్సుల్లో — ఆలాగే ఆవకాయ ప్రతి ఏటా వస్తున్నప్పుడు మా వంటచేసే అయ్యరు అన్నం వడ్డించినవెంటనే "ఆవహా, ఊరుహా వేణుమా" అంటే "వేండా శ్వా ఎప్పుడూ ఆవకాయేనా దరిద్రం" అన్న రోజులుకూడా వున్నాయి. మేము ఆవకాయ వున్నప్పుడు మావంట అయ్యరు పచ్చళ్లు చేయడానికి బద్ధకించేవాడు. యీసంవత్సరం ఆవకాయ లేకపోయేసరికి మావంట అయ్యరు చేసేవంటలోని లోపాలన్నీ ఒక్కొక్కటే బయటపడ్డం మొదలెట్టాయి. ఈ సంవత్సరం వంటఅయ్యరు ఏంచేస్తే అది తిని, నోరు మూసుకుని, వూరుకోవాలి గాబోలు నని అనుకున్నప్పుడంతా ఆవకాయకోసంనోరూరడం మొదలెట్టింది. ఆవకాయకోసం మాయింటికి మావారి మిత్రులు కొందరు కుటుంబాలతో సహా భోజనానికి వచ్చేవారు. అప్పుడప్పుడు, "ఆహా ఎన్నాళ్ళకు తినగలుగుతున్నామండీ మనదేశపు ఆవకాయ" అని వాళ్ళంతా లొట్టలు వేస్తూ తింటుంటే, మేము చాలా




ర్లక్ష్యంగా "ఆ ఆవకాయ కేం భాగ్యం ండీ, మాకు ప్రతిఏటా వస్తుంటుంది ఆవ ాయ" అనేవాళ్ళం గర్వంగా.

ఆవచ్చినవాళ్లు అందరూ సగంజాడీ తినేసి, గంజాడీ యింటికి పట్టుకుపోయేవాళ్లు తలా ొప్ప.

## రోజులు మారాయి!

"అయినా అంత ఆవకాయ పట్టికెళ్ళి మూశే! ఈ సంవత్సరం మన యింటికి ల్తుందో లేదో"అని నేనుఅనుకుంటూంటే ్ప చాలకపోతేపోనిస్తూ. ఎంతనితింటాం ాయ. నాకు వద్దనేవద్దు. నీకా్కవా టే మిగిలిన ఆవకాయ దాచిపెట్టి టూండు" అన్నారు మావారు ఎగతా . అలాంటి మావారు యీ సంవత్సరం కాయ యింట్లో లేదని తెలిసిన తర్వాత తనేమన్నదీ కూడా మర్చిపోయి "అయ్యరు గాడుచేసే యీ పచ్చళ్లు తింటం చాలా కష్టం. ఆవకాయ వుంటే బావుంటేది — అంటం మొదలెట్టాగు. మాఅత్తగారు మడిలో వుంచిన నిమ్మకాయవూరగాయతప్ప యింట్లో వేరే ఏవూరగాయ లేదు. మా అత్తగారు కారంలేని నిమ్మకాయ వూరగాయ తింటుంది. మాకు సయించదు. అందుకే ఆమె మడిట్లో ఒకమూల దాచిన బూజుపట్టిన నిమ్మకాయజాడీని ఎవరూ ముట్టుకోక పోవడానికి కారణం.

మావారు ఒకరోజు మధ్యాన్నం భోంచేస్తూండగా, 'కొడుకు ఆవకాయ లేదని కలవరిస్తున్నాడే' అని ఎంతో ప్రేమగా మడినిమ్మకాయ వూరగాయ తెచ్చి కొడుకు కంచంలో వడ్డించారు మా అత్తగారు...కొడుకు ఆ నిమ్మకాయ వూరగాయను ముట్టుకోకపోగా కంచంలోంచి తీసి కిందపడేశాడు. మా అత్తగారు చూడలేదు గానీ చూస్తే చాలా నొచ్చుకునేది పాపం...తర్వాత నన్నడిగింది. "అబ్బాయి వూరగాయి ఎల్లావుందన్నాడూ?" అని.

"చాలా బావుందన్నారు...కానీ ఆవకాయ వూరగాయంటేనే ఆయన కెక్కువ యిష్టం. ఈ సంవత్సరం ఆవకాయ రాలేదే ఏంచేయడం! ఎవర్ని అడగడం! అన్న దిగులు పట్టుకుంది" అన్నాను.

## "బ్రహ్మవిద్యటే?"

"ఆ—నీదంతా చోద్యమే మరీనూ— ఎవర్నో ఎందుకడగడం? ఆవకాయ పెటడం ఏం బ్రహ్మవిద్య గనకనా తెలీకదుండటా?... అయినా అంత కారం, అంత నూనె వేసిన అవుత్తరాదివాండ్లే ఆవకాయ మీరంతా లొటలువేస్తూ తింటూంటే నా కళ్ళవెంట నీళ్ళు కార్తాయి...అయినా మనకెందుకులే అని వూరుకున్నాను....అసలు అంత కారంగా వుంటే ఆవకాయ తింటే మీ ఒళ్లు ఏంగతి గానూంట?

"నే పెట్టేస్తానుండు ఆవకాయ" అన్నారు మా అత్తగారు దర్జాగా కూర్చుంటూ

నా ప్రాణం లేచివచ్చినట్లయింది. "అంతకంటేనా. మీరు గనక ఆవకాయ పెడితే యింక మనకు ఆవకాయ లేదన్న లోటు వుండదు యీ సంవత్సరం" అన్నాను సంతోషంగా...

"ఆ నీదంతా చాదసమే మరీనూ. ఏ సంవత్సరమైనా మనింట్లో నే పెట్టుకోవచ్చు ఆవకాయ...ఏం బ్రహ్మవిద్యాంటాను— నిమ్మకాయంతో, ఆవకాయ అంతా... అన్నారు తేలిగ్గా మా అత్తగారు.

"అంతే అంతే"అన్నాను అనిజేమన్నదో అర్థంగాని నేను...కాని నాకో సందేహం కలిగింది. మా అత్తగారు పుట్టినిల్లు చెంగల్పట్, మెట్టినిల్లు సంద్యాల. ఆవకాయకూ మా అత్తగారికీ ఎల్లాంటి సంబంధం వుంటుందా అని చాలాసేపు ఆలోచించాను. అనుగునామనుకున్నాను మళ్ళీ ఆక్షేపిస్తోంది అనుకుంటుందని వూరుకున్నాను.

"అయితే ఏమేం కావాల్సుంటాయి వస్తువులు ఆవకాయ వేయడానికి" అని అడిగాను తెల్లకాగితం పెన్సిలు చేతపుచ్చుకుని ఆవిడగారి గుమాస్తాలాగా...వెంటనే మా అత్తగారు కాలుమీద కాలు, మోతిమీద చేలు వేసుకుని ఒక్కక్షణం ఆలోచించారు.

"మామిడికాయలు కావాలిగా" అన్నాను మా అత్తగారి ఆలోచనకు అంతరాయం కలిగిస్తూ...

"అవ్వే ఎందుకే?" అన్నారు అలక్ష్యంగా

# ★ అత్తగారూ - ఆవకాయా ★

దప్పరిస్తూ... నేను తెల్లబోయి ఆమెకేసి చూశాను...

"పదిహేనెకరాల మామిడితోటలో మనం వుంటూ, లక్షణంగా కాసే మామిడిచెట్లు పెట్టుకుని, యింకా కాయలెందుకే మనకూ" అన్నారు చిరునవ్వు లొలకబోస్తూ.

"అయితే మన తోటలోని పండ్లకాయలే వేస్తానంటారా ఆవకాయ?" అన్నాను.

ఓ భేషుగ్గా చెయ్యొచ్చు. ఆవకాయకు కావలసింది మామిడికాయేగా! ఏకాయయితేనేం!...మన తోటలో దక్షిణంవైపు చెట్లన్నీ భేషైన కాయలు కాస్తాయి—పడమటివైపు చెట్లు! ఎంత కండగల కాయ అనుకున్నావు—పోయిన సంవత్సరం తోటంతా విరగ కాశాయి కాయలు—మరి నాలుగు వందలు ఎక్కువ చెప్పి కౌలుకివ్వనే అంటే విన్నావు కాదు—వాడికెంత లాభం వచ్చిందో తెలుసా! మన తోటవాడు చెప్పాడు—యీ సంవత్సరమూ అంతే. వాడికింకా లాభంవస్తుంది...అట్లా కాసింది తోటంతా...

## ఐదువేలు చాలు

"పోనిలెండి ఏటా కౌలుకు తీసుకునే వాడు నాలుగు డబ్బులు సంపాదించుకోనివ్వండి—పై సంవత్సరం అడగవచ్చు ఎక్కువడబ్బు..." అన్నాను.

"హా...యిస్తాడు—మళ్లీ ఏ నష్టమో వచ్చిందంటాడు. అందుకే యిప్పుడు ఆవకాయ పెట్టబోతున్నానుగా. అయిదు వేల కాయలూ అడిగి పుచ్చుకుంటే సరి—అన్నారు మా అత్తగారు దిట్టంగా బాసీపెట్లు వేసి కూర్చుంటూ...

"అయితే అయిదు వేలకాయలూ ఆవకాయ పెడతానంటారా?" అన్నాను ఆశ్చర్యంగా.

"కాకపోతే! మీ చెల్లెళ్ల యిండ్లకూ, యింకా తెలిసినవాండ్ల యిండ్లకూ పంపాల్సి వుంటుందిగా! కొద్దిగా పెడితే ఏం చాలుతుంది మనింటికి. వాడినిమటుకు అయిదు వేల కాయలూ అడగాల్సిందే డబ్బు తక్కువిచ్చి, కాయలూ యివ్వకపోతే ఎట్లా? అన్నారు కౌలువాడిమీద కత్తికట్టిన మా అత్తగారు."

"అయిదు వేల కాయలు వాడివ్వడేమో మామూలుగా వాడివ్వాల్సిన కాయలు వెయ్యి. నేను అయిదువందల కాయలు చాలన్నాను...ఎటుతిరిగీ మనకు ఎవరోకరు తెలిసినవాండ్లు రసాలూ, బంగినిపల్లి పండ్లు పంపుతుంటారు గదా. యింకా మనతోటలోని పండ్లన్నీ ఎవరు తింటారనే వుద్దేశ్యంతో తగ్గించి యిమ్మన్నాను, మళ్ళీ యిప్పుడు అన్ని కాయలు కావాలంటే ఏంబావుంటుంది అన్నాను.

## దశరథుడి కథ

"ఆ! నీదంతా చోద్యమే! నీవపక్క పోతే నేనడుగుతానుండు—అన్నట్లు వాడి పేరేమిటే, జటాయువా. జానకిరామా"!—

నాకు పక్కున నవ్వొచ్చింది. ముసలివాళ్ళందరికీ జటాయువంటే ఎందుకో అంత అభిమానం అని—"వాడిపేరు జటాయువూ కాదు, జానకిరామూ కాదు దశరథుడు" అన్నాను నవ్వాపుకుంటూ...

"ఆ—ఏ అతిరథుడో—ఎవడికి జ్ఞాపకం—వెంటనే వాడికి కబురుపంపి పిలిపించు—వాడిచేత అయిదు వేల కాయలూ కక్కిస్తాను...పదిహేనెకరాల మామిడితోట కౌలుకు తీసుకుని తక్కువ డబ్బిచ్చి దగా చేసేది కాకుండా మామూలుగా మనకిచ్చే మామిడికాయలు కూడా తక్కువిస్తే ఎట్లాగూంట! అన్నారు మా అత్తగారు పాయింటు దొరికిన ప్లీడర్ గారికి మల్లే...

## ధర్మసందేహం

"ఒక్క మామిడికాయలోనే ఆవకాయ కాదుగా! నూనెకావద్దూ? అన్నాను.

ఎందుకూ! అన్నారు.

"ఎందుకేమిటీ 'ఆవకాయలో నూనె వెయ్యరూ!...అన్నాను. ఆశ్చర్యపోతూ...

"వేస్తారు సరేనే—నూనెకొంటం ఎందుకూంట!

"మనతాముంచేలో పండిన నువ్వులు ఎనిమిది బస్తాలూ ఏమయ్యేట్టూ? మనయింటికి సంవత్సరానికి ఆరుబస్తాల నువ్వులనూనె చాలు పైరెండు బస్తాల నూనే వంటవాడు పొయిలోనే పోస్తున్నాడు—.

"ఆ నూనె మీరు ఆవకాయలో పోస్తానంటారు. అయితే రెండు బస్తాల నువ్వుల నూనె అయిదు వేల కాయలకు కావాలంటారు—అన్నాను వ్రాసుకోబోతూ.

"అబ్బే ఎందుకే! వెయ్యికి శేరునూనె, అయిదు వేలకూ అయిదు శేర్లనూనె ఎక్కువ అన్నారు మా అత్తగారు—.

"పప్పునూనెగదూ! అన్నాను.

"ఏం పప్పు! కందిపప్పా! ఎందుకే నీదంతా చాదస్తం. యింట్లోవుంటే నూనె చాలు మొన్న ఆడించిన ఆరుసేర్లనూనె అలాగే వుందిగా—అసలు నూనె ఎక్కువేస్తే మాకు సయించదు—"అన్నారు మా అత్తగారు—



ఆవకాయ ఆర్డసు తెలియని నేను మా అత్తగారు చెప్పినవన్నీ భక్తితో లిస్టు వ్రాసుకోడం మొదలెట్టాను. మధ్య మధ్య తెలిసీ తెలియనిసందేహాలను ఒకవైపు వెళ్ళుతూ.

ఆవకాయ విషయంలో పూర్తిగా మా అత్తగారి మీద ఆధారపడదల్చుకున్నాను—

"మరి కారం?" అన్నాను.

"అదీ అంతే! మనచేలోపండిన మిరప కాయలు అయిదు బస్తాలూ స్టోరు రూములో మూలుగుతున్నాయి—ఒక్క బస్తామాత్రం వాడుక్కు బయటవుంచాను—

"అయితే మిగతా నాలుగు బస్తాల మిరప కాయలకారం అయిదు వేల కాయలకు వేస్తానంటారా—? అన్నాను ఆశ్చర్యంగా.

"ఇంకానయం—అయ్యో పిచ్చిపిల్లా— అంటూ మా అత్తగారు తన ఏనుగు దంతాల వంటి రెండు కోరలబోసి నోటితోనూ విరగ బడినవ్వారు.

"మరి ఎంత కారం కావాలంటారు కొట్టించాలిగా కారం? అన్నాను—

"ఎందుకే—నీదంతా సింగినాదం మరీనూ. కారం కొట్టించడం మా తాతలనాడే లేదు. యిప్పుడెందుకు? మినపనుకు వేయిసే సరి. ఒక్కవీశ కాయలు చాలు-మా కసలు కారం పడదన్నానుగా—"

"మరి వీశకాయలకారం అయిదు వేల మామిడికాయలకు చాలా!" అన్నాను వుండ బట లేక—

## 'నిమ్మకాయెంతో ఆవకాయంతే'

"అ చాలకే మొచ్చిందే. ఉత్తరాదివాళ్ళ లాగా అంత కారం నే వేయనమ్మా—అంతగా చాలకపోతే తర్వాత కాస్త వేసుకోవచ్చులే. మొన్న నేను నిమ్మకాయకు అసలు కారమే వేయలేదు. మాకావుగా అయినా నాలిక చుర్రుమంటూనే ఉంది." అన్నారు మా అత్తగారు.

మధ్యాహ్నం మా వారు పారేసిన నిమ్మకాయ అదేగదా అనుకుని మనసులోనే నవ్వుకొన్నాను.

"అయితే కారంచాలక పోతే తర్వాత వేసుకోవచ్చంటారు" అన్నాను కారం చాలదనే సందేహం వదలక.

"ఓ భేషుగ్గా వేసుకోవచ్చు—నిమ్మకాయకు వేయడంలా ఉప్పూ కారం కావాలంటే అంతే! నిమ్మకాయంతో ఆవకాయంత—అన్నారు మళ్ళీ—.

"అయితే మరి ఆవపిండో! అన్నాను. అన్నీ నేనే అందిస్తూ వస్తున్నాను—

"ఆ—ఆ—ఆవాలు మాత్రం కొద్దిగా కొనాలి మిగతా అన్నీ మన యింట్లోనే వున్నాయి. ఉప్పూ పసుపూ మెంతిగింజలీని_ ఆవపిండి మనకెంతసయిస్తే అంతే సుకోవచ్చు. అయిదు వేల కాయలకూ ఒక సేరు ఆవపిండి చాలని నా అభిప్రాయం. ఎక్కువయితే వేడిమి చేసుంది—.

నన్నడిగితే వుప్పెంతో కారం అంత, కారం ఎంతో ఆవపిండి అంత, ఆవన్నీ ఎంతో నూనె అంత – నిమ్మకాయంతో ఆవకాయంత – అని ముగించారు అత్తగారు. ఆవిడ చెప్పినవన్నీ శ్రద్ధగా వ్రాసుకున్నాను కాగితంమీద—

"అన్నట్లు అకోలు వాడిపే రేమిటో మర్చిపోయాను...వాణ్ణి పిలిపించు తక్షణం – వాడితో మాట్లాడో, పోట్లాడో అయిదు వేల కాయలూ తీసుకున్నదాకా నిద్రపటదు నాకు...అంటూ లేచి గోల్కొండ వ్యాపార్ల గోచీ సరిచేసుకుంటూ వంటింటి వేపు వెళ్ళారు మా అత్తగారు.

నేను అత్తగారి ఆజ్ఞానుసారం మామిడి తోట కౌలుకు తీసుకున్న దశరథుడికి కబురు పెట్టాను.

దశరథుడు చేతులు కట్టుకుని వినయంగా వచ్చి మా అత్తగారి ముందు నిలబడ్డాడు – నేనుంటే మరీ ఏడ్పిస్తాడని పులిముందు మేకపిల్లను వదిలి పెట్టినట్లు మా అత్తగారి ముందు దశరథుణ్ణి వదిలి నేను వంటింటి ముందున్న వసారా మీద వెళ్ళి కూర్చున్నాను.

మా అత్తగారు హైకోర్టులో వాదించే లాయరుకుమల్లే దశరథుడితో వాదిసోంది. వాడి కాళికి వేసి, మెడకు వేసి, చివరకు అయిదు వేల కాయలూ యివ్వకపోతే మామిడితోట విడిచిపెట్టి పొమ్మన్నారామె – యిచ్చిన అడ్వాన్సు డబ్బు కావాలంటే తిరిగి యిచ్చేస్తానని కూడా దబాయించింది. దాంతో నిజంగానే దశరథుడు భయపడి పోయాడు...

"అయితే అమ్మగారూ అయిదు వేలపంట్లయితే నేనిస్తాను అప్పుడప్పుడు-కాయలేం చేసుకుంటారు తల్లీ అన్నాడు భయపడుతూన్న దశరథుడు...

"ఆవకాయ వేస్తావా – ఆవకాయా... అయినా ఏం చేస్తామో నీతో చెపితేనే యిస్తావా కాయలు? అని గద్దించి అడిగారు మా అత్తగారు...

అది కాదండి అమ్మగారూ అయిదు వేలూ పండ్లు వేస్తారా కాయలుగా కావాలా అని అడిగానండీ – యిప్పటికే బాగా ముదిరి పండుబారిపొయ్యాయి కాయలన్నీ అన్నాడు దశరథుడు.

ఆ మాటవిన్న నాగుండె గతుక్కుమంది. మా అత్తగారు పండావకాయ పెడతారేమోనని భయపడ్డాను...

"ఆ ముదిర పండుబారిన కాయలు పిల్లలు తింటారు. కాని నువ్వుమాత్రం అయిదు వేల కాయలకూ ఒక్కటి తక్కువిచ్చినా తీసుకోను జాగ్రత" అని మా అత్తగారు దశరథుని పంపించేశారు...

మామూలు కంటే జోరుగా నడుస్తూ వచ్చారు మా అత్తగారు వంటింట్లోకి...

"ఏమన్నాడు అన్నాను. ఏమీ వినవట్లు..

"ఏమంటాడు! ఉక్కున పేనల్లే దక్కుతాయినాడు అయిదు వేల కాయలూనూ – లేకపోతే తోటవిడిచి పొమ్మన్నాను. వచ్చేఏడు డబ్బుకూడా యిలాగే దబాయించితీసుకోవాలి గాని వాడెంతంటే అంతకు నిక్షేపం లాంటి మామిడితోట వదుల్తారంటే?

అన్నారు సింహలగ్నంలో పుట్టిన మా అత్తగారు— నేను నుప్పప్ప చెప్ప ఆమెకేసి చూస్తు వుండిపోయాను

## యజ్ఞారంభం

మర్నాడు తెల్లారుజామున మా అత్తగారు హడావిడిగా యింటిల్లిపాదిని నిద్ర లేపారు. వంట చేసే అయ్యారు పక్కింటినుండి రెండు కత్తులూ, ఎదురింటనుండి రెండు కత్తిపీటలు, ఇంట్లో మూల పారేసిన మొద్దు కత్తులూ, తుప్పుపట్టిన కత్తిపీటలూ తీసుకుని రణరంగానికి బయలుదేరినట్లు పనివాళ్ళూ, నేనూ, మా అత్తగారూ, వంటింటి ముందు వసారాలో చేరాం.

అయిదు వేల కాయలూ పెరటివేపు వరండాలో రాశి పోసివున్నాయి. మా అత్తగారు ఆ రాశి చూస్తూనే "చాలా కాయ లొచ్చా,

(41- వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**(19-3-58 మొదలు 25-3-58 వరకు)**

[ఈ వారము మార్చి 20 తేదీలో హేమలంబనామ సంవత్సరము అంతమగును. 21 నుండి శ్రీ విలంబనామ సంవత్సరము ప్రారంభమగును.]

## గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| రబు | కే | | |
| | కుంభ, మీన, మేష, వృషభములలో చంద్రుడు | | |
| కు శు | | | |
| శ | | గు రా | |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

గతవారము కొంకుండా నిలిచిపోయిన పనులు ఈవారం ఫలిస్తాయి. ఆటంకాలు తీరుతవి. ఆదాయము వృద్ధిపొందుటచే ఇదివరకు మీరు చేసిన అప్పు తీరుస్తారు. సంగీత సభలు, కవితాగోష్ఠి మొదలగు వినోదములలో బంధువులతో కలిసి పాల్గొని మృష్టాన్న భోజనము ఆరగిస్తారు. విద్యార్థులకు చదువు శ్రద్ధగా సాగుతుంది. బియ్యము, నూలు, బట్టల వర్తకులకు, వెండినగల వ్యాపారసులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. ధనలాభము, కార్యసిద్ధి, బంధుసమాగమము మొదలగు శుభయోగములున్ననూ, కార్యసాధనలో వారమంతా త్రిప్పట, శ్రమ, అశాంతి వుంటుంది.

### * భరణి [లీ, లూ, లే, లో] *

గతవారము కలిగిన మంచియోగము ఈ వారము కూడా కొనసాగుతుంది. ధనాదాయము ఎక్కువగా వృద్ధిఅవుతుంది. 20, 21 తేదిలలో మీకు వాహనయోగము, గృహమందుండువారికి అలంకారప్రాప్తి కలుగుతుంది. ఇతరులకు ఉపకారముచేసి కీర్తి పొందుతారు. విద్యార్థులు వినోదముతో కాలము గడిపిననూ చదువుమీద కూడా శ్రద్ధ వుంచుతారు. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభం. కవులకు, గాయకులకు, కళాకారులకూ, నటీనటులకు యోగకాలము. వారమంతా త్రిప్పట, శ్రమ, అశాంతివున్నను కార్యసిద్ధి, ఆప్తులతో విందు, వినోదము, శుభవార్త మొదలగు మంచి యోగములు వున్నాయి.

### *కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]*

ఏ వ్యవహారంలోనైనా ఎంత కష్టపడినప్పటికీ కార్యములు నెరవేరవు. త్రిప్పటవల్లను అకాలభోజనమువల్లను అనారోగ్య చిహ్నాలు కనబడిన వెంటనే శ్రద్ధ వహించండి. ఉద్యోగస్తులకు బాధ్యతలు ఎక్కువైనా ఆదాయము కూడా పెరుగుతుంది. విద్యార్థులకు చదువు సాగదు. రాజకీయవాదులకు కార్యలాభం.

## బి. నరసింగరావు

20, 21 తేదిలలో ఖర్చులు ఎక్కువ. 22, 23, తేదిలలో త్రిప్పట, కార్యభంగము. 24, 25 తేదిలలో అనారోగ్యము.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈవారము మీకు అంత యోగదాయకముగా వుండదు. ప్రయత్నించిన కార్యాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగస్తులు ఆర్థిక చిక్కులను ఎదుర్కోవలసివస్తుంది. కాని నిజమైన మిత్రుల సహాయమువల్ల కార్యసిద్ధి పొందుతారు. విద్యార్థులకు చదువుమీద ఉత్సాహం తక్కువ. వ్యాపారస్తులకు మొదట్లో మాంద్యముగా వున్నను వారాంతమునకు కొంతలాభిస్తుంది. ఆప్తుల అనారోగ్యము మనోవ్యధ కలుగచేస్తుంది. 20, 21 తేదీలలో అజ్ఞాతమిత్రుని సహాయము, కార్యసిద్ధి. 22, 23 తేదిలలో త్రిప్పట, శ్రమ. 24, 25 తేదిలలో ఆరోగ్యచింత.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈవారము మీకు మిశ్రమయోగం. మీ ప్రయత్నాలకు ఆటంకాలు కలుగుతాయి. మీశక్తినంతనూ ఉపయోగించి కార్యసాధనకు ప్రయత్నిస్తారు. ఈశ్వరానుగ్రహము కలిగిన అన్నీ సాధ్యపడతవనే నమ్మకముతో వ్యవహరించుటవలన ఫలసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు కొత్తబాధ్యతలు. వ్యాపారస్తులకు ఆందోళన. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తక్కువైనా, క్రొత్త విషయాలు నేర్చుకుంటారు. వారమంతా నిలకడలేనిస్థితివున్నా ప్రయాణము, ఆత్మవికాసము, కార్యలాభము మొదలగు యోగములు కలుగుతాయి. 20, 21 తేదీలలో ఖర్చులు ఎక్కువ. పిండివంటలతో భోజనము. 24, 25 తేదిలలో ఇంటోవున్న వారి ఆరోగ్యం సరిగా వుండనందున ఆందోళన.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈవారము మీరు చేయవలసినపనులుచాలా వున్నా ఏమిచేసిందికి మనస్సు కుదరదు. ప్రతిప్రయత్నానికి ఆటంకాలు కలిగి డబ్బు దండుగకూడా అవుతుంది. మీపనులతో బాటు పరోపకారమునకు తలపెటినందున అవి జరగక వివాదములు రేకెత్తుతాయి. కోర్టు వ్యవహారములలో కొంత మేలు కలుగుతుంది గాని ఖర్చులు ఎక్కువగుటచేత ఆ సంతోషము అంతగా వుండదు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారమువల్ల కొంత నయముగా వుంటుంది. వ్యాపారస్తులకు లాభము తక్కువ. కొంత అనుకూలతవున్ననూ వారమంతా కార్యభారము, శ్రమ, వివాదాలు, మనోవ్యధ వుంటాయి. 24, 25 తేదిలలో భార్యకుగాని ఇంటో మరే ఇతరస్త్రీకిగాని అనారోగ్యము కలుగుటవల అశాంతి.

### * పునర్వసు [కే, కో, హ, హి] *

గతవారములోవలె ఈ వారము కూడా మీరు చేయవలసిన అనేక కార్యాలకు ఆటంకాలు వస్తాయి. ఆప్తులైన కొందరితో అకారణవైరం ఏర్పడుతుంది. చాలా డబ్బు దండుగఅవుతుంది. సాహసము, పట్టుదల కలవారగుటచేతను ఉత్సాహముతో తిరిగి ప్రయత్నించి చివరకు కార్యసిద్ధి పొందుతారు. జాగ్రత్తవల్ల దెబ్బలు తగిలే ప్రమాదము తప్పిపోవచ్చును. గనుల యజమానులకు, ఇంజన్లు నడిపే నిపుణులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము వారమంతా త్రిప్పట, శ్రమ, అశాంతిఉంటాయి. 24,25 తేదీలలో ప్రమాదభయం.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈవారము మీ పలుకుబడి బుద్ధిబలంతో తోడుచేసి కార్యరంగంలో దిగి ఫలసిద్ధిని పొందుతారు. ధనలోపము తీరుతుంది. ఈశాన్యదిక్కునుండి ఆప్తబంధువుల క్షేమం తెలుస్తుంది. ఉద్యోగులకు తొందరలు తీరుతాయి. విద్యార్థులు ఆసక్తిగా చదువుకుంటారు, వైద్యులకు లాభము. కవులు క్రొత్తరచనలు మొదలుపెడతారు. శిల్పులకు, చిత్రకారులకు నటీనటులకు మంచికాలం, 20, 21 తేదిలలో బంధువులతో కలసి

**ధరలు:**

నూలు, వస్త్రములు: స్వల్పముగా హెచ్చును.

నూనె దినుసులు: నిలకడగా వుండును.

బెల్లము, పంచదార: కొంచెము హెచ్చగును.

చింతపండు: సమస్థాయిలో వుండును.

ఆహార ధాన్యములు: కొంచెము చురుకగును.

పప్పు దినుసులు: నిలబాటుగా వుండును.

వెండి, బంగారము: మార్పు లేదు.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెరుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనువది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వృషభుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

ఆనందముగా గడుపుతారు. 22, 23 తేదీలలో శుభవార్త. ఈ వారము శుభయోగము లున్నప్పటికీ శ్రమ, ఆందోళనలతో కూడి వుంటుంది.

***ఆశ్లేష [డి, డూ, డే, డో]***

ఈవారము మీకు యోగకాలము. ధనలాభము కలుగుతుంది. పిల్లల యోగక్షేమములను వృద్ధిపరచుకొనే ఏర్పాటు చేస్తారు. కోర్టు వ్యవహారములలో మీకు రాజీ పడటంవల్ల లాభము కలుగుతుంది. పండిత గోష్ఠిలో పాల్గొంటారు. విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. ఉద్యోగస్థులకు అనుకూలముగా వుంటుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము. 20, 21 తేదులలో ఇంట్లోవారికి నూతనవస్త్రాలంకారాలు లభిస్తాయి. వారమంతా ధనయోగము, పండిత గోష్ఠి, కార్యసిద్ధి మొదలగు యోగము లున్ననూ, శ్రమలోనూ, ఆందోళనతోనూ కూడి వుంటుంది. ఉత్తర దిక్కునుండి శుభవార్త.

*** మఖ [మా,మీ,మూ,మే] ***

ఈ వారము మీ ఆర్థికస్థితి బాగుంటుంది. యత్నకార్యసిద్ధి కలుగుతుంది. 20, 21 తేదీలలో కవులు గాయకులు మొదలగు కళాకారులతో బంధుమిత్రులతో కలిసి మృష్టాన్న భోజనము ఆరగిస్తారు. వెండి పరుపుల వర్తకులకు ప్రయాణమువల్ల లాభము. బియ్యము, నూలు, బట్టల వర్తకులకు యోగకాలం. దక్షిణ దిక్కునుండి శుభవార్త వింటారు. విద్యార్థులు క్రొత్త విషయాలు నేర్చుకుంటారు. ఈ వారము శుభయోగము లున్ననూ అస్థిమితముగా వుంటుంది. ఉత్సాహము తక్కువ.

*** పూర్వఫల్గుణి (పుబ్బ) ***

**[మో, టా, టీ, టూ,]**

గత వారములో కలిగిన మంచియోగము ఈ వారముకూడా వుంటుంది. ఇతరులకు ఉపకారము చేస్తారు. మీ పనులు ఏ ఆటంకములు లేకుండా కొనసాగుతాయి. అనుకున్న దానికన్న రెట్టింపుగా ధనాదాయం కలుగుతుంది. మీ అధికారము, హోదా ఎక్కువయే సూచన లున్నవి. 20, 21 తేదీలలో ఇంట్లో వున్నవారికి నూతన వస్త్రాలంకారాలు చేకూరుస్తారు. విలువగల వస్తువుల క్రయవిక్రయాలలో వర్తకులు మేలుపొందుతారు. కోర్టు వ్యవహారములు అనుకూలము అవుతవి. విద్యార్థులకు వినోదముమీద మోజు వున్ననూ చదువు శ్రద్ధగా సాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. శుభయోగములు ఎక్కువగా వున్నప్పటికీ వారమంతా అస్థిమితముగా వుంటుంది.

*** ఉత్తరఫల్గుణి (ఉత్తర) ***

**[టే, టో, పా, పీ]**

ఈ వారము మీరు చేయదలుచుకున్న పెద్ద ప్రయత్నాలు ఫలించవు. ఖర్చులకు అవసరమైన సొమ్ము సమయానికి చేతికిరాక అనేక ఇబ్బందులకు లోనౌతారు. కార్యభారము, వేళ తప్పిన భోజనము, ఉష్ణాధిక్యత చేత అనారోగ్యము కలుగుతుంది. వెంటనే శ్రద్ధ వహించండి. ఉద్యోగస్థులకు శ్రమతోకూడిన కార్యలాభము. వర్తకులకు ఆందోళన, రాజకీయ వాదులకు మేలుకాలము. 20, 21 తేదీలలో పిండివంటలతో భోజనము, మిత్రులతో వినోదము. ఈ వారమంతా అస్థిమితముగా వుంటుంది.

*** హస్త [పూ, ష, ణ, ఠ] ***

ఈ వారము మీరు తలపెట్టిన పనులు నెరవేరినా ఫలసిద్ధిని పొందేవరకూ ఆటంకాలు కలుగుతూ ఉండడము చేత ఆందోళనగా ఉంటుంది. మీరు ధనవంతులై ఉండికూడా సమయానికి వాడుకుందుకు అవకాశము లేక అప్పు చేయవలసి వస్తుంది. ఉద్యోగస్థులకు ఒత్తిడి. వ్యాపారస్థులకు మాంద్యము. విద్యార్థులకు చదువు సాగదు. ఇంట్లో వున్న ముసలివారికి అనారోగ్యము. 19న కార్యభారము, ఆటంకములు. 20, 21 తేదీలలో ఎక్కువ ఖర్చులకు అప్పుచేయుట. 24, 25 తేదీలలో ఆరోగ్య చింత.

***చిత్త [పే, పో, రా, రీ]***

ఈ వారము యత్న కార్యములు ఫలించవు. ఖర్చులు ఎక్కువ. సంసారము పట్ల అనాదరణ చేస్తున్నారనే అపోహావల్ల గృహకలతలు కలుగుతాయి. గురుదేవుల బోధనలను మననము చేసుకొని దివ్యజ్ఞానము పొందుతారు. దైవానుకూలమువల్ల వారాంతమునకు చాలావరకు మీచిక్కులు తీరుతవి. విద్యార్థులు క్రొత్త విషయాలు నేర్చుకుంటారు. వర్తకులకు లాభం తక్కువ. ఇంట్లో వారి ఆరోగ్యము సరిగా ఉండనందున చింత. 20, 21 తేదీలలో నూతనవస్తు సంపాదన. వారమంతా అశాంతి.

*** స్వాతి [రూ, రే, రో, తా] ***

ఈ వారము ప్రారంభించిన పనులకు ఆటంకాలు వస్తాయి. ధనలోపము తీర్చుకుందుకు చాలా తాపత్రయ పడతారు. బంధువుల రాకవల ఖర్చులెక్కువ. కోర్టు వ్యవహారాలు అనుకూలముగా తీర్పు అవుతాయి. స్నేహితులకు సహాయము చేయ పూనుకొని వివాదాలకు లోనౌతారు. భార్యకు అనారోగ్యము కలుగుటచే ఆందోళన. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. ఉద్యోగస్థులకు ఒత్తిడి ఉన్ననూ తమ సహచరుల సహకారముతో కుదుటపడుతుంది. వ్యాపారస్థులకు లాభము తక్కువ. 20, 21 తేదీలలో బంధువులతో విందు, వినోదములు.

***విశాఖ [తీ, తూ, తే, తో]***

ఈ వారము రాబడి తక్కువ, ఖర్చులు ఎక్కువగుటచే ఇబ్బంది. ఐనప్పటికీ వచ్చిన ఆటంకములను ధైర్యముగా ఎదుర్కొని కార్యసాధనను పొందుతారు. ప్రమాదాలవల్ల దెబ్బలు తగిలే సూచనలున్నా జాగ్రత వల్ల తప్పవచ్చును. వృత్తి ఉద్యోగాల్లోనూ వ్యాపారములోనూ అభివృద్ధిసూచన లున్నవి. భూస్వాములకు, గనుల యజమానులకు లాభం. ఇంజనీరింగు, పోలీసు శాఖలలో వారికి మేలుకాలము. 20, 21 తేదీలలో నూతన కార్యారంభము, పిండి వంటలతో భోజనము. 24,25 తేదీలలో ప్రమాదభయం.

***అనూరాధ [నా, నీ, నూ, నే]***

గత మూడు వారాలనుంచి మీ బుద్ధిబలం నుంచి మీకు కలుగుతున్న ఆటంకాలను మీ బుద్ధిబలమువల్ల అధికారుల ఆదరణ, స్నేహి



# నక్షత్రఫలితాలు



రుల సహాయము పొంది ఒకదారికి తీసుకువస్తారు. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఆప్తుల అనారోగ్యము నిమ్మళించి క్షేమముగా వున్న వార్తవల్ల సంతోషము పొందుతారు. విద్యార్థులు చురుకుగా వుంటారు. కవులకు, చిత్రకారులకు, నటీనటులకు మంచికాలము. 20, 21 తేదిలలో నూతన వస్త్రాలంకారాలు. వారమంతా మంచి యోగాలున్నా అశాంతిగా వుంటుంది.

## *జ్యేష్ఠ [నో, యా, యి, యు]*

ఈ వారము మీ ఆశయాల ప్రకారం కార్య నిర్ణయం జరిగి ఫలసిద్ధి పొందుతారు. ప్రజ్ఞావంతులైన వారి సహవాసమువల్ల విజ్ఞానాన్ని వృద్ధి చేసుకుంటారు. ధనయోగము కలుగుతుంది. పిల్లల శుభకార్యములను గురించి ఆలోచనలు చేస్తారు. విద్యార్థులు క్రొత్తవిషయాలు నేర్చుకుంటారు. ఉపాధ్యాయులకూ, న్యాయవాదులకూ, పండితులకూ మేలుకాలము. 20, 21 తేదిలలో మృష్టాన్న భోజనం ఆపైని అసంతృప్తి, చికాకు.

## *మూల [యే, యో, బా, బీ]*

ఈ వారము మీరు తలపెట్టిన పనులు నెరవేరుతాయి. ఆర్థికస్థితి ప్రోత్సాహకరముగా వుంటుంది. ఆగ్నేయ దిక్కునుండి శుభవార్త వింటారు. కవులు, గాయకులు మొదలగు కళాకారులతో వినోదిస్తారు. విద్యార్థులకు చదువుపై ఆసక్తి ఎక్కువ. వెండినగల వర్తకులకు ప్రయాణమువల్ల లాభము. బియ్యము, బట్టలు వ్యాపారస్తులకు యోగకాలము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలు కలుగుతుంది. 20, 21 తేదిలలో మృష్టాన్న భోజనం.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈ వారము మీకు యోగకాలము. ఇతరులకొరకు పూనుకొని చేసిన కార్యములు ఫలిస్తాయి. మీ పలుకుబడివల్ల మీరు సాధించలేని కార్యముండదు సంఘములో కీర్తిప్రతిష్ఠలు పెరుగుతాయి. తగినంత ధనలాభము కలుగుతుంది. శుభకార్యములను గురించి ప్రయత్నములు చేస్తారు. 20, 21 తేదిలలో బంధువులతో విందు, వినోదములు, స్వజనమునకు అలంకార ప్రాప్తి. విద్యార్థులకు వినోదములపై ఆసక్తి ఉన్నా చదువు మరుకుగా జరుగుతుంది. విలువగల వస్తువుల వ్యాపారస్తులకు లాభము శుభయోగములున్ననూ వారమంతా ఆందోళనగా వుంటుంది.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఏవిధముగా ఎంత కష్టపడినను కార్యములు నెరవేరవు. ప్రతిపనికీ ఆటంకములు కలుగుతాయి త్రిప్పటవల, అకాల భోజనమువల్ల శారీరక, మానసిక పరిస్థితులు చికాకుగా వుంటాయి అనారోగ్య సూచనలు కనబడగానే గ్రహరాజయిన రవికి శాంతి చేయించండి. ఉద్యోగస్తులకు శ్రమ. వ్యాపారస్తులకు లాభము తక్కువ. రాజకీయజ్ఞులకు కార్యానుకూలముగా వుంటుంది. విద్యార్థులకూ చదువు సక్రమముగా జరగదు. 20, 21 తేదిలలో కొంత ఉల్లాసముగా వున్నా వారమంతా హెచ్చరిక లేకుండా వుంటుంది.

## *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈవారము ఏపని చేసిందికీ ముందుగా సమాధానము కుదరక ఆలోచనలతో మొదట్లో కాలము గడుపుతారు. తుదకు ఒక నిర్ణయానికి వచ్చి దూరస్థులైన స్నేహితుల సహాయమువల్ల కార్యలాభము పొందుతారు. 20, 21 తేదిలలో విచిత్ర వస్తువులను సంపాదిస్తారు ఉద్యోగస్తులు శ్రమపడుతూ కూడా మాటపడతారు. వర్తకులకు ప్రయాణమువల్ల శ్రమ వున్నా లాభమువుంటుంది. వారమంతా నిరుత్సాహముగా గడుస్తుంది.

## ధనిష్ఠ [గా, గీ, గూ, గే]

ఈవారము మీకు యోగదాయకము కాకపోయినను ముందర మంచిరోజులు రాబోతున్నాయి. ఎవరి సహాయముకోరి కార్యాచరణ చేయ్యాలనుకున్నారో వారే మిమ్ములను నిరుత్సాహపరచి ఆటంకములను కలుగజేసారు. దైవాన్ని నమ్మినవారగుటచేతను నిరాటంకముగా మీకు కార్యానుకూలము జరుగుతుంది. వర్తకులకు లాభములేని ప్రయాణము. ఉద్యోగస్తులకు తొట్రుపాటు. ఇంట్లో వున్న కొందరికి ఆరోగ్యము సరిలేనందున అశాంతి. వారమంతా నిలకడ లేకుండా వుంటుంది.

## శతభిషం [గో, సా, సీ, సూ]

ఈ వారము అనుకోని ఖర్చులు మీద పడుటవల్లనూ, బంధువుల రాకపోకలవల్లనూ, డబ్బుకు ఒత్తిడి ఎక్కువగా వుంటుంది. ఇతరుల పనులు పైని వేసుకొని అవి అసంతృప్తిగా వుండడంవల్ల వివాదాలు వస్తాయి. కోరు వ్యవహారాలు సుముఖమవుతాయి. ఉద్యోగస్తులకు ఒత్తిడి కలిగినను తోడివారి సహకారమువల్ల కొంత కుదుటపడతారు. వర్తకులకు ప్రయాణమువల్ల శ్రమ కలిగినను కొంచము లాభముగా వుంటుంది. వారమంతా మనస్సుకు ఉత్సాహము లేకుండా వుంటుంది.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈవారము మీ ఆర్థికస్థితి సరిగా వుండదు. మీకు రావలసినది రాకపోగా ఇవ్వవలసిన వాటికి ఒత్తిడి ఎక్కువవులచేత అప్పుచేయవలసివస్తుంది. కలిగిన ఆటంకముల ధైర్యముతో ఎదుర్కొని కార్యసాధనకు ప్రయత్నించి ఫలము పొందుతారు. అగ్నివల్లగాని. యంత్రములవల్లగాని కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. భూస్వాములకూ, ఖనిజవర్తకులకూ యోగం. రసాయనికశాస్త్రజ్ఞులకు మేలుకాలము వారమంతా కష్టనిష్ఠురాలతో కూడివుంటుంది.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

ఈవారము మీకు చాలయోగకాలము గత రెండువారములలోనూ మీకు కలిగిన ఆటంకములు తీరి ప్రయత్నాలు ఫలిస్తాయి ఆర్థికస్థితి బాగుంటుంది. అధికారముంగున్న మిత్రుల సహాయముతో కార్యసిద్ధి పొందుతారు. దూరముంగున్న ఆత్మీయుల కుశల వార్త తెలియుటచే మిమ్ములను ఇదివరకు బాధించిన దుఃఖము పోతుంది. విద్యార్థులు క్రొత్తవిషయాలు నేర్చుకుంటారు. వైద్యులకు గణితశాస్త్రజ్ఞులకూ, కవులకు, కళాకారులకు మేలుకాలము. ఈ వారము శుభయోగములు వున్ననూ ఆందోళనగా వుంటుంది.

## * రేవతి [దే, దో, చా, చీ] *

మీకు ఈవారము ధనయోగము ఎక్కువగావుంటుంది. పండిత గోష్ఠివల్లనూ, ఉత్తమ గ్రంథ పఠనమువల్లనూ. ఎన్నో నూతనాంశాలను తెలుసుకుంటారు. పిల్లల అభివృద్ధివల్ల ఆనందము పొందుతారు. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, ప్రయాణము, ధనలాభము, బంధుసమాగమము, కార్యసిద్ధి మొదలగు శుభయోగములువున్నా వారమంతా ఆందోళనతో కూడి వుంటుంది. ★



# వనితాలోకం

## శిశిర వసంతాల సందేశం

సంక్రాంతి అనగానే చలిమంటలు రంగవల్లులు జ్ఞప్తికి వస్తే, ఉగాది అనగానే నూతన వస్త్రాలు కొస్త చేరుగా, పులగా, తియ్యగా వుండే వేపపచ్చడీ గురుకువస్తాయి. ఉంటే ప్రతి పండుగకూ కడతాము కొత్తబట్టలు. అదీ ఒక విశేషమేనా అనవచ్చు. ఉగాదినాడు కొత్తబట్ట కడితే ఆ సంవత్సరమంతా నూత్న వస్త్రాలకు కొదువ వుండదనే నమ్మకముతో తప్పకుండా ప్రతివారూ కొత్తబట్టలు కడతారు. సంవత్సరాదినాడు ఏపని చేస్తే అపనే సంవత్సరమంతా చేస్తారనే నమ్మకము ప్రతిపనిలోనూ కనుపిస్తుంది.

అందుకే సంవత్సరాది పూటా అబద్ధమాడట మెందుకని నిజము చెప్పాలనీ, సంవత్సరాదిపూటా వాణ్ని తిన్నట మెందుకని వదిలి పెట్టాలనీ, సంవత్సరాది పూటా డబ్బు పోగొటుకున్నా ఈసంవత్సరమంతా ఇంతేనేమోననీ ఇత్యాది మాటలు సంవత్సరాది పూటా తరుచు వింటూంటాము.

కొత్త పంచాంగమూ వేపపచ్చడీ తీసుకుని పురోహితులు ఇంటింటికి వచ్చేవారు మునుపటిరోజుల్లో, ఆ శాస్త్రులుగారిచేత ఆ సంవత్సరఫలము చెప్పించుకుని స్వయంపాకమూ దక్షిణా సమర్పించుకునే వారు, వేపపచ్చడి చేసేందుకు సమకూరని యిల్లాలికి శాస్త్రులుగారే పచ్చడీ పెట్టేవారు. కాలంతోపాటే ఈ ఆచారము మాసిపోయి కేవలము దేముడుగుళ్ళో దేముడి దగ్గర పంచాంగము చదవటము విన దలచినవారు అక్కడే వినటము జరుగుతోంది.

అన్ని ఆచారాలు అల్లావుండగా ఉగాది వాడు పరగడుపున వేపపచ్చడి తినవు నేందుకు కారణ మేమిటి? అందులో కలిపే మామిడి, బెల్లము ఏ అర్థాన్ని స్ఫురింపచేస్తాయి? మానవ కల్యాణము కోసమే ప్రతి ఆచారాన్ని సృష్టించిన ప్రాచీనులు దీన్ని ఏ వుద్దేశ్యంతో ఏర్పరచారు? అని చాలా రోజులు మథనపడి, ప్రాచీన సంప్రదాయాలను తెలుసుకొని మన్నించే మా అమ్మను ఈ విషయమై అడిగాను. అమ్మ ఇల్లా చెప్పింది.

చెను, (వేప) నూత్న సంవత్సరములో రాబోయే కష్టాలకు గుర్తు, తీపి (బెల్లము) సుఖాలకు గుర్తు. మామిడి ఋతురాజు రాకకు గుర్తు. ప్రతీమానవుడూ కేవల సుఖమే అపేక్షించి కొంతకాలానికి జీవిత సత్యాన్ని మరచిపోయి, పెడదారులు త్రొక్కి, కష్టాలు సంభవించినప్పుడు జీవితము నిస్సారమనే దురూహతో ఆత్మహత్యకు సిద్ధపడతాడు ఆ దుస్థితికి మానవుని పాల్పడకుండా చేసేందుకే వేపపచ్చడి వ్యాజముతో జీవితము వేపపచ్చడిలాంటిదనీ, దానిలో కష్టసుఖాలు సమ్మిళితమై వుంటాయనీ రెంటికీ అతీతులుగా జీవించటమే మహాత్ముల లక్షణ

బి. ఎస్. లక్ష్మి

మనీ చిత్తస్థైర్యాన్నిచ్చే ఈ జీవిత సత్యాన్ని ప్రతి నూత్న సంవత్సరారంభము నాడూ బోధించి ఆపైన (అంటే వేపపచ్చడి తిన్న తరువాత) పంచాంగ శ్రవణముచేసి భవిష్యత్తు తెలుసుకోమన్నారన్నమాట. అలా చేసిన మానవుడు కష్టసుఖాలకు అతీతుడు కాకలడు కాబటి దీనికి జంకడని పెద్దల వుద్దేశ్యము, అంది అమ్మ.

తినూ వచ్చాన నేందుకు గుర్తుగా వుగాదినాడు మామిడిముక్కలు తినిపించిన ఋతురాజు సంవత్సరానికి రెండు నెలలుమాత్రమే వుండి మాయమౌతాడు. అందుకే సుఖమనేది ఎంత ఆనందకరమైనదో అంతక్షణికమైనది అన్నారు. పగలల్లా ఎండకాసినా సాయంత్రమయ్యేసరికి మల్లెల సువాసనని మోసుకొచ్చే పిల్లగాలులతో ఎక్కడచూసినా పచ్చగా కనులపండువు చేసే వృక్షాలతో లతలతో మధువును గ్రోలుతున్న తుమ్మెదఝుంకారాలతో, ప్రకృతి గాయని కోయిలమ్మ మధురగానంతో, వీనులవిందు చేస్తూ ఋతురాజు ప్రకృతిలోవున్న ప్రతిప్రాణినీ ప్రణయమూర్తులుగా రూపొందిస్తాడు. అన్ని ఫలాలకన్నా మధురమైనవి మామిడిపండ్లు. వసంతఋతువులాగే అవి సంవత్సరానికి ఒకసారే వస్తాయి. అసలు మధుదేవుని దర్శనము అల్లంతదూరాన కానరానిదే మామిడమ్మ పిందేనా రాల్చదు. వసంతాగమనమైన వెంటనే తన తొలిపిందెలను కానుకగా సమర్పిస్తుంది మధుమూర్తికి మామిడి. ఈ విధంగా మామిడమ్మ యిచ్చిన మామిడి ముక్కలను, వచ్చినరోజు తినిపించిన వసంతుడు వెడుతూ మధుర ఫలాలను ప్రసాదించి వెడతాడు. ప్రకృతిని మోడువారచేసిన శిశిరము వెంటనే వసంతము ప్రవేశించి ప్రకృతిని మైమరపించి మధురఫలాలను ఏరీతిగా సమర్పింపచేసిందో ఆరీతిగానే చింతాక్రాంతమైన మానవజీవితంలో ఎప్పుడో ఒకప్పుడు నవవసంతము ప్రవేశించి కాంతులతో నింపుతుంది. ఆ మధుర క్షణాలకోసము ఎదురుచూడటమే మానవ కర్తవ్యమని చెప్తాడు మధుదేవుడు.

పైన చెప్పిన వేపపచ్చడిద్వారా ప్రతి సంవత్సరము అందించే ప్రాచీనుల సందేశాన్ని శిశిర వసంతాలరూపేణా ప్రతి సంవత్సరము ప్రకృతిచాటే జీవితసత్యాన్నీ సహనశీలలైన సోదరీమణులు మరచారనీ తత్ఫలితముగానే జీవన వసంతముకోసము ఎదురుచూడక నిరాశతో ఆత్మహత్యల పాలవుతున్నారనక తప్పదు.

ఏదిఏమైనా ఆడవాళ్లలోనే—ఆత్మహత్యలు ఎక్కువ అని హేమలంబిమోపిన అపవాదును హేమలంబతోనే విడచి నూత్న వుగాది సందేశాన్ననుసరించి కష్టాలు కలకాల ముండవని ఆత్మవిశ్వాసంతో మంచి రోజులకోసము ఎదురుచూస్తూ ప్రయత్నిస్తూ మంచిఫలితాలు సాధిస్తా మనీ ఆశిద్దాము. ★



# అతిథి సత్కారం



మతుకుమల్లి సుశీల

"తిరిగి వచ్చేందుకు పదిరోజులైనా పడుతుందన్నారు. మూడోరోజుకే తిరిగి వచ్చేశారేం?"

"మన మనుకున్నవన్నీ అలాగే జరుగుతాయా?"

"అయినా ఎంతో ముఖ్యమైన పని అని 20 గంటలు ప్రయాణంచేసి వెళ్ళి, బడలిక అయినా తీరకుండా తిరుగుప్రయాణం చేస్తే ఆశ్చర్యంగానే వున్నది" అన్నాను.

"నిజమే! కాని నా స్నేహితుని అతిథి సత్కారంనుంచి విడుదల పొందేందుకు యించుమించు పారిపోయి వచ్చాను" అన్నారు మా వారు.

ఒకవేళ అతిమర్యాదచేస్తూ too formalగా వున్నాడేమో ఆ మిత్రుడు అనుకున్నా. కాని అంతమాత్రానికే పాడుచేసుకుని రాదగిన పనికాదు వారిది. ఎంతో ముఖ్యమనుకున్నారు. మరేం జరిగినట్లు?

వారికి ఓపిక వున్నప్పుడే ఆ విషయం విందామని వూరుకున్నాను.

* * *

ఇంతకీ జరిగింది యిది. ఈ మధ్యనే అత్యవసరమైన పనిమీద మావారు సుమారు 200 మైళ్ళ దూరంలోవున్న ఒక వూరు వెళ్ళవలసి వచ్చింది. అక్కడికి చేరేలోపల రెండు మూడు చోట్ల రైళ్ళు మారాలి. ఆ రైళ్ళు చూస్తే, సుందరాంగుల మందగమనాన్ని మరపించేంత నిదానంగా నడుస్తాయి. ఇంటి దగ్గర బయలుదేరిన 21 గంటలకుగాని ఆ వూరు చేరరు. త్రోవలో తినేందుకేమీ దొరకదు.

ప్రయాణానికి కావలసిన ఆహారపదార్థాలేవో ఇంటినుంచే తీసుకుని ఒకరోజు ప్రొద్దున్న రైలెక్కారు మావారు. ఆరోజంతా రైలులోనే సరిపోయింది. మర్నాడు ఉదయం 7 గంటలకు గమ్యస్థానం చేరారు. అక్కడ ఒక రూమ్‌లో సామాను పెట్టుకుని స్నానం కాఫీ వగైరాలు పూర్తి చేసుకుని, సుమారు 8½కి ఎవరితో పని వుందో వారింటికి వెళ్లారు. కొంచెంసేపు మాట్లాడిన తరువాత అక్కడే భోజనం చేయమని ఆయన బలవంతం చెయటంవలన తప్పనిసరైంది. అసలే క్రొత్తచోటు, దానికి తోడు మొగమాటం. అంచేత మావారు సరిగా భోజనం చేయలేదు.

మళ్ళీ పనులు చూచుకుని సుమారు 1-30కి రూమ్‌కి చేరుకునేప్పటికి ఆకలి, నిద్ర, అలసట ఒకేసారిగా విజృంభించాయి. క్రిందటి రోజంతా, ఆరోజు ఉదయంనుంచీ సరియైన ఆహారంలేదు. ఏదైనా హోటలుకి వెళ్ళి వద్దామని రూమ్‌కి తాళంవేయబోతుంటే ఆ వూరిలోనే వున్న వారి స్నేహితుడొకడు హడావుడిగా ప్రవేశించాడు. (మావారు వూరినుంచి వచ్చినట్లు అప్పుడే తెలిసిందిట.) వస్తూనే, కాలజ్ఞానాన్నీ, ఎదుటి వ్యక్తి ముఖ కవళికలనీ పూర్తిగా విస్మరించి కబుర్లలో లీనమైపోయాడు. 2 గంటలైంది. 2-30 అయింది. కానీ ఆయన బాతాఖానీ ముగిసే సూచనలు కనిపించలేదు. ఇక లాభం లేదని "హోటలుకి వెళ్ళి కాఫీ త్రాగివద్దాము రా" అని అతణ్ణికూడా ఆహ్వానించారు మావారు. ఈమాత్రం భాగ్యానికి హోటలు కెందుకు. మాయిల్లు యిక్కడే వుందని బలవంతాన తీసుకువెళ్లాడట.

ఆకలితో వున్న మనిషికి కేవలం ఒక కప్పు కాఫీ ఏమూకలి తీరుస్తుంది? ఈ విషయం మిత్రుడికి తెలియదనుకొండి. కానీ కాఫీ పేరుతో వారింట్లో యిచ్చిన బురద రంగు వేణ్ణీళ్ళు మింగుడు పడేప్పటికి పరమ శివుడు హాలాహలం మింగినంత పనైంది. వెలువరించలేక, మింగలేక నానా అవస్థ పడ్డారు. అంతటితో వదలుతాడేమో ననుకుంటే "నేనీ వూళ్ళోవుండగా నీవు వేరే రూములో దిగట మేమిటి? నీ సామానులన్నీ యిప్పుడే యిక్కడకు మార్చుద్దామని ఒకటే బలవంతం.

ఆయన పట్టుబడితే వదలడనే విషయం ఎప్పుడో నిరూపితమైంది. కాబట్టే ఆ బంధం వదిలించుకునేందుకు "నేను రాత్రికే తిరిగి వెళ్తున్నా" నని ఒక చిన్న అబద్ధం ఆడేశారు. దీని పర్యవసానం చూచాక కాని యీ అబద్ధం ఎంత ప్రమాదకారియో తెలియలేదు. "అయితే రాత్రి యిక్కడే భోజనం చేసి యిటునుంచే వెళ్ళవచ్చు" నన్నాడు మిత్రుడు. ఎన్ని యుక్తులు ప్రయోగించినా విముక్తి దొరకలేదు. భోజనం తప్పలేదు. రాత్రి రైలుకి ప్రయాణమనే నెపంతో 6-30కి భోజనానికి ఉపక్రమించారు.

కాని యీ భోజనం కూడా ఏమంత సుఖంగా లేదు. చల్లగా చల్లారిపోయిన అన్నం, ప్రొద్దుటి సాంబారు, లోపలి గుజ్జుతో సహా మాడిన వంకాయ వేపుడు, పులి మజ్జిగ— ఇవీ వంటకాలు. ఇందులో ఏవి తినాలో తోచక నామకార్థం భోజనంచేసి లేచారు. ఆవూళ్లో యింకావుంటే ఆయన బాధ ఎలాగూ తప్పదని, మిగిలినపని పోసుద్వారా చూచుకోవచ్చనీ, ఆరాత్రికే తిరుగు ప్రయాణం చేశారు. ఈ ప్రయాణ ఫలితంగా వారంరోజులు పడక వేశారు.

* * *

ఈ వింతమైన వింత ఆతిథ్యానికి కారణం వూహించటం కష్టం. ఆ స్నేహితుడు పేదవాడేమో ననుకునేందుకు ఆయనకు నెలకు రు 600/-జీతం. పెద్ద కుటుంబమూ కాదు.

## బార్డర్ డిజైను







బాడీ, లంగాలమీదకు డిజైను

భార్యా భర్తలూ, ముగ్గురు చిన్నపిల్లలు. భోజనం పెట్టటం యిష్టం లేదా అంటే వేధించి తీసుకువెళ్ళాడు. పోనీ నిర్లక్ష్యమా అంటే హోదాలో గౌరవంలో చదువులో మావారు ఆయనకేమీ తీసిపోరు. భోజనం మినహా అన్ని మర్యాదలూ చాలా సక్రమంగా జరిగాయి. ఒకవేళ వారింట్లో రోజూ ఆ మాదిరే భోజనం చేస్తుండవచ్చు. అయినా ఎవరైనా వచ్చినప్పుడైనా కొంచెం మార్పు చేస్తే బాగుండేది. వారి యీ పద్ధతి ఆతిథ్యానికి యింటికి వచ్చినవారిని ఎలా మర్యాద చేయాలో తెలియక పోవటమే కారణం.

అనాదినుంచీ మనదేశం అతిథి అభ్యాగతుల పూజకీ సత్కారానికీ పేరు పొందింది. రోజుకి కనీసం ఒక అతిథికైనా భోజనం పెట్టకుండా భోజనం చేయని గృహస్థులు పూర్వం ఎందరో వుండేవారు. తమంతట తాము ఎవరూ రాకపోతే నాలుగు దార్ల కూడలిలో కనిపెట్టుకుని వుండి అతిథులను ఆహ్వానించేవారు. అతిథి తృప్తికోసం తన ఏకైక పుత్రుణ్ణి కూడా త్యాగం చేసిన చిరుతొండ నంబికథ మనకందరకూ తెలిసిందే. అతిథిసత్కారం కోసం మడిమాన్యాలమ్ముకుని బికారులైపోయిన ఎందరో గృహస్థులను గురించి మనం వినేవుంటాము. వారి భార్యలు కూడా యజమానితో హృదయపూర్వకంగా సహకరించి అదే గృహిణి ధర్మమనే పరిపూర్ణ విశ్వాసంతో వుండేవారు. ఇది గొప్పవిషయమైనా కాకపోయినా, వారి కా సత్కార్యంపట్ల వుండే శ్రద్ధాభక్తులను తెలియజేస్తుంది.

అతిథిసత్కారం, ప్రతి వ్యక్తీ తనకుటుంబముచుట్టూ నిర్మించుకునే స్వార్థపుగోడలను విచ్ఛిన్నం చేసి, సాటి మానవులపట్ల సానుభూతి చూపేందుకు ఏర్పడిన ముఖ్యసాధనం. ఈముఖ్యోద్దేశాన్ని అపార్థంచేసుకుని మనలో మానవత్వాన్ని నిలిపే సాధనాన్ని అపహాస్యం చేస్తున్నాము.

పూర్వం ప్రతి గృహిణీ ఒక అన్నపూర్ణ. భర్త దుర్మార్గుడైనా, అతని సద్గతికోసం అతనికి తెలియకుండానైనా దానధర్మాలు చేసేది. ఇప్పుడు యీ నమ్మకాలన్నీ సడలిపోయాయి. ఈనాటి మర్యాదలే వేరు. ఆలోచనల తరహాయే వేరు. బిచ్చగాడికి ముష్టి వేస్తే సోమరితనం ప్రోత్సహించినట్లౌతుందనే రోజులివి. అపరిచితుల సంగతి వదలి వేద్దాం. పరిచితులు, బంధువులు, ఇంకా ముఖ్యులైనవారు యింటికి వచ్చినపుడు గృహయజమాని, యజమానురాలు నిర్వర్తించవలసిన కనీసవిధులు కొన్ని వున్నాయి. అవైనా చేయలేనివాడు గృహిణీ, గృహస్థు అనే పేర్లకు అనర్హులౌతారు.

ఈనాటి అతిథి సత్కారం అనేక రీతులుగా వుంది. అందులో కొన్నింటిని మాత్రం ముచ్చటించుకుందాము.



బార్డర్ డిజైను

గొప్పవారి యిండ్లలో ఆదరణ చాలా కృత్రిమంగా యంత్రవతుగా వుంటుంది. ఇంటికివచ్చిన వారెవరైనా సరే వారి స్నానపానాదులు, భోజనం, టిఫిన్ వగైరా అన్నీ యింటి నౌకర్లే వేళపట్టున అమర్చిపెడతారు. గృహిణి, యజమాని భోజనానంతరం కాని, మధ్యాహ్న నిద్రతరువాతకాని కాసేపు డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని కబుర్లు చెప్తారు. భోజనాలదగ్గిర మాత్రం విధిగా కలుసుకుని వారికేమైనా అసౌకర్యంగా వున్నదేమో కనుక్కుంటారు. ఈ విధమైన ఆతిథ్యంలో ఆప్యాయత లోపించినా కష్టమెక్కువవుండదు. కాకపోతే వచ్చిన వారితో వుండే సంబంధాన్నిబట్టి, మరీ లాంఛనప్రాయంగా కాకుండా కొంచెం చనువుగావుంటే వారికికూడా స్వేచ్ఛగా వుంటుంది.

మామూలు మధ్యతరగతి కుటుంబీకులలో విచిత్ర వ్యక్తులనీ, విభిన్న మనస్తత్వాలనీ చూస్తూంటాము. తత్కారణంగా వీరి అతిథి సత్కారంలో కూడా వైవిధ్యం గోచరిస్తుంటుంది. ఈ ఇండ్లలో అతిథికి సరియైన మర్యాద జరుగకపోవటానికి ముఖ్యంగా మూడు కారణాలు కనిపిస్తాయి: (1) ఇంటికి వచ్చినవారియందు యిల్లాలికి విముఖత (2) యజమాని అయిష్టత (3) సభ్యమర్యాదలు తెలియకపోవటం.

కొందరు పురుషులు వేళాపాళా లేకుండా యిల్లాలి కష్టనిష్ఠురాలు గమనించక, అయిన వాళ్ళనీ కానివాళ్ళనీ భోజనానికి తీసుకువస్తారు. పోనీ యీ విషయం ముందుగానైనా యింట్లో చెప్పరు. భోజనంవేళకి ఎవర్నో తీసుకు వచ్చి వడ్డించు వడ్డించమంటే యిల్లా లేమి చేస్తుంది? బద్ధకించిగానీ, మార్కెట్‌కి వెళ్ళే వీలులేకగానీ, ధనాభావంచేతగానీ, మరే కారణంచేతనైనాగానీ అపూటకి వూరగాయ, ఏవో పచ్చళ్లతో గడుపుకుందాములే అని ఆమె అనుకుని వుండవచ్చు. అనుకోకుండా ఎవరైనా వస్తే యీ పచ్చడి మెతుకులే పెడతామా? తీరా భోజనానికి వచ్చాక మళ్ళీ వంట మొదలుపెడతామా? ఈ పరిస్థితిని సానుభూతితో అర్థం చేసుకోగల అతిథులెందరు? సాధారణ పరిస్థితులలో యీ యిల్లాలికి వేరు భోజనం చేయటం యిష్టంలేదు. అందుకే యిలాంటి తిండి" అనుకుంటారు వచ్చిన వాళ్ళు. అందుకనే ఏది వుంటే అది వేసిపెట్టు అని మగవాళ్ళన్నా, ఓపిక లేకపోయినా, అర్థలోపమైనా ఏదోవిధంగా నాలుగు పదార్థాలు తయారుచేస్తారు మగువలు.

కొన్ని సందర్భాలలో కేవలం భయంచేత ఎవరికైనా భోజనానికి పిలిచినట్లు ఇంట్లో చెప్పరు మగవారు. చెపితే యిల్లాలు బ్రతుకనివ్వదు. "నేనేమి వంట మనిషినా అడ్డమైన

(55-వ పేజీ చూడండి)



దిండుగలీబు మీదకు డిజైను

టి. హెచ్. సత్యవతమ్మ, పిళ్ళా అనసూయ, (విజయవాడ)

# ఉగాదికి పిండివంటలు

## దోసపప్పు లడ్డు

కావలసిన వస్తువులు: 8 నవటాకుల పొట్టు లేని దోసపప్పు, 1 నవటాకు పొట్టులేని జీడిపప్పు, 10 పలముల పంచదార, 2 అణాల ఏలకులు, 2 అణాల ఎండుద్రాక్ష, నెయ్యి.

చేయు విధము: దోసపప్పు (చాయపప్పు)ను తెచ్చి శుభ్రముచేసి ఉంచుకొనవలయును. జీడిపప్పును చిన్నచిన్న ముక్కలుగాచేసి, కొబ్బరి కోరుకొని ఇవి రెంటిని వేరువేరుగా ఒక ప్రక్క పెట్టుకొనవలయును. ఏలకులనుకూడ పొడిచేసి ఉంచుకొనవలయును.

దోసపప్పు, జీడిపప్పు, ద్రాక్ష, కొంచము నేయివేసి విడివిడిగా దోరగా వేయించి పెట్టుకొనవలయును. తరువాత పంచదార తీగపాకం రానిచ్చి అంతకుముందే కోరి ఉంచుకొన్న కొబ్బరికోరు, దోసపప్పు, జీడిపప్పు, ద్రాక్ష, ఏలకుల పొడి పాకం గిన్నెలో వేసి చక్కగా నాలుగుమూలలా 2 నిమిషములు బాగుగా కలియబెట్టి దించి చల్లారనిచ్చి ఉండలు వేసుకొనవలయును. లేక దించిన తరువాత వెడల్పాటి పళ్ళెంలో పోసి చల్లారనిచ్చి ఒక చాకుతో కావలసిన సైజులోకోసి బిళ్ళలు బిళ్ళలుగాకూడ చేసుకొనవచ్చును.

టి. నిహార్ ప్రేమ (నెల్లూరు).

* * *

## గసగసాలతో పాయసం

కావలసిన వస్తువులు: పావుసేరు పాలు, అర్ధపావు గసగసాలు, చారెడు బియ్యం, కొద్దిగా సేమ్యా, జీడిపప్పు, కిస్‌మిస్ పళ్ళు, ఏలకుపొడి.

ముందు బియ్యాన్ని నీళ్ళలో కొంచెం సేపు నాననివ్వాలి; తరువాత బియ్యం గసగసాలు కలిపి రోట్లో వేసి మెత్తగా రుబ్బాలి. రుబ్బిన పిండిని గరిటజారుగా వుండేలా చూసుకోవాలి. పొయ్యిమీద గిన్నె పెట్టి, కొద్దిగా నెయ్యివేసి సేమ్యా, గోధుమవర్ణం వచ్చేదాకా వేయించాలి. వేగిన తరువాత అందులో పాలుపోసి, అవి ఉడుకుపట్టగానే, రుబ్బి వుంచుకున్న గసగసాలపిండి అందులో పోసి ముద్దకట్టకుండా గరిటతో తిప్పుతూవుండాలి. ముందుగా నే నేతిలో వేయించి వుంచుకున్న జీడిపప్పులు, ఇంకా ఏలకుపొడి, కిస్‌మిస్ పళ్ళు వేసి బాగా కాగినతరువాత దింపాలి. ఇది ఒక విధమైన రుచికలిగి బాగానే వుంటుంది. ఉంటే ఏదైన ఎస్సెన్సు వేసుకోవచ్చు. పరిమళం, ఈ వంటకాన్ని మరింత ఆకర్షణీయంగా చేస్తుంది.

## పోణీబియ్యం

పొయ్యిమీద గిన్నె కాలేసి అందులో చిన్న గిన్నెడు నెయ్యివెయ్యాలి. నెయ్యి కాగినతరువాత రెండు మూడు ఎండు మిరపకాయలు, సెనగపప్పు, మినపప్పు, ఆవాలు, జీలకర్ర, కరివేపాకు, పచ్చిమిరపకాయ ముక్కలు వేసి పోపు వేయించుకోవాలి. పోపు వేగినతరువాత ఆలుగడ్డ ముక్కలు, వంకాయ ఉల్లిగడ్డ, మనకు అదునుకి ఏవివుంటే అవి వేసి ఒక్క అయిదునిముషాలు మూత పెట్టాలి. తరువాత ఎసరుపోసి ఉప్పు, పసుపు వెయ్యాలి. ఎసరు కళపెళలాడిన తరువాత బియ్యం కడిగివెయ్యాలి. సమంగా అన్నం మీదకి ఉడికినతరువాత దింపాలి. ఇది చేసుకుంటే, వేరే ఆధరువు ఏమీ చేసుకోకుండానే తినొచ్చు. బియ్యం మనకు కావలసినన్ని చేసుకోవచ్చు, గనుక ప్రత్యేకంగా కొలత ఇవ్వలేదు.

తెన్నేటి అహల్యాదేవి
హనుమకొండ.

* * *

## గోధుమ పిండితో..

కావలసిన వస్తువులు:- గోధుమ పిండి, నెయ్యి, వరిపిండి, కారం, ఉప్పు.

తయారుచేయు పద్ధతి:- విశాలమైన ఒక పళ్ళెములో కావలసినంత గోధుమ పిండిని పోసి దానికి ఉప్పును, కారమును తగుమాత్రం చేర్చి, నీరుపోసి పూరీపిండి విధంగా కలిపి ముద్దగాచేసి దానిపై మూతనుంచి వొకగంట కాలము నాననివ్వాలి.

పిమ్మట దానిని వుండలుచేసి, వాటిని అప్పడాలు మాదిరిగా వరిపిండి అద్దుతూ చేయాలి. వరిపిండి అద్దడంవల్ల అప్పడం పీట కంటదు. సులువుగా వస్తుంది. వీనిని తడి ఆరకుండా ఒక శుభ్రమైన, తుప్పులేని పదునైన చాకుతో నిలువుగా చీల్చి, మరల వానిని ఏటవాలుగా చీరాలి. ఇలా చీరడంవల్ల చూడడానికందంగా వుంటాయి. వీటినే బాణాలంటారు.

తరువాత బాగుగా మండుచున్న పొయ్యి మీద ఒక బాణలినుంచి దానిలో నెయ్యిగాని నూనెగానిపోసి బాగుగా కాగనీయవలెను. కాగిన నూనెలో ఈ తయారుచేసిన బాణాలను తడి ఆరకుండాపోసి వేయించాలి. అలా చేయడంవల్ల బాగుగా పొంగి గుల్లగా వుంటాయి. ఒకమోస్తరు ఎర్రదనము రాగానే చట్రముతో దేవి, నూనె బాగా వోడనిచ్చి, తడిలేని పాత్రలోగాని, డబ్బాలోగానిపోసి గాలి తగులకుండా మూతవేయాలి. గాలి తగిలితే మెత్తబడతాయి. ఇవి తగు జాగ్రత్తలో నుంచితే 4 రోజులు నిలవకూడా వుంటాయి. వీనివల్ల ఆరోగ్య భంగంకూడా వుండదు. సమృద్ధిగా తినొచ్చు. చంటిపిల్లలకు (౨ సంవత్సరములలోపు) వారికి పెట్టాలంటే ఉప్పు ఒక్కటే వేసి పై విధాన తయారుచేసి పెట్టవచ్చు. వారికి కూడా అనారోగ్యం కలగదు. ఈ విధంగానే గోధుమ బదులు మైదా పిండితో కూడా చేసుకోవచ్చు. వీటిని చేసుకొని తినిచూస్తే రుచి తెలుస్తుంది. వ్యయం కూడా స్వల్పం

చేబ్రోలు కౌసల్య (గొల్లప్రోలు).

* * *

## సగ్గుబియ్యపు బూంది

కావలసిన సామగ్రి: సగ్గుబియ్యము పది పలాలు, వేయించిన శనగపప్పు ½ శే, జీడిపప్పు, పరిపడ ఉప్పు, కారం, కరివేపాకు.

చేయువిధానము: సగ్గు బియ్యము నీటిలో పోసి కడిగి వడకట్టవలెను. తరువాత గుడ్డ మీద నీడన ఆరపోయవలెను. కుంపటిమీద బూర్లెమూకుడు పెట్టి, తగినంత నూనెగాని, నెయ్యిగానిపోసి కాగిన తరువాత ఈ ఆరిన సగ్గు బియ్యము వేయించి తీయవలెను. తరువాత వేయించిన శనగపప్పు, జీడిపప్పు, కరివేపాకు యివి అన్నియుకలిపి వేయించవలెను. ఈ నూనెలో వేయించిన సగ్గు బియ్యము శనగపప్పు జీడిపప్పు మొ॥ అన్నియు ఉప్పు, కారము కలిపి గుచ్చెత్తవలెను. చాలా రుచిగా వుండును.

పి. కోటీశ్వరి.

* * *

## పండు టొమాటోతో పులిహోర

టొమేటాతో పులిహోరచేయుట ఏమిటని

మీగా అనుకోవచ్చు-కాని యిది చాలా రుచిగా ఉండును, ఖర్చుకూడా చాలతక్కువ. పండుటొమాటో శుభ్రముగా కడిగి తుడిచి ముక్కలుకోయవలెను. పొయ్యిమీద బూర్లె మూకుడు పెట్టి ముక్కలు వేయవలెను. నూనె నీళ్ళు వేయనక్కరలేదు. పొయ్యి క్రింద సెగ బాగా పెట్టవలెను. ఇవి చాలా సేపు ఉడుకును. పల్చగా లేక గుజ్జుగట్టిగా ఉంచవలెను. లేనిచో పులిహోర రుచిగా ఉండదు. మూకుడులోని గుజ్జు ఉడికిన వెంటనే సీలుగిన్నెలో కాని మట్టిపాత్రలో కాని వేయవలెను. షుమారు గుజ్జుకు సరిపడు అన్నము తీసి కొద్ది పసుపు కొంచెము నువ్వుల నూనె కరివేపాకు వేయవలయును. ఉప్పుగుజ్జులో మెత్తగా దంచివేయవలెను. పచ్చిమిర్చి అల్లం ముక్కలు కోసి ఉంచుకొనవలెను. పొయ్యిమీద బాణలిపెట్టి నూనె పోసి బాగా కాగినతరువాత ఎండుమిర్చి కాయలుగా వేయవలెను. దోరగా వేగినతరువాత శనగపప్పు మినపపప్పు జీడిపప్పు ఆవాలు కరివేపాకు వేయవలెను. తరువాత పచ్చిమిర్చి అల్లంముక్కలు వేసి దోరగా వేగిన తరువాత దించవలెను. యిష్టమైనవారు యింగువ వేసుకొనవచ్చును. ఆరిన తరువాత అన్నములో గుజ్జు తిరగమోత వేసి కలుపవలెను. యిది చాలా రుచిగాఉండును. జబ్బు చేయదు.

లింగమనేని యిందిరాదేవి,
(పసుమర్రు, గుడివాడ తాలూకా).

* * *

# పులిహారలు, వాటిలోని రకాలు

సర్వసాధారణంగా పులిహోర చింతపండుతో ప్రతివారు ప్రతిపండుగకీ చేసుకుంటుంటారు. అది అందరికి తెలిసిందే. కాని ఒక చింతపండుతోనే కాకుండా పుల్లని వస్తువులు కొన్నిరకాలతో చేసుకోటానికి వీలుగా వుంటుంది. రెండుగోజాలు వున్నా చద్దివాసన వెయ్యనిది, చింతపండుది మాత్రమే ననుకుంటాను.

## చింతకాయలతో

చేసేవిధానం: 8 పావుశేర్ల బియ్యానికి పావుశేరు కాయలు ముక్కలుచేసి కొంచం నీళ్ళుచల్లి ఉడికించాలి. చల్లారిన తరువాత పిసికి గింజ పుల్ల పెంకు తీసివేసి ఆగుజ్జులో తగినంత ఉప్పువేసి పులిహోరకై వండి (కొంచెము బిరుసుగా) వార్చిన అన్నములో కలపాలి. అందులో అదివరకే కొంచెము పసుపు నూనె కరివేపాకు వేసి కలిపి వుంచుకుంటాము. ప్రతి పులిహోరకు ఇది తప్పకుండా చెయ్యాలి. కనుక ఈ చింతకాయ గుజ్జుగూడవేసి కలిపి తగినంతగా నూనె, మిర్చి, సెనగపప్పు, మినపప్పు, జీడిపప్పు, ఆవాలు, ఇంగువ కరివేపాకువేసి పోపుచేసి ఈ కలిపిన అన్నములో పోసి కలిపివుంచితే కొంతసేపటికి ఆ పులుపుపీల్చుకుని చాలా రుచిగా వుంటుంది.

## రాచవుసిరి కాయలతో

మూడు పావుశేర్ల బియ్యంకు పావుశేరు ఉసిరికాయలు ముక్కలుచేసి గింజతీసి ఆ ముక్కలు రుబ్బిగాని మెత్తగా తొక్కిగాని పులిహోర అన్నములో కలపాలి. మన ఇష్టాన్నిబట్టి పులుపు తక్కువ ఎక్కువలుగా వాడుకోవచ్చు. మామూలుగానే తిరగమోత వెయ్యాలి. వాక్కాయలతో కూడా యీ మాదిరిగానే చేసుకుంటారట కొందరు.

## నిమ్మకాయలతో

8 పావుశేర్ల బియ్యానికి అరడజను కాయల రసంతీసి తగిన ఉప్పువేసి అన్నింటికిన్లేనే మిగతపోపు పసుపు నూనె వేసి కలపాలి.

పుల్లని మామిడికాయలను చెక్కుతీసి ముక్కలు తరిగి రుబ్బి ఆ రసము ఇష్టమయినవారు గుజ్జుకూడా కలుపుకొనుగా మిగతా పోపు మొదలైనవి. పై చింతకాయల పులిహోరలో చెప్పినట్లే చెయ్యాలి

## నిమ్మ ఉప్పుతో

నిమ్మకాయలు ఉప్పు ఊరయేని వేసని బాధ లేకుండా చక్కగా తినగలిగేటే, శ్రమ తక్కువ, ఖర్చు ఒకటే. నిమ్మకాయ పులిహోరలాగా బాగానే వుంటుంది. శేరు బియ్యానికి 2 తులాలు (తక్కువ పులుపు తినేవారు 1½ తులము) పసుపు, నూనె, కరివేపాకు వేసి మామూలు షుమారుగా మనము వేసే ఉప్పుకన్న కొంచెము తక్కువగా మామూలు ఉప్పు మెత్తనిది వేసి దానితో పాటు యీ నిమ్మ ఉప్పుకూడా వేసి కలిపి పోపుసామానులో అన్నింటికిన్లేనే పోపు వేయాలి. మామిడికాయతో చేసేటప్పుడు చెక్కుతీసి ఎండుకొబ్బరి కోరినట్లో కోరి ఆ కోరు కలపటము రెండవ పద్ధతి. ఈరోజులలో మామిడికాయలు దొరుకును కనుక శాంపిల్ చేసి చూచుకోవచ్చు.

సీతంరాజు కనకదుర్గాంబ,
(భట్లపెనుమర్రు,)

* * *

# "కుర్మాలు"

## ఉర్లగడ్డ, టొమాటోలతో

కావలసిన వస్తువులు: వుర్లగడ్డలు-10 పలములు; టొమాటో-5 ప; 10 పచ్చిమిరపకాయలు; ఎర్రగడ్డలు (ఉల్లిపాయలు) నాలుగు; పెరుగు-½ శేరు; జీడిపప్పు; ధనియాలు, గసగసాలు, దాల్చిన చెక్క; లవంగపట్ట, కొబ్బరి; అల్లం తగినంత.

తయారుచేయు పద్ధతి: మొదట వుర్లగడ్డలు వుడకబెట్టుకొని పైన తోలుతీసేసి వుంచుకోవాలి. తర్వాత ఆ వుర్లగడ్డలను ముక్కలుగా చేయాలి. టొమేటో కడిగి వాటిని కూడా ముక్కలుగా తరుక్కోవాలి ఎర్రగడ్డలు, పచ్చిమిరపకాయలు పొడుగు పొడుగుగా కోసుకోవాలి. పెరుగు ఒకపాత్రలో పోసుకొని దానిలో తగినంత వుప్పు, కొద్దిగా పసుపుపొడి పోయాలి. కొబ్బరి, ధనియాలు, గసగసాలు, అల్లం, తెల్లగడ్డలు (తెలుల్లి) కొద్దిగా పచ్చిమిర్చి అన్నీకలిపి మెత్తం ముద్దగా నూరుకోవాలి. పొయ్యిమీద ఓ కళాయిపాత్రను గానీ లేదా స్టెయిన్ లెస్ స్టీల్ గిన్నె గానీ పెట్టి దానిలో నూనె లేదా డాల్డా లేదా నెయ్యిగాని వేయాలి. బాగా కాగినతర్వాత జీడిపప్పు, లవంగపట్ట, దాల్చినచెక్క వేసి ఎర్రరా వేగినర్వాత టొమేటో, పచ్చిమిర్చి, ఎర్రగడ్డ ముక్కలు వేసేయాలి. ఇంకాసేపుఅయ్యాక పెరుగు, వుర్లగడ్డముక్కలు, మసాలా ముద్ద పోసి గరిటెతో కలియబెటాలి. అవన్నీ బాగా వుడికినతర్వాత వుదీనాగానీ, కొత్తిమెరగానీ వేసి దించుకోవాలి. ఈ వుర్లగడ్డ కుర్మా అన్నంలోకే గాక, పూరీ, చపాతీలలో వేసుకున్నా చాలా బాగుంటుంది. అట్టే శ్రమలేకుండా చేసుకోవచ్చు.

## మటన్ కుర్మా

కావలసిన వస్తువులు: మాంసం (మటన్)-½ శేరు; వురగడ్డ-10 ప; టమెటో-5 ప; ½ శేరుపెరుగు; పచ్చిమిర్చి; అల్లం, కొబ్బరి, గసగసాలు, ధనియాలు, జీడిపప్పు, తెల్లగడ్డ; ఎర్రగడ్డలు.

తయారుచేయు పద్ధతి: వుర్లగడ్డలు పచ్చివే పైతోలుతీసేసి చిన్నముక్కలుగా చేసుకోవాలి. మటన్ బాగా కడిగి శుభ్రంచేసుకోవాలి. అల్లం, కొబ్బరి, గసాలు, ధనియాలు, లవంగపట్ట, రెండు పచ్చిమిర్చి అన్నీ కలిపి ముద్దగా నూరుకోవాలి. పొయ్యిమీద వెడల్పాటి మూతిగల కళాయిగిన్నను పెట్టి దానిలో 2 పలముల డాల్డా లేదా నూనె లేక నెయ్యి (నెయ్యి అయితే రుచిగావుంటుంది) వేసి కాగనియ్యాలి. బాగా కాగాక, లవంగపట్ట, జీడిపప్పు, ఎర్రగడ్డ, పచ్చిమిర్చి ముక్కలు వేసుకోవాలి. అవన్నీ ఎర్రగా వేగినతర్వాత మటన్ వేసి కలియబెట్టి మూత పెటాలి. మటన్ సగం వుడికినతర్వాత మసాలాముద్ద, పెరుగు, (పెరుగులో కాస్త వుప్పు పసుపు వేసికొని వుంచాలి) టొమేటో వుర్లగడ్డముక్కలు వేసి బాగా కలియబెటి

(47-వ పేజీ చూడండి)

# వనితా వాణి



## కలం స్నేహితులు

ఆంధ్ర (వార) పత్రిక సంక్రాంతి సంచికలో కుమారి కె. లీలావతి వ్రాసిన 'నా కలం స్నేహితులు' అనే వ్యాసం చదివాను. నిజం చెప్పాలంటే నాకు తమాయించుకోలేనంత కోపం వచ్చింది. చిత్రమైన ఊహాలతో మగాళ్ళను విచిత్రంగా చిత్రించిన ఆమెను అన్ని విషయాలూ ముఖాముఖి అడిగేద్దామనిపించింది.

మొత్తంమీద యీ వుత్తరాలు రాసిన వారందరికీ వెకిలిచేష్టలు తప్ప మర్యాద తెలీదనిపించింది, అనికూడ ఝూడించారు. కుప్పలుగా పోగైన వుత్తరాల్లో అధమం ఒకటైనా మర్యాదగా వ్రాయబడలేదనటం నమ్మదగినవిషయం కాదు. ఎంతోమంది సోదరీ అని సంబోధించి ఆదర్శాలపై వ్రాస్తే ఆ వ్రాతలను సొరకాయకోతలగా పొగడ్తలగా జమకట్టారు. కాని పాపం కుమారి లీలావతిగారి రాతలు పచ్చికోతలుగా కనబడుచున్నవను విషయం ఆమె గుర్తించినట్లు లేదు. కలంస్నేహితుల లోపాలకంటె ఆమె ఊహాల్లో పాళ్ళు ఎక్కువైనట్లు తేటతెల్లంగా తెలుస్తోంది.

కలం స్నేహితులు మాకూ వున్నారు (ఉభయ వర్గాలు కూడ) గాని ఎవరైనా అసందర్భంగా వ్రాయటంగాని, అపార్థం చేసుకోవటంగాని యింతవరకు జరుగుటలేదు. కాగా కలం స్నేహితుల కర్తవ్యాలు, ఆదర్శాలు అనేక రకాలైనా మేం మాత్రం మాతృభాషలో (గ్రాంథిక వ్యవహారికాలు) వుత్తరాలు వ్రాసుకొనటం, కలుసుకున్నపుడు ఏదైనా ప్లాను వేసుకొని (విహారాలు, సంఘసేవ, నాటకం లేదా సమావేశాలు) దానిని నిర్వర్తించటం మావిధిగా తలచి ప్రవర్తిస్తాం. కలంస్నేహితులంతా ప్రాంతీయసంఘాలుగా యేర్పడి అప్పుడప్పుడు సమావేశమౌతూ వున్నచో ఒకర్ని ఒకరు అర్థం చేసుకోటానికి అవకాశం లభిస్తుంది. అంతేగాక ఆ సందర్భాల్లో వారి వారి అభిరుచుల ప్రకారం తయారుచేసిన, లేదా సేకరించిన వస్తువులను మార్చుకొనవచ్చును. సంఘసేవ, పొదుపు వుద్యమం చారిత్రిక. పారిశ్రామిక స్థలాలకు విహారములు (Excursions) వివాహ సమస్యలు మొదలగు అనేక విషయాలపై చర్చించి తగు నిర్ణయాల తర్వాత కార్యాచరణకై కడు సమర్థంగా పనిచేయ వీలగును.

కలం స్నేహితుల వుత్తరప్రత్యుత్తరాల వలన దేశదేశాలవారికి పరస్పరాభిమానం కలుగుతుంది. కలం స్నేహితుల చలవవల్లనే ఒక జర్మన్ వనిత భారతదేశాన్ని చూడగలిగిందట. కలం స్నేహాలవల్ల సత్ఫలితాలు కలిగిన సంఘటనలు అనేకం చూస్తూవున్నాం. అయితేమనకుమాత్రం (ఆంధ్రులకు) ప్రపంచ శాంతికంటె 'ప్రదేశశాంతి' అవసరం. అపార్థం చేసుకోటానికీ, ఇతరులపై అనుమాన పడటానికీ మనకు అవకాశాలు హెచ్చు, అసలు మనవారసత్వమే అలాంటిది, గాన కలం స్నేహితులు సాధ్యమైనంత తరచుగా సమావేశమౌతూ వున్నచో వ్యక్తులు, సంఘాలు, తాలూకాలు, జిల్లాల మధ్య సుహృద్భావం ఏర్పడి తద్వారా 'ఆంధ్రానాం అనేకత్వం' అనే కళంకాన్ని తొలగించుకోగలం.

'కలం స్నేహితుల' గురించి కల్పించి వ్రాయటంకంటె యదార్థ విషయాలు వ్రాయటం ఎంతైనా సమంజసం. కలం స్నేహితం ఫలితముగా నాకు అనేక నూతన ప్రదేశాలనుండి ఆహ్వానాలు వస్తున్నయ్. కర్నూలులోగల మా 'కళానిలయం' లోని ఆల్బములు, నమూనాలు, చిత్రాలను చూట్టానికిరమ్మని నేనూ మిత్రులను ఆహ్వానిస్తున్నా. మరి. కుమారి లీలావతిగారు తమ 'సిసలైన కలం మిత్రుల'ను ఎలా 'ట్రీట్' చేస్తున్నారో!

★

ఎం. లక్ష్మణస్వామిపట్నాయక్, కర్నూలు]

 

## మనస్సు మార్చింది!



శ్రీమతి పొన్నాడ సుబ్బమ్మమామ్మగారి
పాదపద్మములకు: సాష్టాంగ నమస్కారములు చేసి వ్రాయునది:

మామ్మగారూ!

మీరు ఆంధ్ర వారపత్రికలో వ్రాసినది చదివాను. పెద్దచదువే చదివాను, పెద్ద ఉద్యోగమే చేస్తున్నాను. పదకొండు సంవత్సరాల క్రితం మా అమ్మగారు నా భార్యను తిట్టినారని కోపగించి, ఇంటినుండి బయటకొచ్చివేశాను. ఎన్నిసార్లో ఇంటికి రమ్మని వ్రాశారు. కాని నామనస్సు ఒప్పుకోలేదు వెళ్లి చూడలేదు. 8 సంవత్సరముల క్రితం మా అమ్మగారు పదేపదే నాగురించి పలవరించి చనిపోయినారట. నాకూ దుఃఖం వచ్చింది. కాని ఇప్పటికీ మా తండ్రిగారిని చూడలేదు. మీరు వ్రాసినది చదివాను. నా మనస్సంతా వికలమైపోయింది. వెంటనే మా తండ్రిగారి వద్దకు క్షమించవలసినదిగా కోరటానికి వెళ్ళుతున్నాను. ఇన్నాళ్లకు మీ రచన సక్రమమార్గంలో పెట్టకలిగినది. ఎంతమందో స్నేహితులు, ఎంతమందో బంధువులు బలవంతంచేసినా నేను వెళ్లి చూడలేకపోయినాను. నాకు జ్ఞానోదయం కలిగించినందుకు మీకు నేను రెండుచేతులూ జోడించి పాదాలకు నమస్కరించుచున్నాను. భగవంతుడు మీ కుటుంబమునకు శ్రేయస్సు కలిగించవలెనని ప్రార్థించుచున్నాను మ॥ రా॥ రా॥ శ్రీ తాతగారి, తమ ఎడ్రసు తెలుపవలసిందిగా (ఈ పత్రిక ద్వారా) ప్రార్థించుచున్నాను. మీ ముఖం చూడ్డంతోనే సకలపాపకర్మలు తొలగిపోవును.

ఇట్లు,

జి. ఆర్. ఎస్., (న్యూఢిల్లీ.)

[శ్రీమతి సుబ్బమ్మగారి అడ్రసు: తాళ్ళరేవు, కాకినాడ తాలూకా, తూ. గో. జిల్లా.]

# అత్తగారూ, ఆవకాయా

(31-వ పేజీ తరువాయి)

రే! మనం ఐదువేలేగా అడిగింది—విధవ భయపడి పదివేల కాయలు కక్కినట్లున్నాడే!" అన్నారు.

"వాడు ప్రస్తుతం కక్కిందీ అయిదువేల కాయలే" అన్నాను నవ్వు ఆపుకుంటూ. మా అత్తిగారి ముఖం వెలవెల బోయింది.

మొదటి రోజు రెండువందల కాయలూ, రెండవ రోజు మూడువందల కాయలూ తెగేసేసరికి రెండు కత్తులు పిళ్ళు విరిగాయి. ఒక కత్తి పూర్తిగా రెండు ముక్కలయింది. రెండు కత్తిపీటలు వంగిపోయాయి. మిగతా నాలుగువేలా అయిదువందల కాయలూ పండ్లయిపోయాయి మూడోనాటికి...మా అత్తిగారి ముఖం నల్లబడిపోయింది.

"పోనీ ముందీ అయిదువందల కాయలకూ పిండీ నూనె వెయ్యండి" అన్నాను—అప్పటికే ఆవకాయకు నీళ్ళు వదిలేసిన నేను ఉస్సూరుమంటూ.

ఆ...అంతే చేయాలి...విధవ పండబారిన కాయలిచ్చి దగా చేశాడు..." అన్నారు తప్పుకోడానికి ప్రయత్నించే మా అత్తిగారు.

"వాడేం దగా చేయలేదు...వాడుముందే చెప్పాడు పండబారాయి కాయలన్నీ అని" అన్నాను లోపల్నుంచి వచ్చే కోపాన్నంత మింగుతూ.

"ఆ...అదేలే...అయితే ముందీ ముక్కలకు కారం ఉప్పూ, పిండీ పటిస్తానూ... ఏం! అన్నారు మాట మారుస్తూ మా అత్తిగారు.

మాయిమం—ఆలాగే కానివ్వండన్నాను నేను నీరసంగా.

## నోము

అయిదువందల కాయల ముక్కలే ఒక పెద్ద గంగాళంనిండా వున్నాయి. ఇంట్లో వున్న చిన్న జాడీలు నాలుగూ తెచ్చి మా అత్తిగారి ముందు పెట్టాను.

పిండీ నూనె కలపకుండానే ముక్కలన్నీ నాలుగు జాడీలకూ పటించడం మొదలెటారు. యింకా సగం ముక్కలు మిగిలిపోయాయి. నాలుగు జాడీలూ నిండిపోయాయి. మా అత్తిగారు గుడ్లు తేలేశారు. నేను వెంటనే మరో నాలుగు జాడీలు టౌన్‌నుండి తెప్పించి అవిడ ముందుంచాను. మిగతా ముక్కలన్నీ కొత్తగ వచ్చిన నాలుగు జాడీలకూ సరిపోయాయి. అయిదువందల కాయలకే ఎనిమిది జాడీలైతే అయిదువేల కాయలకు యెన్ని జాడీలు కావాల్సి వచ్చేదో తల్చుకుని వాడలెత్తిపోయాను.

## ఉద్యాపన

ఎనిమిది జాడీల్లోనూ గుప్పెడు గుప్పెడు కారం, ఉప్పూ ఆవపిండీ వేసి ఒక్కో జాడీకి రెండు గరిటెలు నూనెపోసి మూత పెట్టి కృష్ణా అంటూ లేచారు మా అత్తిగారు.

"ఆవకాయ పెట్టడం అయిపోయిందా?" అన్నాను.

"ఆహా ఒక వారంరోజులు ఆ జాడీలవైపు వెళ్ళకుండా వుంటే సరి" అన్నది మా అత్తగారు చేయి కడుక్కుంటూ.

ఆవకాయ వేయడం యింత సులభమని తెలిస్తే నేనే వేసివుండేదాన్నే అనుకున్నా మనసులో.

* * *

## ఫలం

వారం రోజులతర్వాత మాయింట్లో మా అత్తిగారు ఆవకాయ వేశారు కాబట్టి భోజనానికి రావాల్సింది అంటూ మా చెల్లెళ్ళకూ, తెలిసిన వాళ్ళకూ కబురు పంపాను—ఆవకాయకోసం ముఖం వాచిన మా చెల్లెళ్లూ, మరుదులూ, అందరూ పిల్లాజెల్లాతో సహా వచ్చేశారు.

అంతా భోజనానికి కూర్చున్నారు. మా అత్తిగారు వంటింట్లో హడావిడి పడుతున్నారు...ఆవకాయకోసం నేను వెళ్ళేసరికి—ఏముంది? మూతలుతీసి చూస్తే ఆవకాయ లేదు—మామిడిపండ్ల ముక్కలున్నాయి బూజుపటి. (మా అత్తిగారి ముఖాన కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు...) ★

# దగాపడిన తమ్ముడు

(27 వ పేజీ తరువాయి)

పుల్లయ్యకు కొడుకు తప్పించి యీ లోకంలో, మరి దేనిమీదా లేదు. నీలివేసిన దేదో తినటం, ఏదో పొలంపని వుంటే చూసుకోవటం. మల్లుకి రెండున్నరేళ్ల వయస్సు. ఇప్పుడు తండ్రి వెంట పొలానికి ఎక్కడకుపడితే అక్కడకు వెళ్తున్నాడు. తల్లి అవసరమే తనకు లేదు. తిండి కూడా తండ్రితో కలియబడి తింటున్నాడు. పండిన పెసలు బుగతికియ్యగా విత్తనాలకు ఇంటి అవసరాలకు ఉంచగా, మిగిలినది అమ్మివేశాడు.

ఒకనాడు చీకటిపడింది. వంట అయిపోయాక ముసలమ్మ తిన్నది. వీధిలో అరుగుమీద ముసలమ్మ, మనుమరాలు-కూర్చున్నారు. పుల్లయ్యకొడుకుతోసహా వీధిలోకి వెళ్ళాడు. ఆ సమయంలో యేదో గొణుక్కుంటూ ఘీంకరించుకుంటూ, నడుస్తూనే శివాలు వేస్తున్నట్లుంది దాసుడు. అసలు ఆకలితో దహించుకు పోతున్నాడు. దీపం వెలిగించటానికి నడుస్తున్నాడే కాని తూలిపోతున్నాడు. ఆవైఖరి చూస్తే తాగినవాడనో, పిచ్చివాడనో, అనుకోవచ్చు. పుల్లయ్య ఇంటివైపు మాడగానే ప్రాణం వచ్చినట్లయింది. "నాయనా! పుల్లిగా..." అంటూ అంగట చతికిలపడ్డాడు.

నీలి "యీదిలోకి యెల్లాడయ్యా" అని జబాబిచ్చింది. ముసలితనం బాగా మీదపడినట్లుంది. మాటలు పెగలకుండా వున్నయ్. కాని అలాచూస్తూ తడబడుతూనే "అతల్లికి, ...కోపం వచ్చినాదంటే...భూ...చక్రం ...భుగ...భుగలాడి...పోతాది... ఎంతకని ...యీాలందరినీ సెమించమని... పాలుదా పట్టుకోవటం...దీపం యెలిగించి..."

ఆయాసంతో మరి మాటాడలేకపోయాడు. కొద్దినిమిషాల్లో ఆకలి జయించింది. ఒళ్లంతా ఆవరించిన ఆ దావాగ్ని దాసుడ్ని మూర్ఛపుచ్చడానికి ప్రయత్నిస్తోంది. కానీ, దాసుడు చావుబతుకుల్లో కొట్లాడుకొంటూనే. "తల్లీ! అంతా మాయ... సాక్ష పిలుస్తోంది...తల్లీ!..."...

నీలి చప్పున గదిలోంచి బుడ్డీ తెచ్చి దాసుడ్ని చూసింది. ప్రాణం అక్కడే వదిలేస్తున్నాడేమోనన్న భయంవేసింది. కళ్లు మూస్తున్న దాసుడు చెయ్యి సైగచేశాడు. నీలి వంటయింటికి పరిగత్తి గిన్నెడు అన్నం తెచ్చి, చప్పున కలిపి, గబగబ దాసుడినోటిలో కుక్కింది. జఠరాగ్నికి దహించడానికి ఆహారం దొరకగానే దాసుడు కళ్లువిప్పాడు. కళ్లంట నీరు బొట బొట కారటం మొదలెట్టింది. యెడమచేతితో కంటినీరు తుడుస్తూ, కుడిచేతి అన్నంతుడుపుతూ, ఆవిగ్రహం వేపు చూస్తుంటే, యెక్కడలేని జాలీ దుఃఖం పెనవేసుకొచ్చింది. కళ్లలో తిరిగే కన్నీరు కార్చకండా చీరకొంగుతో ఒత్తుకుంది.

దాసుడు మంచినీరు చివరకు త్రాగి, ఆలా గోడకు చారబడి ఆలసట తీర్చుకున్నాడు. ఎంతసేపటివరకో మౌనం మ్రింగివేసింది. చివరకు లేస్తూ నడవబోయి ఆగాడు. అభిమానం అంతా కూడి కళ్లలో, నీరయ్యింది. "అమ్మా! నీలమ్మ తల్లీ! ఈ దాసుడికి యెన్నాళ్ళకి కనిపించావు తల్లీ!" అని అనుకుంటూ మెల్లి మెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు."

# ప్రతీ రోజూ ఒక్క మాటే
# సూపర్ వైట్ కోలినోస్
## టూత్ పేస్టుతో పళ్లను తోముకుంటే దంతక్షయమును, దుర్గంధమును గలిగించే క్రిములను ధ్వంస పర్చును.

*కుటుంబములోని వారందరూ సూపర్ వైట్ 'కోలినోస్' యొక్క చల్లని పరిశుభ్రకరమైన మనోల్లాసకర రుచిని ఇష్టపడుదురు.



ప్రతి భోజనానంతరమున్నూ తమ పళ్లను తోముకోజాలని వారు–జ్ఞాపకముంచుకోండి సూపర్ వైట్ 'కోలినోస్' టూత్ పేస్టుతో రోజుకు ఒక్కమాటు పళ్లు తోముకుంటేనే, అది మీ పళ్లను కొత్త అమిత తెల్లగా శుభ్రపర్చుచూ వాటిని భద్రముగా కాపాడును.

**దంతక్షయము నుండి రక్షించును.**

సూపర్ వైట్ 'కోలినోస్' రోజుకు ఒక్కమాటే వాడినప్పటికీ, దంతక్షయమును, తొర్రలను గలిగించే క్రిములను చాలా మట్టుకు ధ్వంసపర్చును, అని పరిశోధనలు రుజువు పర్చినవి.

**దుర్గంధమునుండి కాపాడును.**

సూపర్ వైట్ 'కోలినోస్' టూత్ పేస్టు తక్షణం నోటి పాచి కంపును నిర్మూలించి నోటినుంచి విడిచే మీ ఊపిరిని పరిశుభ్రంగాను సువాసనగాను వుంచును.

**పళ్లు శుభ్రంగానుండును! నోరు పరిశుభ్రంగానుండును**

సూపర్ వైట్ 'కోలినోస్' టూత్ పేస్టు ఎంత త్వరితంగా మీ పళ్లను అతి కాంతిగాను అతి తెల్లగాను జేసి, నోటిని హాయిగా ఉండు పరిశుభ్రంగా వుంచునో చూడండి.

### సంపూర్ణ నిదర్శనము

సూపర్ వైట్ 'కోలినోస్'తో పళ్లను ఒక్కమాటే తోముకొంటే, అది దంతక్షయముకున్ను నోటి దుర్గంధముకున్ను ముఖ్య కారకములైన, నోటి క్రిములను చాలా మట్టుకు పూర్తిగా ధ్వంసపర్చునని లేబొరేటరీ పరిశోధనలు రుజువు పర్చినవి.

KOLYNOS TOOTHPASTE SUPER WHITE

## సూపర్ వైట్ 'కోలినోస్'ను అడగండి.

Registered User
Geoffrey Manners & Company Private Limited




# ఉగాది పచ్చడి

బాలల్లారా! బాలికలారా!!
ఉగాదిపండగ నేడేనండీ
చెప్పినవన్నీ తెస్తారా? మరి
ఉగాది పచ్చడి తింటారా?

వేపపువ్వు మరి దవ్వున లేదు,
చెఱువుగట్టునే వున్నది చెట్టు.
జట్టుగ ఇద్దరు యిటురండీ,
పట్టెడు పూవును తేతెండి! ॥బాల॥

మాయింటి పెరటి అరటిచెట్టొకటి
పెద్దగెల వేసింది ముద్దులొలికిస్తూ.
ఆర ముగ్గింది నే కళ్లారచూస్తి,
అరటిపండ్లింక మనకవసరము లేదు...
॥బా॥

గుఱటయ్యకాపువకు
చెఱుకుతోపుంది.
"ఈగాదిఉదయానఉచితంబుగాన
ఇచ్చెదను నే"నంటు
మాట యిచ్చాడు
ఇద్దరేవెడలండిసద్దులేకుండ॥బాల॥

ఓరోరి కిష్టయ్య! ఇటురాగదయ్య!
మామయ్య దొడ్డిలో
మామిడుందయ్య!
జీడిపిందెలు నీవు కోయ్య బోకయ్య!
మామయ్యనడిగితే మామిడిస్తాడు...
॥బాల॥

పాతబెల్లం అంటె రోతకలిగింది
కొత్తబెల్లం మీరు కొనితెండి వేగ
చింతతోపునకాచె
చింతకాయలు చాల
జట్టుజట్టుగబోయి పట్టుకొనిరండు...
॥బాల॥ ★

బెహరా వెంకటసుబ్బారావు

# పిల్లలు-పెద్దలు

అవి 'ఈస్టర్' ముందటి రోజులు. వర్షం ఆగింది. గ్రామ వీధుల గుండా నీరు ప్రవహిస్తోంది.

రెండు వేరువేరు గృహాలనుండి వొచ్చిన ఇద్దరు అమ్మాయిలు ఒక సందులో కలుసుకున్నారు. అక్కడ నీరు ఒక చిన్న మురికిగుంటలో నిల్చివుంది. ఒక అమ్మాయి చిన్నది; మరొకత్తె కొంచెం పెద్దది. ఇద్దరికీ తల్లులు కొత్తదుస్తులువేసి పంపారు. చిన్నమ్మాయి నీలం గౌను తొడుక్కుంది; రెండో అమ్మాయి పసుపుపచ్చరంగు ముద్రలుగల గౌను వేసుకుంది. ఇద్దరూ, చర్చినుంచే వొస్తున్నారు. ఒకళ్ళ దుస్తుల గొప్పదనం ఒకళ్లకు చూపుకోవడం అయ్యాక, ఆటల్లోకి దిగేరు. కొంతసేపటికి వాళ్లకి మురికినీటిలో ఆడుకోవాలని పించింది. చిన్నమ్మాయి జోళ్ళు, మేజోళ్ళు వేసుకునే, మురికిగుంటలోనికి దిగబోయింది. పెద్దమ్మాయి దాన్ని వారించింది:

"అట్లా వెళ్లకు, మలాషా! మీ అమ్మ తిడుతుంది. నేను నాజోళ్ళు, మేజోళ్ళు తీసేస్తాను; నువ్వూ నీవి తీసెయ్యి" అంది.

ఇద్దరూ అట్లాగే చేశారు. తర్వాత గౌన్లు ఎత్తి పట్టుకుని నీటిలోకి దిగి నడవసాగేరు. నీరు మలాషా మడమలవరకూ వొచ్చింది:

"చాలా లోతుగా వుందని భయమేస్తోంది, అకుల్యా!" అంది.

"రా, ఫరవాలేదు. ఇంతకంటె లోతుండదు. భయం లేదు," అని జవాబిచ్చింది రెండో అమ్మాయి.

మూలం:- టాల్‌స్టాయ్.

అనువాదం:- శౌరికృష్ణమూర్తి

ఇద్దరూ దగ్గరగా వొచ్చాక అకుల్యా అంది: "నీళ్లు చిందించకు, మలాషా! జాగ్రత్తగా నడు!"

ఆ అమ్మాయి అట్లా అనీ అనకుండానే మలాషా పాదాన్ని ఒక్కసారిగా నీటిలో ముంచి, నీళ్లు చిందించింది. బురదనీరంతా అకుల్యా గౌనుపైన చిమ్మింది. ఆ అమ్మాయి మొహంపైనా, ముక్కుమీదాకూడా బురదనీళ్లు పడ్డాయి. తన బట్టలమీద బురదమరకలు చూసి, కోపగించి, మలాషాని కొట్టడానికి పరుగెత్తింది. మలాషా భయపడి, కష్టమొచ్చిందని గమనించి, బురదనీటిలో నుంచి గబగబా పరుగెత్తి, ఇంటికి పారిపోడానికి తయారైంది. అప్పుడే అకుల్యా తల్లి, తనకూతురు దుస్తులు బురదపడం చూసి, ఇట్లా అంది:

"ఏంచేస్తున్నావే, దరిద్రపుసునగా!"

"కావాలని మలాషా చేసింది" అని బదులుపలికిందా అమ్మాయి.

దీంతో అకుల్యాతల్లి మలాషాని పట్టుకొని, రెండు కొట్టింది. మలాషా, వీధిపొడుగునా వినపడేలా, గట్టిగా అరుస్తూ, ఏడవసాగింది. ఆ అమ్మాయితల్లి కూడా వీధిలోకి వొచ్చింది.

"మా అమ్మాయిమీద ఎందుకు చెయ్యిచేసుకున్నావమ్మా?" అని తిట్టసాగింది. మాటమీద మాట పెరిగి, చినికిచినికి గాలివానఅయింది. మగవారంతా బయటికి వొచ్చారు. పెద్దగుంపు పోగైంది. ప్రతీవాళ్ళూ అరిచేవాళ్ళే; వినేవాళ్లొకళ్ళూలేరు. అందరూ వాదులాడుకొని, ఒకళ్లనొకళ్లు గెంటుకోవడం, గుద్దుకోవడంవరకూ వొచ్చింది. అదే సమయంలో అకుల్యామామ్మ జనం మధ్యకు వొచ్చి, వాళ్ళను శాంతపర్చ చూసింది.

"మీ ఉద్దేశం ఏమిటి? ఇట్లాగేనా, ప్రవర్తించడం? ఈస్టర్ పండుగ ముందెట్టుకుని కూడా! ఇది సంతోషంతో ఉండాల్సిన సమయం కాని, ఇట్లా దెబ్బలాడవలసిన సమయంకాదు."

వాళ్లు ఆ ముసలమ్మ మాటలు వినలేదు. ఆమెని దాదాపు నేల



"టవర్ కాక్"

కత్తిరింపు చిత్రం: —చిత్రకారుడు: దివి సుబ్బారావు, భట్టిప్రోలు

మీద పడేటట్టు గెంటేశారు. అకుల్యా, మలాషాల ధర్మమా అని కాకపోతే ఆ ముసలిది ఆ సమూహాన్ని శాంతపర్చకలిగి వుండేది కాదు. ఆడవాళ్లుపరస్పరమునిందించుకుంటుంటే అకుల్యా తన చొక్కా మీద బురద దులిపేసుకుని, మళ్లా నీటిగుంటదగ్గరకు పోయింది. చిన్న రాయి తీసుకుని, మట్టిని త్రవ్వి, గుంటలోని నీరు బయటికి పోయేటట్లుగా చిన్న కాలవ చెయ్యసాగింది. వెంటనే మలాషా కూడా అక్కడికి చేరింది. చిన్నకట్టె తీసుకుని కాలవ త్రవ్వడంలో తోడ్పడసాగింది. మగవాళ్లు తగవులాడుతున్న సమయంలో, ఆ చిన్న కాలవ ద్వారా నీరు, ముసలావిడ ఉన్నచోటికి రాసాగింది. ఆ పిల్లలు చెరో ప్రక్కా నీటిని అనుసరిస్తూ అక్కడికొచ్చారు.

"పట్టుకో, మలాషా పట్టుకో!" అకుల్యా అరిచింది; మలాషా నవ్వులో మునిగి మాట్లాడలేక పోయింది.

అమితమైన ఆనందంతో, కట్టె ముక్క నీటిపైన తేలుతోంటే చూస్తూ, చిన్న పిల్లలు తిన్నగా మగవాళగుంపు మధ్యకు వెళ్లారు.

ఆ ముసలావిడ పిల్లల్ని చూసి, మగవాళ్ళతో ఇట్లా అంది:

"మీకు సిగ్గులేదూ, పిల్లలకోసం దెబ్బలాడుకోవడానికి? ఓ ప్రక్క వాళ్లు అంతా మర్చిపోయి, సంతోషంగా, ఆడుకుంటున్నారు. వెర్రిబాగుల పిల్లలు! వాళ్లే మీ కంటె తెలివైనవాళ్లు!"

పెద్దవాళ్లు చిన్న పిల్లల్ని చూశారు; సిగ్గుపడ్డారు; తమ అల్పత్వం చూసి తామే నవ్వుకుంటూ, ఎవళ్లింట్లోకి వాళ్లు నెమ్మదిగా జారుకున్నారు.

[చిన్నపిల్లల మాదిరిగా పవిత్ర మనస్తత్వాన్ని అలవర్చుకుంటేనే గాని మీకు స్వర్గంలోకి ప్రవేశార్హత ఉండదు."

—బైబిల్]★

# న్యూఢిల్లీ లేఖ

[5 వ పేజీ తరువాయి]

టానికి అంగీకరించిన మూలధనం రూ 40 లక్షలు అవుతుంది. 1956 జులై 31 వ తేదీ-ఉన్న దాన్నిబట్టి అనుమతి పొందిన మూలధనం రూ. 5 లక్షలు, చెల్లించటానికి అంగీకరించిన మూలధనం రూ 1 లక్ష."

కర్మాగారంమీద మొదట్లో అనుకున్న పెట్టుబడి వ్యయం రూ. 25 లక్షలు. కాని 1950 సెప్టెంబరు చివరవరకూ, అనగా మూల్‌గావ్‌కర్ సంఘాన్ని నియమించేవరకూ జరిగిన అసలు వ్యయం రూ 63 లక్షలు. ఆ తరవాత ఏళ్ళలో ఇంకా చాలా లక్షలు వ్యయమైనాయి.

1955 సెప్టెంబరు 20 వ తేదీన అప్పటి ఉత్పత్తిశాఖ మంత్రి పార్లమెంటులో ఒక "ప్రశ్నకు సమాధానంగా ఇలా అన్నారు: ప్రీ ఫాబ్రికేటెడ్ గృహ నిర్మాణం కోసం ఆరోగ్యశాఖ అజమాయిషీ క్రింద 1950 లో భారత ప్రభుత్వం స్థాపించిన ప్రభుత్వ గృహనిర్మాణ కర్మాగారం మొదట్లో అనుకున్న ప్రకారంగా ఉత్పత్తి సాధించలేకపోయింది. 1952 డిసెంబరు 6వ తేదీన లక్ష రూ. చెల్లించిన మూలధనంతో ప్రారంభింపబడినహిందుస్థాన్ గృహనిర్మాణ కర్మాగారానికి పై కర్మాగారం తాలూకు రు. 56 లక్షలఖరీదైన స్థిరాస్తులన్నీ కవులుకివ్వబడినవి.

ఈ ప్రభుత్వ పరిశ్రమలో బసాకాసింగ్ అండ్ కంపెనీవారు ఇతరవాటాదార్లు. 1955 జూన్ లో ఈ లిమిటెడ్ కంపెని ఆర్థిక పరిస్థితి చూడగా ప్రారంభమైన నాటినుంచి వచ్చిన నష్టం 14 లక్షలనుంచి 15 లక్షల దాకా తేలింది. అప్పుడు బసాకాసింగ్ అండ్ కో తో ఒప్పందం రద్దుచేసుకుని ప్రభుత్వం రూ. 5 లక్షల నష్టం పొందింది. ఈ నష్టాన్ని కూడా రద్దుచేసి, పరిశ్రమను లాభదాయకమైనదిగా చేశారు. 1953 ఏప్రిల్ 1 నుంచి 1954 జులై 31 దాకా కంపెనీ వార్షిక నివేదికనుబట్టి భారత ప్రభుత్వం ఇచ్చిన స్థిరాస్తుల విలువ రూ 43,85,012. గోడు, స్థలాల విలువ రూ. 9,98,142. గృహాల విలువ రూ. 13,06,219. యంత్ర సామగ్రి విలువ రూ 18,65,364. ట్రక్కులు వగైరా రూ. 2,15,287. గ్లేజు కాగితంమీద బొమ్మలతోసహా ప్రచురించిన నాల్గవ వార్షిక నివేదికప్రకారం 1956 ఆగస్టు 1న గృహాలవిలువ రు. 42,454. యంత్రాలవిలువ రూ.11,103. మొత్తం స్థిరాస్తుల విలువ రూ. 1,19,716.

హిందుస్థాన్ గృహనిర్మాణకర్మాగారానికి విక్రయించని ప్రీఫాబ్రికేటెడ్ గృహాలతో కలిపి ఈ ఆస్తులవిలువ రూ. 68 లక్షలని మూల్‌గావ్‌కర్ సంఘం నిర్ణయించింది.

కొని పార మెంటులో ఉత్పత్తిశాఖ మంత్రి చెప్పినదాన్నిబట్టి కంపెనీకి కవులుకిచ్చిన స్థిరాస్తుల విలువ అసలు రూ. 56 లక్షలపైగా వట.కంపెనీ మొదటిని వేదికనుబట్టి ఈ స్థిరాస్తుల విలువ రూ. 43,85,012. నాల్గవని వేదిక ప్రకారం వాటి విలువ. రూ. 1,19,716.

'మంత్రి బాధ్యత ప్రసక్తి రావటానికి ముందే ఈ గృహనిర్మాణ కర్మాగార వ్యవహారమంతా జరిగింది గనక, "ఈ లాభదాయక వ్యవహారాన్ని" గూర్చి "ఛాగ్లా" విచారణవంటి దవసరమని ఎవరూ భావించలేదు.



# ఉగాదికి పిండివంటలు

(39-వ పేజీ తరువాయి)

మూతపెట్టాలి. పొయ్యిమీదనుంచి దించే ముందుగా కొద్దిగా పుదీనా లేక కొత్తిమిరి వేసుకుంటే బాగుటుంది.

తెల్లగడ్డ వాసన గిట్టనివాళ్ళు దానిని వేయడం మానేసుకోవచ్చు. ఇంకొస్తా వోపిక వున్నవారు పచ్చి లేక ఎండుబఠాని వుడికబెట్టి వుల్లిగడ్డ వాటితో కలిపి వేసుకోవచ్చు. చాలారుచిగా వుంటుంది. ముఖ్యంగా నాన్ వెజిటేరియన్సు ఎటూ మటన్ వండుతారు కాబట్టి పనిలో పనిగా కుర్మాచేయవచ్చు.

## వెజిటబుల్ కుర్మా

నాన్‌వెజిటేరియన్సు మటన్‌కుర్మా చేసుకుంటే వెజిటేరియన్సు వెజిటబుల్ కుర్మా చేసుకుంటారు. కుర్మాలోని వస్తువులు వేరయినా రుచిలో వెజిటబుల్ కుర్మాకూడా ఏం తీసిపోదు మటన్‌కుర్మాముందు.

కావలసిన వసువులు: వుల్లిగడ్డలు-5 ప, టమేటో-5 ప, బీన్సు-5 ప, క్యాబేజి-5 ప, కాలీప్లవర్-5 ప, బీట్‌రూట్-ఒక దుంప, క్యారెట్-3, బఠాని (పచ్చిబఠాని లేక ఎండుబఠాని) జీడిపప్పు, పెరుగు ½ శే, లవంగాలు, లవంగపట్ట, దాల్చినచెక్క, కొత్తిమెర, నెయ్యి, పుదీనా.

తయారుచేయుపద్ధతి: కాలీఫ్లవర్, క్యాబేజి తరిగి కొద్దిగా నూనె లేక నేతిలో వేరు వేరుగా వేయించాలి. అంటే కొద్దిగా నూనె పాత్రలో వేసి కాలిఫ్లవర్ ముక్కలు తరిగినదాన్ని దానిలో వేసి వాడ్చాలి. ఇలాగే క్యాబేజినికూడా వాడ్చుకోవాలి. క్యారెట్, బీట్‌రూట్, బీన్సు సన్నంగా ముక్కలుచేసి వుడికబెట్టి నీళ్ళు వార్చేయాలి. మిగిలిన కూరగాయలను సన్నంగా ముక్కలు చేసుకొని వుంచుకోవాలి. వుల్లిగడ్డలు వుడికబెట్టి పైతొలుతీసి ముక్కలుచేసుకోవాలి. పొయ్యిమీద వెడల్పుమూతిగల కళాయి పాత్రనుపెట్టి దానిలో నెయ్యిపోయాలి (2 పలములు) నెయ్యి కాగినతర్వాత జీడిపప్పు, పెరుగు, వుడకబెట్టిన పై కాయగూరల ముక్కలన్నీ వేసుకోవాలి. అన్ని కుర్మాలకు మల్లే దీనిలోకూడా కొబ్బరి, అల్లం, గసాలు, పచ్చిమిర్చికలిపి నూరిన మసాలా ముద్దను వేసుకోవాలి. కుర్మాలలో పెరుగు పోసే ప్రతిచోటా పెరుగులో కొస్తా వుప్పు, పసుపుపొడి వేయడం మరచిపోకూడదు. సన్నని సెగమీద వుడకనిచ్చి దించబోయే ముందు కొస్త పుదీనా లేక కొత్తిమిర వేస్తే చాలా రుచిగా వుంటుంది. మొత్తంమీద వెజిటబుల్ కుర్మా కొస్త శ్రమపడి చేయాల్సి వుంటుంది.

## వుల్లగడ్డ పకోడీల కుర్మా

శెనగపప్పు ¼ శేరు, వుల్లగడ్డలు-5 ప, టమేటా-5 ప, అల్లం, పచ్చిమిరపకాయలు, పెరుగు-½ శేరు, ఎర్రగడ్డలు, జీడిపప్పు-నెయ్యి.

తయారుచేయు విధము: శెనగపప్పు, నానబెట్టి రుబ్బుకోవాలి. రుబ్బిన శెనగ పప్పులో సన్నగా తరిగి దంచిన అల్లం, లవంగపట్ట, ఇష్టముంటే కొస్తా తెల్లగడ్డ వేసుకోవాలి. వుల్లగడ్డలు వుడకబెట్టి తొలుతీసి కొక ముక్కలుగా కోసుకోవాలి టొమేటో ముక్కలు చేసుకోవాలి. వెడల్పాటి కళాయి గిన్నెలో నేయి లేక నూనెపోసి బాగా కాగినతర్వాత ఎర్రగడ్డ, పచ్చిమిర్చి ముక్కలు, లవంగపట, టొమేటా ముక్కలు వేయాలి. బాగా కాలినతర్వాత పెరుగుపోసి, వుల్లగడ్డ ముక్కలు వేయాలి. గసగసాలు, ధనియాలు, అల్లం, కొబ్బరి మసాలాముద్దగా నూరి దీనిలో వేసి కలియబెట్టి వుడకనియ్యాలి. కొద్దిగా నీళ్లు ఎక్కువగా వుంటేనే మంచిది. తర్వాత రుబ్బిన శెనగపప్పుతో వడలుకాల్చి, వడలు వేడిగా వున్నప్పుడే ఈ పెరుగులో వేసేయాలి. వడలు పెరుగులో నాని బాగా వుబ్బుతాయి. పెరుగు బాగా పీల్చుకుంటుంది. కాబట్టి మొదటే కొస్త నీరు ఎక్కువగా వుంటే మంచిది. ఉల్లగడ్డ, పకోడీల కుర్మా కూడా చాలా బాగుంటుంది. మసాలా దినుసుల వల్లే కుర్మాకు రుచివస్తుంది.

పి. అనసూయ (నెల్లూరు)



## విజ్ఞప్తి

సంపాదకులకు:

ఆర్యా,

5-2-58వ తేదీ ఆంధ్ర వార పత్రికలో "మేము ఆంధ్రులం" అనుశీర్షిక క్రింద ప్రచురితమయిన వ్యంగ్య రచనను చదివిన కొందరు పాఠకులు, నాపేరు ప్రక్కనపడిన పిలానీ రాజస్థాన్ అను నా విలాసమును చూచి, ఇచట చాలకాలముగా కీర్తినార్జించుచున్న ఆంధ్ర సమితియే నా రచనలో నేనుదహరించిన సంఘమని భావించి ఇదటికి లేఖలు వ్రాసినారు.

ఈ లేఖమూలముగా పై వ్యాసమునుచదివిన పాఠకులకు విన్నవించునదేమన దానిలో ఉదహరించిన "సంఘము" యిచటి సమితి ఏమాత్రముకాదు; రచనలోని పాత్రలతో సంఘటనలతో ఇచటయున్న ఆంధ్ర సమితికి ఎంతమాత్రము సంబంధము లేదని గ్రహింతురుగాక!

ఇట్లు,
పిలానీ "వాక్పతి"

## ఆమె జీవితము

(24-వ పేజీ తరువాయి)

సరైనదారికి రావాలని కదా నా ఆశ! విచారణ మళ్ళీ నెల మూడవ తారీఖుకి వేశారు."

భానుమతి ఓ నిట్టూర్పు విడిచింది.

"తర్వాత" అన్నాను.

"జరగటానికి ఏముంది? జరగవలసినదంతా జరిగింది. ఈ భానుమతికి ఎప్పుడూ ముందడుగే గాని వెనకడుగు లేదుగా!"

"మూడో తేదిన విచారణ జరిగిందా!"

"ఆహా! మేళ తాళాలతో సహా!"

"ఆయన రాజీకు రాలేదా!"

"రాకేం! వచ్చాడు. కాని నా ఆశయం నెఱవేర్చుకోవాలని తీర్మానించుకొన్న తరువాత నేను రాజీకి ఎల్లా ఒప్పుకొంటాను?"

"ఎల్లాగయినా నీది రాతిగుండె. చిన్నప్పుడు ప్రతిదానికీ ఎల్లా మూర్ఖపు పట్టుదల పట్టేదానివో అప్పుడూ అల్లాగే చేశావు...ఊ...తర్వాత..." అన్నాను నేను.

అనుకొన్నట్లుగానే విచారణ జరిగింది. ఇదివరకు జరిగిన హియరింగుకన్నా ఆనాడు కోర్టుకు చాలామంది వచ్చారు. స్త్రీల విషయంలో పురుషులు చేసే అన్యాయాక్రమాలను ఖండిస్తూ ఒకర్తె వాదిస్తోందని విని వినటానికి వచ్చారు. అతని తరఫున ఒక పెద్ద వకీలు వాదించాడు. నేను ఎవరినీ పెట్టుకోలేదు. బుద్ధి చాతుర్యము, వాక్చాతుర్యము, ధైర్యము నాలో కావలసినంత యిమిడివున్నప్పుడు నాకు యింకో వకీలుకూడా ఎందుకు? నా వాదనలో ఏదైనా 'వీక్ పాయింటు' అంటూ వుంటేగా! అందుచేత నేనే వాదించాను. తను ఇందిర జీవితాన్ని నాశనం చేసినది తప్పు, నన్నూ, యింకా ఇతర అమ్మాయిలను తను చేసిన అన్యాయాక్రమాలను అత్యద్భుతంగా వాదించాను. ఇటువంటి మనిషితో జీవితము నాకు అక్కర్లేదని, విడాకులిచ్చేసున్నానన్నాను. కోర్టులో వాళ్ళంతా తెల్లబోయారు. ఒక సాధారణ స్త్రీ ఇంతగా వాదించగలిందే అన్నారు. వకీళ్లంతా బుర్ర లొంచుకున్నారు. ఇంక తనని విచారించవలసినది ఒక్కటే వుందని, అది అతి ముఖ్యమైనదని, అందుకు కావలసిన సాక్షిని కోర్టువారి ఎదుట హాజరు పరచవలసినదని, అది కూడ పూర్తయిన తరువాత యీ గోపాలరావుకు తగిన దండన విధించవలసినదని, నాకు కావలసిన సాక్షి వివరాలు న్యాయమూర్తికి రాసి యిచ్చాను. న్యాయమూర్తి 'తథాస్తు' అన్నారు.

ఆనాటికి కోర్టు విచారణ ముగిసింది. చెప్పలేని హృదయభారంతో గోపాలరావు యింటికి వెళ్లటం గమనించాను. ఆ రాత్రి తను చాలా బాధపడివుండాలి! ఎందుచేతనంటే ఆ మర్నాడు వుదయము నా దగరకు వచ్చిన గోపాలరావుకు క్రితంరోజు గోపాలరావుకు చాలా వ్యత్యాసముంది. తను చేసిన తప్పులన్నీ క్షమించమని, యికనుంచి నే నెల్లా చెప్తే అల్లాగే నడచుకొంటానని నా కాళ్ళు పట్టుకొని కన్నీళ్లు కార్చాడు. దారికి వచ్చాడని నాలో నేను సంతోషించాను. ఈ మాటలే ఇందిరతో చెప్పి యిద్దరూ కలిసి యిక్కడికి రంపన్నాను. 'ఇందిర' పేరు విని చాలా ఆశ్చర్యపోయాడు.

'ఇం...ది...ర...తెలుసునా!'

'తనూ తెలుసు; తన నాశనమైన జీవితమూ తెలుసు' అన్నాను.

ఏమనుకొన్నాడో ఏమో, నాదగ్గరనుంచి వెళ్ళిపోయి, ఇందిరతో సహా తిరిగి వచ్చాడు.

ఇద్దరూ మతాబు వెలుగులా నూతన వధూవరులలా కన్పించారు. అతని దగ్గర అనేక ప్రమాణాలు తీసుకొని వాటిని దస్తావేజులుగా తయారు చేశాను.

'ఇందిరా! ఇంక నా పని పూర్తయింది. ఆనాడు నేను సముద్రపువడ్డున అన్నమాట నిలబెట్టుకొన్నాను. ఇంక నీ గతి నీ భర్తగతి' అని బయలుదేరాను.

నా వెనకాలే ఇందిర 'భానుమతీ! భానుమతీ' అంటూ వస్తోంది. ఇందిర కేకలు నా చెవులను కొరికి వేశాయి.

ఉలిక్కిపడుతూ గబుక్కున కళ్ళు తెరచి చూచాను. నా పక్కనే రతీదేవిలా ఇందిర నవ్వుతూ నుంచుంది. 'టైము ఎనిమిదయింది. యింకా ఏమిటి నీకీ మొద్దునిద్ర' అంది.

నాలో నేను ఆశ్చర్యపోతూ లేచాను.

* * *

## 4

"నీకేదో పిచ్చెక్కినట్లుంది!"

"అబ్బే, అటువంటి దేమీ లేదు" అంది భానుమతి

"మరి యింతవరకు సరిగా చెప్పి, తుళ్లి పడి లేచావు. ఇందిర నాపక్కనే వుంది. అంటావేం ?"

"తొందరపడకు లలితా! పూర్తిగా విను మరి."

ఇందిర మహాసంతోషంతో 'నాన్నగారి దగ్గరనుంచి టెలిగ్రాం వచ్చింది. ఇవాళ నన్ను... పెళ్ళివారు... చూడటానికి... వస్తున్నారుట. నువ్వు యిపుడు నాతోటి రావాలి" అంది.

"ఓసి! భానుమతి! ఎంత అద్భుతమైన కలకన్నావే! అయితే ఇదంతా కలన్నమాట" అన్నాను నేను.

"ఇందిరలో నాకలంతా అప్పుడే చెప్పాలనుకొన్నా. కాని పిల్లను చూడటానికి వచ్చే యీ శుభసమయంలో అష్టకష్టాలతో కూడుకొన్న యీకల చెప్పటము మంచిది కాదనిపించింది. పైగా రాబోయే వరుణ్ణి ఊహించుకుంటూ ఊహాలోకంలో విహరిస్తున్న ఇందిర యిప్పుడు వినగలిగే స్థితిలో కూడ లేదని గ్రహించా. తనతో కూడా వెళ్లాను.

వాళ్లు బొంబాయినుంచి వచ్చారు. ఇరుపక్షాల వారికి పరిపూర్ణతృప్తి వెంటనే. వివాహము కూడా జరిగింది. ఇందిరకు నాకలను కల్లచేసి, సుఖంగా, హాయిగా, శాంతంగా, ఇందిర సంతోషమే తన సంతోషంగా భావిస్తూ, ప్రస్తుతం కలకత్తాలో వున్నారు ఇందిర భర్త ఇందిరతో" అని పూర్తిచేసింది భానుమతి.

"బలేకల కన్నావే! చాలా విచిత్రంగా వుంది. దానికితోడు నాకు ఓ ఉపన్యాసం కూడా ఇచ్చావు. రాత్రి రెండుగంటలనుంచి తెల్లారి ఎనిమిది గంటలలోపుగా ఎన్నెన్ని ఘనకార్యాలు చేశావే! మరి నిన్ను గురించి యీ కథలన్నీ ఎందుకుపుట్టాయి?"

తను నవ్వుతూనే "అదా! ఇందిరతో చెప్పలేని ఆకలను మొదలూ చివరాకత్తిరించి, తలా, తోకా, కాళ్ళు తగిలించి ఓ పత్రికకు పంపాను. అది అచ్చయింది. పొరపాటున నా పేరు మార్చటం మర్చిపోయాను. అందువల్ల యీ పిచ్చివాళ్లంతా నోటికి వచ్చినట్లు చెప్పుకుంటూ వచ్చారు."

"ఆఖరిసారి అడుగుతున్నా! ఇపుడేనా చెప్తావా లేదా?"

అపుడే వచ్చారు ఆమె బావగారు. నేను లేచి నిలుచున్నాను. తనూ లేచింది.

"బయలుదేరుతున్నావా?"

"నువ్వు నేనడిగినది చెప్పవా?"

తను ఒక చిఱునవ్వు నవ్వి తన బావగారిని క్రీగంట చూస్తూ—

"నిజం చెప్పాలా? నా చదువు యీ సంవత్సరంతో పూర్తయింది. వచ్చే నెలలో నా పెళ్ళి—అరుగో నాభర్త" అంది మెల్లిగా.

స్నేహ వాత్సల్యంతో మర్యాద చిహ్నంగా నా నుదుట కుంకుమ నుంచి, పువ్వూ పండ్లు నా చేతిలో వుంచి తన స్త్రీధర్మాన్ని నెరవేర్చింది. త్వరలో నే సుపుత్రుని కనమని దీవించాను. ఈ మాట ఆమెబావగారు విన్నారు కాబోలు, బయటకు వచ్చి, "పెళ్ళి కాకుండా నేనా" అన్నారు నవ్వుతూ! ముగ్గురము నవ్వుకొన్నాము.

నేను భానుమతి దగ్గర శెలవు తీసుకొని యింటిముఖం పట్టాను. భానుమతి దగ్గరకు ఎంత హృదయభారంతో వెళ్లానో అంతకు రెటింపు సంతోషంతో తిరిగి యిల్లు చేరుకొన్నాను.





# సినిమా

## ★ డాక్యుమెంటరీ చలనచిత్రోత్సవాలు ★

ఈ నెల తొలి వారంలో, భారతీయ డాక్యుమెంటరీ చలనచిత్రోత్సవాలను బొంబాయి గవర్నరు శ్రీ శ్రీప్రకాశ ప్రారంభించారు. మనదేశంలో ఈ ఉత్సవాలు జరగడానికి ఇదే తొలిసారి. కొద్దికాలంలోనే, ఎన్నదగ్గ అభివృద్ధిని సాధించిన డాక్యుమెంటరీ ఉద్యమం, మున్ముందు ప్రముఖస్థానం వహించి, వ్యాపార సరళిలో కథాచిత్రాల పోటీనికూడా నిభాయించుకోగల స్థాయికి రావడానికి ఈ ఉత్సవాలు నాందీప్రస్తావన వంటివి అని చెప్పుకోవచ్చు. ఇక్కడ ముగిసిన తరువాత ఢిల్లీ, కలకత్తా, మద్రాసు నగరాలలో కూడా ఆయా ప్రాంతాల చలనచిత్ర సంస్థల సహకారంతో ఉత్సవాలు జరుగుతాయి.

గవర్నరు శ్రీప్రకాశ డాక్యుమెంటరీ ఉద్యమ ప్రాశస్త్యాన్ని వివరిస్తూ, ఈ చిత్రాలు దేశంలో అన్ని ప్రాంతాల ప్రజల కోసమూ తీసేవి, అందరూ చూచి ఆనందించతగినవి కాబట్టి, ఈ చిత్రాల నిర్మాణానికి విశేషప్రాముఖ్యం ఉన్నదన్నారు.

"డాక్యుమెంటరీలు, జీవితాన్ని, ఉన్న పరిస్థితులను ఉన్నపళంగా చూపిస్తాయి. కథాప్రధాన చిత్రాలు, పరిస్థితులు ఉండవలసిన విధానాన్ని సూచిస్తాయి" అని ఆయన అన్నారు.

గవర్నరు శ్రీప్రకాశను, (ఐ. డి. పి. ఎ.) డాక్యుమెంటరీ నిర్మాతలసంఘం అధ్యక్షుడు శ్రీ పాల్ జిల్స్ స్వాగతం చెప్పారు. ప్రముఖ నటి, డాక్యుమెంటరీ చిత్రనిర్మాత, దర్శకురాలూ అయిన దుర్గాబాయ్‌ఖోటే ఆయనకు పూలమాల వేశారు.

ఉత్సవంలో 'టెన్ తౌజండ్ హాండ్స్', 'మార్షల్ డాన్సెస్ ఆఫ్ మలబార్', 'ఎర్త్ అండ్ వాటర్', 'ది లారీ డ్రైవర్', 'పాంచ్ తూ పి; ఎ విలేజ్ ఇన్ వెస్ట్ బెంగాల్', 'ట్రెయినింగ్ ఎ రూరల్ స్కూల్ టీచర్', 'ఎ విలేజ్ ఇన్ ట్రావెన్‌కూర్', 'కల్ ఫొర్ ఆజ్' చిత్రాలను ప్రదర్శించారు.

ఢిల్లీలో ఉత్సవాలను, కేంద్ర సమాచార ప్రసారశాఖ మంత్రి డా॥ బి. వి. కేస్కర్ ప్రారంభిస్తారు.

* * *

## బొంబాయి సినిమా లేఖ

### మదర్ ఇండియా

గడచినవారం బొంబాయి సినిమా వాతావరణంలో చెప్పుకోదగిన ముఖ్యవిశేషమూ లేవు. అయినా స్టూడియోలలో సందడికి లోటు లేదు. ఫ్లోర్లెక్కి స్టూడియోలకి వచ్చి, కాసేపు ఫ్లోర్లో భోం చేసి, మళ్లీ ఫ్లో

అశోక్ పిక్చర్స్‌వారి 'రాగిణి'లో పద్మిని, కిశోర్



# ★ డాక్యుమెంటరీ చలనచిత్రోత్సవాలు ★

హైక్కి వెళ్ళిపోయే జనాభా ఎప్పుడూ ఉంటుంది. ఈ వారం వార్తల్లోను, నీలి వార్తల్లోనూ కొన్ని సినిమా పరిశ్రమను ఎంత గౌరవాపాదకంగా ఉన్నాయో, కొన్ని అంత అగౌరవకరంగానూ ఉన్నాయి. సువార్తల్లో కొన్నిటిని చూద్దాం:

హాలివుడ్, పాంటాజ్ థియేటర్ లో జరుగనున్న ఆస్కార్ బహుమాన ప్రదానోత్సవం చూటానికి దర్శక నిర్మాత మెహబూబ్ ఖాన్ సతీ సమేతులయి అమెరికా వెళ్లారు. మెహబూబ్ నిర్మించిన కళాఖండం "మదర్ ఇండియా" ఈ ఏడాది బహుమాన నిర్ణయానికి ఎన్నుకోబడిన అయిదు విదేశీయ చిత్రాల్లోను ఒకటి. ఈసారి "మదర్ ఇండియా" విదేశీ చిత్రాల ఆస్కార్ బహుమతిని గెల్చుకునే ఆస్కారం లేకపోలేదని అభిజ్ఞులు భావిస్తున్నారు.

కాని ఆస్కార్ ను గెల్చుకోవటం కంటే దుష్కరమైన దేమిటంటే, అమెరికాలో దీనికి ప్రదర్శనావకాశం లభించటం. దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వక పోవచ్చు గదా! భారతీయచిత్రం వచ్చి అమెరికాలో కాస్త డబ్బు గడించుకోవటమంటే మంటగా ఉంటుంది అమెరికన్లకి. ఒకసారి ప్రేక్షకులకు భారతీయచిత్రాన్ని రుచి చూపిస్తే, తమ చిత్రాలకి పలుకుబడి తగ్గిపోతుందని అమెరికన్ల భయమై ఉండవచ్చును. అమెరికన్ చిత్రాలు మాత్రం భారత దేశంలోకి భారీఎత్తున దిగుమతి అవుతూనూ ఉన్నాయి; వీటికి భారతీయులు బోలెడు అతిథిమర్యాద చేస్తూనూ ఉన్నాం. వీటిని స్వేచ్ఛగా దేశంలోకి రానిస్తున్నందుకు భారత ప్రభుత్వాన్ని భారతీయ చిత్ర నిర్మాతలు విమర్శించటంలో సబబు ఏమీ కనిపించటం లేదు. ప్రభుత్వాధినేతలు, రాజకీయనాయకులు, సెనేటర్లు, సంసార్లు అంతా మళ్లీ నీతులబాకా ఊదుతూనే ఉన్నారు. ఈ నీతులవ్యాప్త్యా అమెరికన్ చిత్రాల పరపతి ఎటువంటిది? ప్రేక్షకుల మానసిక ఆరోగ్యాన్ని భంగం చేసేది కాదా? సాధారణంగా ఏ అమెరికన్ చిత్రం చూసినా కామోద్రేకభరిత సన్నివేశాలో, అస్తమానం అవే అయితే బావుండదని నేరాల సన్నివేశాలో కనిపిస్తాయి. వీటి ప్రభావం ఎక్కువగా పడేది ఇంగ్లీషు చదివిన జనాభామీద. ఇంగ్లీషు చదువులు చదివిన యువతులు భారతీయమైనదాన్నల్లా తెగడటం, పాశ్చాత్యమైనదాన్నల్లా పొగడటం చూస్తుంటే చిరాకు కలుగుతుంది వీరి ప్రవర్తన, వీరి మహానా సంస్కృతిగూర్చి గట్టిగా అనుకోకుండా ఉండటమే మంచిది ఏదేమైనా ఈ దేశంలో నానాటికీ వేళ్ళు పాతుకుంటున్న "షోకిలా" సంస్కృతికి ముఖ్య కారణం అమెరికా చిత్రాలేనంటే అత్యుక్తి కాదు. మరి ఈ చిత్రాల ప్రభావంతో మన యువతీ యువకుల జాతీయత, దేశాభిమానం ఏ విధంగా పరిణమిస్తాయో ఆలోచించవలసిన వారు మన దేశనాయకులే.

* * *

ఉత్తమ చిత్రం ప్యాసా, ఉత్తమ నటుడు దేవానంద్, ఉత్తమ నటి నూతన్, ఉత్తమ సంగీత దర్శకుడు ఎస్. డి. బర్మన్ అని లండన్‌లోని ఆసియా చలనచిత్రసంఘం నిర్ణయించింది. 7 రోజుల పాటు మంచి భారతీయ చిత్రాలను కొన్నిటిని చూపించారు. చూసిన వారిలో భారతీయులు, బ్రిటిష్‌వారు, ఇతర దేశీయులు ఉన్నారు. ఉత్సవానంతరం ప్రేక్షకులఓట్లు తీసుకోగా పైవిధంగా ఫలితాలు వచ్చాయి

కేవలం ప్రజల ఓట్లనే తీసుకుంటే ఆసియా చలనచిత్ర సంఘం అనుసరించిన పద్ధతే ఉత్తమమని బొంబాయిలో అనుకుంటున్నారు. దీనితో పోల్చి ఒకానొక భారతీయపత్రిక నడుపుతున్న వార్షిక బహుమతుల పద్ధతిని ఈవిధంగా వీరు విమర్శిస్తున్నారు.



ఈగిల్ ఫిలింస్ వారి 'ముజ్రిమ్'లో రాగిణి, షమ్మీకపూర్.

(1) సంగీతం, నటన, కథ-ఇత్యాది శీర్షికలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క చిత్రాన్నే సూచించటానికి అవకాశం ఇవ్వటంవల, ఒకటికంటె ఎక్కువచిత్రాల్లో మంచి సంగీతం ఇచ్చిన సంగీత దర్శకునికి, మంచినటనచూపిన నటునికి, ఒక్క చిత్రంలో నేపాల్గొన్న వారితో పోలిస్తే కొంతఅన్యాయం జరుగుతున్నది. (2) చిత్రాలు చూడని వాళ్ళుకూడా ఓటుచేయటానికి వీలుంటం అన్యాయంగా ఉంది. అప్పుడప్పుడు మతాభిమానం కూడా ఓటింగ్‌కు కారణమవుతోంది ఉన్నటుండి పాకిస్థాన్ ప్రజలకు కూడా ఓటింగ్ అవకాశం ఇవ్వటంతో వారంతా తమ మతస్థులకు ఓటివ్వటం జరుగుతోంది. వారు ఓటుచేసిన చిత్రాలు కొన్ని పాకిస్తాన్‌లో ఇప్పటిదాకా విడుదల కానే లేదు. ఆ చిత్రాలను కాని, ఆ చిత్రాల్లో నటించినవారి నటనను గాని చూడకుండా అక్కడి ప్రజలు ఓటుచేస్తే అది సరైన ఓటు అవుతుందా? ఈ విమర్శ చేసినది ఒక అగ్రశ్రేణి నటుడు.

ఇంకొక విమర్శ ఏమిటంటే, చాలమంది ఫిలిం వ్యక్తులు బహుమతులను సంపాదించటానికి అడ్డదార్లు తొక్కుతున్నారు. ఆ పత్రిక కాపీలు చాలా కొనేసి దొంగఓట్లు పంపిస్తున్నారు ఈ కారణం చేత గత సంవత్సరం గొప్ప విజయం సాధించిన శచీన్‌దేవ్ బర్మన్ బహుమతిదారుల జాబితాలో లేనే లేడు. ఇలాగే దుష్మన్ రచయిత ముఖ్రంశర్మ, భాభిలో నటించిన పండరీబాయి, ఇంకా అర్హులైనవారు కొందరు బహుమతుల దరిదాపుల్లోకైనా రాలేదు.

*       *       •

మహేష్‌కౌల్ చిత్రం "తలాక్" లో మొదటిసారిగా పరిచయం కానున్న స్త్రీ అవబతే కామినీకదం మొన్న 7వ తేదిన ఒక శుభముహూర్తాన అనిల్ జి. కదం అనే కాలేజీ కుర్రాణ్ణి పెళ్ళాడింది.

అసిస్టెంట్ డైరెక్టరు, యాక్టరు అయిన అషిమ్‌కుమార్ ఈ నెలలోనే వారణాసిలో వివాహం చేసుకున్నాడు.

అలీరజా అనే నాటక రచయితను తాను రహస్యంగా వివాహమాడినటు కొన్ని నెలల నుంచీ ప్రబలంగా ఉన్న వదంతులు కేవలం నిరాధారమని నిమ్మి ఇటీవల వెల్లడించింది. తాను పెళ్ళాడితే పబ్లికున స్నేహితుల, అభిమానుల ఆశీర్వాదాలతో పెళ్ళాడగలవని, చాటున పెళ్ళాడవలసిన అగత్యం తనకు లేదని ఆమె చెప్పింది. తమ వివాహవార్త అసత్యమని అలీ రజా కూడా వెల్లడించాడు. (ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)★



"కరుకోడికి పుట్టాను; కత్తిలాగా పెరిగాను" అన్నది రమణి...జలరుహా వారి 'రాజనందిని'లో అంజలీదేవి, గుమ్మడి వెంకటేశ్వరరావు

## గేవాకలర్‌లో తొలి తెలుగు చిత్రం

లలితాఫిలింస్‌వారి తొలి గేవాకలర్ చిత్రం 'లవకుశ'కు విజయస్టుడియోస్ అధిపతి శ్రీ బి. నాగిరెడ్డి మూర్హిక్ ఉదయం ప్రారంభోత్సవం జరిపారు. వాహినీస్టుడియోలోని రెండవఫ్లోర్ లో జరిగిన ఈ ఉత్సవానికి పలువురు దర్శక నిర్మాతలూ, నటీనటులూ, రచయితలు వచ్చి నిర్మాత శ్రీ శంకరరెడ్డిని అభినందించారు. పూజ ముగియగానే, శ్రీరాముడి భూమిక నిర్వహిస్తూన్న ఎన్. టి. రామారావు మేకప్ వేసుకొని వచ్చారు. శ్రీ నాగిరెడ్డి కామెరా స్విచ్ ఆన్ చేసి, చిత్రనిర్మాణాన్ని లాంఛనంగా ప్రారంభించారు. శ్రీరాముడు అభయముద్ర పట్టి మందహాసం చేశాడు.

అనంతరం నాగిరెడ్డి, నిర్మాత శంకరరెడ్డి, దర్శకుడు సి. పుల్లయ్యగారలకు శుభాకాంక్షలు తెలియచేశారు.

సి. పుల్లయ్యగారు [illegible] ప్రకితం 'లవకుశ' చిత్రాన్ని తీయడం, అది ఘనవిజయం సాధించడం విదితమే. ఇప్పుడు ఆయనే, అధునిక సాంకేతిక సదుపాయాలతో ఈ రసవత్తర గాధను వర్ణచిత్రంగా రూపొందించడం ముదావహం.

ఇందులో సీత భూమికను అంజలీదేవి, వాల్మీకి పాత్రను నాగయ్య నిర్వహిస్తున్నారు. ఈ కథకు అతి ముఖ్యమైన లక్ష్మణుడి భూమికను కాంతారావు నిర్వహిస్తారు.

'లవకుశ' ను తమిళంలో కూడా నిర్మిస్తారు. గేవాకలర్ ఛాయాగ్రహణానికి అవసరమైన, పెద్ద ఆర్క్‌లాంప్‌లను పటేల్ ఇండియావారు సరఫరాచేస్తారు. ★

## ఊటీలో ఫిలిం 'షూటింగ్'

ఏప్రిల్ ఆఖరువారంనుండి మే నెలాఖరు వరకు ఊటీ హోటళ్ళలో చోటు గిరాకీ

పెరిగే సూచనలున్నాయి. తప్పేది లేదం కాలం కాబట్టి ఇది మామూలే అయినా, విశేషంగా చెప్పుకోవడానికి కారణం: అక్కడ ఈ ఏడాది ఆంధ్రా హాలీవుడ్ ను చిన్న బ్రాంచి ఏర్పాటు కావడం.

హీనపక్షం మూడు చిత్రనిర్మాణసంస్థల షూటింగ్ యూనిట్లు మేనెలలో అక్కడ విడిది చేస్తాయని తెలుస్తోంది. తెలుగు వాటిలో అన్నపూర్ణా పిక్చర్స్ బృందం ఒకటి. వారి కొత్త చిత్రానికి ముఖ్యమైన ఔట్ డోర్ షూటింగ్ అక్కడ జరుగుతుంది. అక్కడ చిత్రించే సన్నివేశాలలో నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, సావిత్రి, రాజసులోచన పాల్గొంటారు. నిర్మాత మధుసూదనరావు, దర్శకుడు ఆదుర్తి, ఛాయాగ్రహణ దర్శకుడు సెల్వరాజ్, కళాదర్శకుడు కృష్ణారావు మొదలగు వారు వెళ్తారు. పద్మశ్రీ పిక్చర్స్ పేరిట పి. పుల్లయ్యగారు నిర్మిస్తున్న 'శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం' చిత్రానికికూడా, ఊటీలోనే కొన్ని దృశ్యాలు చిత్రించడానికి కార్యక్రమం వేసుకున్నారు. ఇందులో ఎన్. టి. రామారావు ముఖ్యనటుడు.

పెద్ద నటులు ఇందరు ఊటీ వస్తే, అక్కడ కాల్ షీట్లకు సెట్లు సులభంగా దొరకుతాయన్న ఊహతో మరికొందరు నిర్మాతలు కూడా ఈ విషయం ఆలోచిస్తున్నారు.

★

## కిత్‌నా బదల్ గయా ఇన్‌సాన్

టిక్కెట్టు కొనుక్కొచ్చిన జనాభా, సినిమా అయిపోయాక దర్శకుడిని అడగాల్సిన ముక్క కొస్తా అడిగాకే అనేవి మరీ కథ మొదలెట్టడం పరికొత్త బొంబాయి వారి పిపి-మోళీ అని మాడర్న్ థియేటర్స్ వారి గేవాకలర్ చిత్రం 'కిత్నా బదల్ గయా ఇన్ సాన్' సూచిస్తోంది. కాబట్టి సినిమా మొకాక, 'కిత్నా బదల్ గయా?' అని వీరిని అడగకండి; ఆలోచించకండి.

అసలు, పరదాకోసం, కేవలం వినోదం కోసం కథ అల్లినప్పుడు, అందులోను హాలీవుడ్ చిత్రం 'సెవెన్ బ్రైడ్స్ ఫర్ సెవెన్ బ్రదర్స్' నూ, అంకెల దగ్గర్నుంచి (ఇంకా లోనూ ఏడుగురే) దంకెలు వేసే పద్ధతిదాకా, ఫిల్టరు చేసినప్పుడు, ఇందులో ఇలా తోకా ఇలా ఎందుకున్నాయని ఎవరూ అడగరు. పాటలు విని, ఆటలు కని ఆనందించి ఇంటికెళ్ళిపోతారు. అందువల్ల వి. ఎస్. శోహర్, ఈ చిత్రంలో కథను సమర్థించుకోవడానికి 'కిత్ నా బదల్ గయా ఇన్ సాన్' అని ఆశ్చర్యపడ నక్కర్లేదు. ఆశ్చర్యపడాల్సినవాళ్ళు ప్రేక్షకులే. ఎందుకంటే, ఇదివరలో హాలీవుడ్ కథలు అనుకరించినవాళ్ళు, మన దేశానికి నప్పేవిధంగా కథను కట్టుకథ చెప్పి ఒప్పించేవారు. ఇటీవల కొంత కాలంగా వస్తున్నవి ఏ విధానా అద్భుతంగా ఉండటం లేదు. అందువల ‘కిత్నా బదల్ గయా' అని సినీజగాలి గురించి మనం అనుకోవాలి.

కాగా, కథకు దేశవాళీ వేషం వేయడంలో, "అహింసా పరమోధర్మః" పక్కా



అశోకావారి 'భూలోకరంభ' చిత్రంలో ఆర్. నాగేశ్వరరావు

గురుదత్ ఫిలింస్‌వారి ఐదవచిత్రంలో గురుదత్, వహీదా రెహమాన్. వెనుకనున్నది 'స్టుడియో సిమ్లా'కాదు; ఈమధ్య గురుదత్ బృందం అసలు సిమ్లాకే వెళ్ళి చక్కని దృశ్యాలు చిత్రించారు

సాల దగ్గర్నుండి 'అడవి మనిషీ మంచివాడే' వంటి సత్యాలు రకరకాల నీతులు చెప్పించినందువల, కథకుడికే విసుగేసి, ఎలాగో అలా ఆపేద్దామన్నటు యాదాలాపంగా ముగించడం జరిగింది. ముక్తాయింపు సొంపు తరిగింది.

ఈవిషయం మినహాయిస్తే, మిగతా విధాల ఈ చిత్రం చక్కని కాలక్షేపం. కళ్ళకి చల్లగా, ఆహ్లాదకరంగా ఉన్న గేవాకలర్ ఛాయాగ్రహణం, రెండుమూడు చక్కని పాటలు, చూడతగ్గ నృత్యాలూ ఈ చిత్రం ప్రత్యేకాకర్షణలు. ముఖ్యనటులు ముగ్గురిలోను ఇద్దరు-అజిత్, నళినీజయవంత్ సమర్థంగానటించారు. దర్శకుడు జోహార్ ధరించిన ఊరిపెద్ద భూమిక రూపకల్పన, తద్వారా నటనకూడా రాణించాయి కొద్దీ.

కథను ముందుకు నడపడానికి కొత్తగా ప్రవేశపెట్టిన ఈ పాత్ర, అద్భుతగులుతూ వచ్చింది.

అజిత్, అతని ఆరుగురు తమ్ముళ్లూ అడవిలో ఆడుతూ పాడుతూ, వేటాడుతూ కాలక్షేపంచేస్తూ ఉంటారు. 'అడవి' మనుషులు కాబట్టి క్రమశిక్షణ లేక, ఉత్సాహం కొద్దీ ఒకళ్లనొకళ్ళు తన్నుకుంటూఉంటారు. కొన్నాళ్లకి వాళ్లకి విసుగేసి, ఇంతవండి, తిండెపెట్టేసి ఇల్లు చక్కబెట్టే ఆడదిక్కు ఉంటే బాగుణ్ణనిపిస్తుంది. పెద్దవాడు బస్తీ వెళ్లి, ఓ పిల్లని పెళ్లాడి చక్కావస్తాడు. ఆమె వీళ్లని అదుపాజ్ఞల్లో పెడుతుంది. తన ఊళ్లో పిల్లల్ని తెచ్చి పెళ్ళు చేదామని కూడా ప్రయత్నిస్తుంది. ఈలోగా వాళ్ళే, తలో పిల్లనీ ఎత్తుకొచ్చి రాక్షసవివాహం చేసుకుంటామంటారు.

అప్పుడు, వదినెగారు చివాట్లేసి, ఆ పిల్లల్ని తిరిగి పంపించి వేస్తుంది. అనక, ఒక నృత్య పరీక్షలో ఈ 'జంగ్లీల' జట్టు బస్తీ గుంపుని ఓడించి, ఆ అమ్మాయిల జంటను గెలుచుకుని పెళ్ళాడుతుంది. ఇది 'అవ్వూరి' సంప్రదాయం. ఇదికథ.

నృత్యపరీక్షలలో ముందరి చక్కని నృత్యాలు చూపించారు. పోనుపోను పోటీ జోరుమీరడంతో, సాముగరిడీలు, పిల్లి మంత్రాలు వేయించి, హీరోలు ఆరుగురిని గెలిపించారు.

కులాసాగా, హాల్లో నిల్చుకోవడం తప్ప మరే విధమైన శ్రమలేకుండా, అందమైన దృశ్యాలు చూస్తూ, హాయిగొలిపే పాటలు (కొన్ని అమెరికన్‌వి) వింటూ కాలక్షేపం చేయడానికి వెళ్ళిమాడ తగ్గ చిత్రం ఇది. 

# గిట్టుబాటుకాని పుట్టినరోజు పండుగ

'మా అబ్బాయి పుట్టినరోజు పండగ కాబట్టి, మీరంతా రేపురావలసింది' అని నలుగురికీ ఇన్విటేషన్ కార్డులు పంపించేశాడు ఒక ప్రాక్టీసులేని ప్లీడరు క్రిం

## గిట్టుబాటుకాని పుట్టినరోజు పండుగ

పోరి అలా చేసే కానుకలు పుష్కలంగా వచ్చాయి. అవి అమ్మేస్తే డబ్బు దండిగా దొరికింది.

ఇది ఉండగా మరోటీ మరోటీ ఎందుకు అని తోచా పోయింది ఆ ప్లీడరుకి. డబ్బు అవసరం కాస్త ఎక్కువ కాగానే, మళ్ళీ అబ్బాయికి పుట్టినరోజు పండుగ ఏర్పాటు చేశాడు. విశాలభారత దేశంలో మహాజనులకు తన కొడుకు పుట్టినరోజు పండుగ జరిగి తొమ్మిది నెలలే అయిందన్న సంగతి గుర్తుండదని అతని ధీమా. అందుకని, అప్పు కూడా చేసి, ఏర్పాట్లు భారీఎత్తున చేశాడు. వలువురూ వచ్చివెళ్ళారు గాని, ఈసారి కానుకలు ఏమీ రాలేదు. అంతా దండుగైపోయింది. వ్యాపారం గిట్టుబాటు కాలేదు. ఆ నేస్తుకి ఒళ్ళు మండిపోయి, పెళ్ళాంమీద మండిపడ్డాడు. 'సుబ్బరంగా ఏడాదికొకసారి ఉండే వాళ్ళకి తొమ్మిదినెలల కొకసారి పుట్టినరోజు పండగలు చేసే సదుపాయం ఉంటే ఎంత బాగుండును. మళ్ళీ కోర్టుగడప తొక్కే కక్కుర్తి లేకుండా దర్జాగా గడిచిపోయేది కదా' అని విసుక్కున్నాడు ఆమెమీద.

'అందుకు నన్నేమంటావు. నా దాపూటీ' అన్న భావానికీ, ఆ భామిని అభినయం నటించింది.

శీవలాయుడు వేషంలో ఉన్న రాధాకిషన్, ఆమె ధాటికి కొడిలిపోయి వెక్కి మొహం పెట్టి, జారుకున్నాడు.

డీలక్స్ ఫిలింస్ వారి 'లాజ్ వంతి'లో ఈ సన్నివేశాన్ని మొన్న చిత్రించారు. రాధాకిషన్ భార్యగా మనోరమ నటించింది.

మోహన్ సెగాల్ దర్శకత్వాన తయారౌతున్న ఈ చిత్రంలో నరిస్, బల్ రాజ్ సాహ్ని, ప్రభునయాళ్, లీలామిశ్రా, శేవీ రాజ్ మొదలగు వారంతా పాల్గొంటున్నారు. సంగీత దర్శకుడు ఎస్. డి. బర్మన్.

* * *

ఫాక్స్ టెయిల్ ఫిలింస్ (బొంబాయి) వారి తెలుగు చిత్రం 'స్నేహితులు' సత్యవంత్ దర్శకత్వాన తయారవుతోంది. తెలంగాణా జానపదగేయం ఆలంబనంగా మొన్న కొన్ని ఔట్ డోర్ దృశ్యాలు చిత్రించారు. ఇందులో విజయకుమార్ (దాంపత్యం), సి. ఎస్ మాధవ్, సి. వి. రాయుడు, బి. ఎల్. రిచర్డ్ మొదలగు వారు నటిస్తున్నారు.

## "మధుమతి"

దర్శక నిర్మాత బిమల్ రాయ్, ఫిబ్రవరి ఉత్తరార్ధంలో 'మధుమతి' చిత్రానికి రెండు పెద్ద నృత్యాలను చిత్రించారు. ఒకటి పండుగలకు సంబంధించింది. అందులో దిలీప్ కుమార్, వైజయంతిమాల, జానీవాకర్ బృందం పాల్గొన్నారు.

దీని తరువాత, వైజయంతిమాల, 'సినితూ తెలుయూ" కలిసి చేసిన 'సంతాల్' నృత్యం చిత్రించారు.

'మధుమతి'లో మొత్తం మూడు పెద్ద నృత్యాలు ఉంటాయి. విశేషం ఏమిటంటే ఈ మూడింటి కూర్పు, నిర్వహణ ముగ్గురు నృత్య దర్శకులకు ఒప్పగించారు. ఒకటి సచిన్ శంకర్, మరొకటి సత్యనారాయణ్, మూడోది సోహన్ లాల్ డైరక్టు చేస్తున్నారు.

'మధుమతి' చిత్రానికి కథాస్థలం కుమావోన్ పర్వతారణ్యాలు. అందువల్ల రెండు ఔట్ డోర్ దృశ్యాలు పుష్కలంగా కనబడతాయి.

ఈ చిత్రానికి సలీల్ చౌదరి సంగీత దర్శకుడు.

* * *

బిమల్ రాయ్ ప్రొడక్షన్స్ తరువాతి చిత్రం 'సుజాత' నిర్మాణం మొన్ననే ప్రారంభమైంది. రెండురీళ్ళు పూర్తి అయ్యాయి. అస్పృశ్యతగురించి ఇంకా పల్లెలలో వేళ్ళూనుకున్న దురభిప్రాయాలను నిర్మూలించే ఆశయంతో దానికి సంబంధించిన సమస్యను తీసుకొని కథను రూపొందించినట్లు నిర్మాతలు తెలుపుతున్నారు. ఇందులో నూతన్, సునీల్ దత్, శశికళ, లలితా పవార్, సులోచన, తరుణ్ బోస్ నటిస్తున్నారు. ఈ చిత్రానికి మాటలు పాల్ మహేంద్ర, పాటలు మజ్రూ వ్రాస్తున్నారు. సంగీతదర్శకుడు శచిన్ దేవబర్మన్. మొన్ననే ఒక యుగళగీతం రికార్డు చేశారు. ఆశాభోస్లే గీతారాయ్ అది పాడారు.

ఈ చిత్రం దర్శకుడు బిమల్ రాయ్. ★

## వివాహం

దర్శక నిర్మాత శ్రీ ఎల్. వి. ప్రసాద్ తమ మేనల్లుడు చి॥ ఎం. పరాత్పరరావు (శ్రీ ఎం.వి. సుబ్బారావుగారి కుమారుడు)కు చి॥ సౌ॥ రత్నకుమారికి మార్చి 6 న ఏలూరు శేసరీ టాకీస్ లో వైభవంగా వివాహం జరిపించారు. పలువురు పుర ప్రముఖులు వివాహానికి వచ్చి వధూవరులను దీవించి కానుకలు చదివించారు



కాశీనాథ్ ప్రొడక్షన్సు వారి 'రామాంజనేయ యుద్ధం' చిత్రంలో శ్రీరాముడుగా శ్రీ అమర్ నాథ్, సీతగా జూనియర్ శ్రీరంజని.

## అతిథి సత్కారం

(37-వ పేజీ తరువాయి)

వారికి వండివార్చేందుకు"అంటుంది. పిలువకపోతే వచ్చినవారి దగ్గర పరువుపోతుంది. అడకత్తెరలో పోకవలెగా వుంటుంది వారి పని. మేకపోతు గాంభీర్యంతో ఎదటివారిని విందులకి పిలిచి, యింట్లో భార్యామణి కాళ్లా వేళ్లా పడతారు మాట దక్కించమని. అప్పట్లో వచ్చిన వారి కెలాంటి మర్యాద జరుగుతుందో తేలికగా వూహించవచ్చు. ఇంటావిడ కొంచెం మెత్తనిదైతే, భర్త పరువు నిలుపుతుంది. గయ్యాళియైతే నోటితోగాక చేతలతో తన అయిష్టాన్ని వ్యక్తీకరిస్తుంది. ఈ ముప్పు గడవాలంటే భార్యాభర్తలిరువురూ సంప్రదించుకొనిన మీదట ఎవరినైనా విందు కాహ్వానించటం మంచిది. సంప్రదింపులకి వ్యవధి లేనపుడు భర్త గౌరవం కాపాడటం భార్యవిధి.

మరికొన్ని యిళ్లలో యింటి కెవరైనా రావటమంటే గిట్టదు యజమానికి. ఈవిషయంలో స్వపర భేదమేమీ లేదు. తనూ, భార్యాబిడ్డలూ తప్ప మిగిలిన వారంతా పరులనే భావన. ఎవరైనా యింటికి వచ్చిన సూచన గ్రహించగానే ఘుమఘుమలాడుతూ అకారణంగా యింట్లో వాళ్లని విసుక్కోవటం, వచ్చినవారి ఎదుట అసభ్యంగా అరుస్తూ ప్రతివాళ్లనీ విసుక్కోవటం మొదలు పెడతారు. ఈ పరిస్థితులలో వచ్చిన వారికి ముళ్లమీద వున్నట్టుంటుంది. గృహిణిస్థితి వర్ణనాతీతం. అసలు ఇలాంటి యిళ్లలో స్వబుద్ధితో ఎవరినైనా ఆహ్వానించేంత దుస్సాహసం యిల్లాలి కుండదు. వచ్చేవారైనా ఏదో ముఖ్యమైన పనివుంటే తప్ప, కేవలం వీరింట్లో విందుభోజనాలు కుడుస్తూ కూర్చోవాలనే సదుద్దేశంతో రారు. అలాంటప్పుడు ఇంటావిడకు రాకరాక వచ్చిన అతిథికి అమర్యాద జరుగుతోందని బాధ—అలాంటి వ్యక్తియెదుట తను అవమానం పాలయ్యాననే వేదన. "మొగుడు కొట్టినందుకు కాదు, తోటికోడలు నవ్వినందు కేడ్చిం"దని మనలో ఒక సామెత వుంది. ఎవరూ లేనప్పుడు దేవుడులా వుండే భర్తయినా, ఎవరైనా వచ్చేప్పటికి విసుక్కోవటం తిట్టటం మొదలుపెడితే ఆ మంచి తనమేమీ రాణించదు. వీరెప్పుడూ యిలా కీచులాడుకుంటూనే వుంటారు కాబోలనుకుంటారు వచ్చినవారు. చాటుగా ఎన్ని మాటలైనా స్త్రీలు భరించగలరుగాని, యితరులఎదుట కొంచెం కఠోర పరిహాసాన్ని కూడా సహించలేరు. ఇక అవమానమే అయితే చెప్పాలా!

ఈ రకంలోనే గ్రుడ్డిలో మెల్ల అన్నట్లు కొందరు బయటివారి ఎదుట ఎంతో మర్యాదగా వుండి, ఆకోపమంతా చాటుగా అర్ధాంగి దగ్గిర ప్రదర్శిస్తూంటారు. "అడ్డమైన వాళ్ళనీ ఎవరు మేపుతుంటారు! కాఫీ ఫలహారాలేమీ అక్కరలేదులే. అవసరమైతే హోటలుకి వెడతారు. భోజనం పెడితే చాలు. అదికూడా అట్టహాసమేమీ చేయకు" అంటారు. పాపం అదిఏం చేస్తుంది? భర్తమాట కాదంటుందా? దాని పర్యవసానమెలా వుంటుందో? లేక వచ్చిన వారిని అమర్యాద చేస్తుందా? వారికి సరియైన మర్యాద జరుగకపోతే "పాపం! మగవాడేమి చేస్తాడు? అలివిగాని ఆలిని కట్టుకుని అఘోరిస్తున్నాడు" అంటూ సానుభూతి వెల్లడిస్తారు. లోగుట్టు వారికేమి తెలుసు?

ఈ సమస్యకి రెండే పరిష్కారమార్గాలు. అందులో సులభమైనదీ అనుసరణీయమైనదీ యజమాని మనస్తత్వం మార్చుకోవటం. వచ్చేవారెవరైనా తప్పనిసరియై వస్తారేగాని కేవలం తనను వేధించే వుద్దేశంతో రారని గుర్తించాలి. బంధువులు ఇంట్లో వారి పరిస్థితి గ్రహించి, వారికి సాధ్యమైనంత దూరంలో వుండటం రెండవమార్గం. కాని ఈపద్ధతివలన క్రమిణా బంధుత్వాలే విచ్ఛిన్నమయే ప్రమాదముంది. అయితే కానియ్యి అనుకుంటే చిక్కేలేదు.

ఇక మూడవ రకం గృహస్థులు. వీరివద్ద ఆదరణకీ ఆప్యాయతకీ కొరత ఏమీ లేదు. కాగా ఒక్కొక్కప్పుడు శ్రుతిమించి బాధాజనకమౌతాయి. ఇంటికి వచ్చినవారు పని అయి వెళ్తామంటే, ఇంకా రెండు రోజులుండి వెళ్లమని తగని బలవంతం చేస్తారు. వారు మొగమోటస్తులైతే అవతల అవసరమైన పనులెన్నో చెడిపోతాయి. ధిక్కరించి వెళ్ళిపోతే గేస్తుల సద్భావం కోల్పోతారు.

కొందరికి మర్యాద తెలియక మనవాళ్లేకదా అని తాము ఏది తింటే అదే పెడతామనుకుంటారు. అంతమాత్రాన మనం చద్దిఅన్నం తింటాముగదా అని వారికీ అదే పెడితే ఏమి మర్యాదగా వుంటుంది? చాలా మిగిలితే పారేసుకుంటామా అనుకుంటారేమో? అక్కరలేదు. వెచ్చబెట్టి వాడుకోవచ్చు. చారు పులుసులాంటివి వేడిచేస్తే చెడిపోబోతున్నవి కూడా చెడకుండా వుంటాయి. అన్నం మళ్లీ పొయిమీద పెడితే చెడిపోతుందని భయంలేదు. పెద్దగిన్నెలో నీళ్లుపోసి అందులో అన్నపుగిన్నె పెట్టి మూతబెట్టి వేడిచేస్తే, అప్పుడు వండిన అన్నంలా వుంటుంది. పులిమజ్జిగ వాడవలసివస్తే, కొంచెం నిమ్మరసం, ఉప్పు, కరివేపాకు వేసే నోటికి రుచిగా వుంటుంది. ఇటువంటి వారి హృదయనైర్మల్యం వీరిలోపాలను కప్పివేస్తుంది.

మరికొందరు అజ్ఞానంచేతకానీ, తెలివితక్కువతనంవల్లకానీ, అతిథులని మాటలతో నొప్పిస్తారు. "ఈ పూట మీ వదిన గారింట్లో భోజనం కాబోలు" అనీ, "మీ మేనమామగారు మిమ్మల్ని భోజనానికి పిలవలేదా" అనీ ఇలా ఆ వూళ్లో వేవున్న ఇతర బంధువుల ఆహ్వానాలను గురించి సూచిస్తారు. తీరా వెళ్తామంటే "అయ్యో రాకరాక వచ్చారు. నాలుగు రోజులుండి వెళ్లండి" అంటారు. ఇంకా కొందరు ఇంటికి వచ్చిన వారితో "అంతా నాదగ్గర తినేవాళ్ళేకానీ, నన్ను పిలుచుకెళ్ళి నాలుగు రోజులపాటు పట్టెడు మెతుకులు పెట్టిన పాపానపోరు. అయ్యో! విన్నంటున్నా ననుకుంటావేమో పిన్నీ, ఏదో మాటవరసకి చెప్పాను" అంటారు. వీరి మాటల వెనుక దాగివున్నది అజ్ఞానమో, వ్యంగ్యమో తెలుసుకోవటం బ్రహ్మతరం కాదు.

వంశ గౌరవమనే పేరుతో అతిథి సత్కారం కోసం సర్వనాశనమయ్యే 'దూపాటి వియ్యన్నపంతులు' (పెళ్ళిచేసి చూడు)లాగా వుండమని ఎవరూ సలహా ఇవ్వరు. కానీ గృహస్థులన్న తరువాత అతిథి అభ్యాగతి సత్కారం చేయటం అవసరం. పూర్వకాలంలోవలె వారి పాదోదకం శిరస్సున చల్లుకోకపోయినా, వారికి భోజనపానీయాదులకు లోపం చేయకూడదు.

అంతా చెప్పిన తరువాత బాధాకరంగా తయారయే బంధుమిత్రులను కూడా ఒకసారి స్మరించటం అవసరం. వీరు "మెట్టమై వచ్చి దయ్యమై పట్టె" ననే సామెతను సార్థకపరుస్తారు. వీరు కేవలం భోజన పానాదులతో తృప్తిపడక గృహవిషయాలలో కూడా అనవసరంగా జోక్యం కలిగించుకుంటారు. భార్యాభర్తలమధ్య మనస్పర్థలు కలిగించటం, లేకపోతే వారిని దద్దమ్మలను చేసి గృహనిర్వహణాధికారాన్నే హస్తగతం చేసుకొని శ్రేయోభిలాషులవలె నటించటంవంటి దారుణాలెన్నో చేస్తారు. ఈ విధమైన అతిథులకి కూడా వారికి తగిన సత్కారం చేయటం అవసరమే. ★

## పంచాంగ ప్రసక్తి

(19 వ పేజీ తరువాయి)

గవర్నమెంటువారు చౌక దుకాణాలు తెరిచిన రోజుల్లో అతడిది నలభైఏడు యూనిట్ల రేషను కార్డు. ఐదుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు పెళ్ళిళ్లయి కాపురాలు చేసుకుంటున్నారు. కోడళ్ళను పుట్టింటినుంచి తీసుకరావటమో, కూతుళ్ళను సారెపెట్టి అత్తగారింటికి పంపటమో నెలకు రెండు మూడు ప్రయాణావసరాలుంటాయి. మునసబుగారి జనన మరణ రిజిష్టరుతో అతడికి ఏడాదికి

# పంచాంగ ప్రసక్తి

ఏ నాలుగైదు సార్లయినా పని తగులుతుంది. పిన్నా పెద్దా, ఆడా మగా, పిల్లా జెల్లా క్రిక్కిరిసి వున్న సమిష్టి కుటుంబంలో అప్పుడప్పుడూ యిలాంటి వేవో జరగడంలో విడ్డూరం లేదు. ఉన్నట్టుండి ఒక శుభోదయాన నరసయ్యమామ నన్ను నడిరోడ్డులో నిలవేసి "నిన్న సాయంత్రం మా వారిగాడి పెళ్లాం నీళ్లాడింది" అంటాడు. ఇక అప్పటి నుంచీ నా అవస్థలు ప్రారంభం! జన్మకాలాన్ని గుర్తించాలి. నక్షత్రాన్ని బట్టి ఆ పుట్టిన బిడ్డ కొక పేరు సూచించాలి. ఉండి వుండి ఒక ఆడబిడ్డ 'శ్రవణం'లో జన్మిస్తుంది. 'జూ, జే, జో, ఖూ-శ్రవణం' ఆలోచించగా ఆలోచించగా 'జూ'కు జూలియా, 'జే'కు జేన్ ఆసిన్, 'జో'కు జోన్ అవ్ ఆర్క్ యిలాంటి నామధేయాలు కొన్ని నాకు స్ఫురిస్తాయి. ఇలాంటి పేర్లు మా నరసయ్య మామకు నచ్చవని ప్రత్యేకించి చెప్పడం అనవసరం! ఏదో గంతకు తగిన బొంతగా ఒక మామూలు పేరు సూచించమని అతడు నా దుంప తెంచడానికి ఉద్యుక్తుడౌతాడు. పదేళ్లు దాటిన కుర్రదాన్ని, పదహారేళ్ళ కుర్రవాణ్ణి వివాహోచిత వయస్కులుగా పరిగణిస్తాడు నరసయ్య మామ. వరులకోసం వధువులకోసం అన్వేషణ ముమ్మరంగా కొనసాగుతుంది. జాతకాలు కుదరాలి. పేరు పొంతనాలు సరిపడాలి. ఆ తరువాత ముహూర్తం నిశ్చయించుకోడానికొక మంచిరోజు చూడాలి...

ఎలాగైనా ఈ గొడవను వదలించుకోదలచి నాకూ అతడికీకూడా తీరిక దొరికినప్పుడు నేను మెల్లమెల్లగా కొస్తా శుక్రనీతిని ఏకరువు పెట్టడంకద్దు: 'సత్యం వద' అని పురాణాలన్నీ ముక్తకంఠంతో వాకొంటున్నప్పటికీ 'వారిజాక్షులందు, వైవాహికములందు' అవసరాన్ని బట్టి నియమాన్ని అతిక్రమిస్తే ఫరవాలేదన్నారు పెద్దలు! పెళ్ళి సీమంతం, నామకరణంలాంటి శుభకార్యాలు జరపడంలో పంచాంగాన్ని పాటించడం అవసరమే! కానీ ఊరగాయలు వేయటం మొదలు, వూరికి వెళ్లడందాకా అంతకూ యింతకూ పంచాంగాన్ని పటుక మల్లాడడం అవివేకమే అవుతుంది. సాహేబులున్నారు. వాళ్లి పెళ్లిళ్ళకు శుక్రవారం మధ్యాహ్నం పదకొండు గంటలకు సరిగ్గా ముహూర్తం కుదురుతుంది. అంటే మంచి రాహుకాలమన్నమాట! వాళ్ళేం చెడపోయారు? సుగాలీలనీ, పిచ్చిగుంటలవాళ్లనీ, దాసర్లనీ పొట్ట చేతబట్టుకుని దేశంపైన తిరిగే జాతులు వెయ్యివున్నాయి. 'మా కుగాదులు లేవు, మా కుషస్సులు లేవు' అన్నట్టుగా వాళ్లకు జాతకర్మలూ లేవు, జాతకాలూ లేవు. వాళ్లలో వివాహాలు చెట్టుక్రింద, గుట్టప్రక్కన గుట్టుచప్పుడుగా జరిగిపోతాయి. అలాగని వాళ్ల దాంపత్యజీవితం ఆనందకరంగా గడవడం లేదని ఎవరు చెప్పగలరు? ఏవో కొన్ని విశ్వాసాలు మానవుడి కవసరమే గానీ, హద్దు మీరినప్పుడు ఎంత మంచి విశ్వాసమైనా చాదస్తమనిపించుకుంటుంది...

రామాయణమంతా విని సీతకు రాముడేం కావాలని ప్రశ్నించినట్టుగా "నీ మాటలకేం లేవయ్యా! దొంగతనానికి గూడా మంచి ముహూర్తం చూచుకుని బయల్దేరమన్నారు. అది సరేగానీ రేపు మడికి నారుపోయాలి. మంచి రోజేనేమో చూడు!" అంటాడు నరసయ్యమామ.

ఒక్క నారు పోయడానికి మాత్రమేమిటి, చెరకు నాటటానికి, గానుగ కట్టడానికి తమలపాకుల తోటలో తీగ దించడానికి యిలాటి వన్నింటికీ మంచి రోజే కుదరాలి నరసయ్య మామకు!

బండలుపగిలే భరణికార్తి, రోళ్ళుపగిలే రోహిణికార్తి వెళ్ళిపోగానే మా నరసయ్య మామ మోర పైకెత్తి ఆకసంవైపు చూస్తూ వుండిపోతాడు. చినుకు నేలపైనపడి, 'ఆరుద్దుల' కార్తిలో గింజ భూమిలో పడితేగానీ అతడి ప్రాణాలు కుదుటపడవు. కానీ ఋతుధర్మాలు ఋతు వర్ణనల్లో కనిపించినంత సక్రమంగా లోకంలో ప్రవర్తిల్లడం లేదు. 'అంతర్వ్రిగర్జన్మహాంభోధరమ్ములు, నీలనభ్ర స్నిగ్ధ నీరదములు' ఒక్కొక్కప్పుడు వర్ష ఋతువంతా వేచిచూచినా కనిపించవు. జల్లు జల్లుమని కురిసే జడివానమోత జలజాక్షి కాలిగజ్జల చప్పుడుగా, హోరు హోరున వీచే సుడిగాలిమోత వెలది యాలాపించు రాగమాలికగా, వెయ్యి ఒయ్యారాల వర్షలక్ష్మి విశ్వరంగంపైన నృత్య మొనర్చిన దృశ్యం స్వప్నసదృశంగా మాత్రమే మిగిలిపోయి, ఉత్తర కార్తిదాకా నేల చిత్తడిగాక, వర్ష ఋతువు సైతం నిదాఘాన్నే తలపించే గడ్డురోజుల్లో "ఈ కార్తిలోగూడా వానయోగం లేదా బాబూ?" అనిదీనంగా ప్రశ్నిస్తాడు నరసయ్యమామ!

అప్పుడు నేను మా నరసయ్యమామకు కాస్తా భూగోళశాస్త్రం గూడా బోధించడం కద్దు:

"వానయోగానికేం నరసయ్యమామా! పంచాంగంలో ప్రతి కార్తికీ ఎదురుగా అతివృష్టిఅనో, సర్వత వృష్టి అనో, ఏదో ఒక వివరం వ్రాయబడి వుంటుంది. కానీ పంచాంగకర్త పీఠికలోనే 'ఈ సంవత్సరం మేఘ పాలకుడు ఫలానావాడు కావటంవల్ల ఖండవృష్టి కురియును' అని వుదహరించి వుంటాడు. ఖండవృష్టి అంటే ఏమిటి? వర్షం ఎక్కడో ఒకచోట పడుతుంది. మిగిలినచోట్ల పడదు.

ఆఫ్రికాఖండంలో సహారా అన్న పేరుతో ఒక పెద్ద ఎడారి వుంది. అక్కడ సంవత్సరానికంతా ఒకటి రెండు పదున్ల వాన పడితే బ్రహ్మాండం. మనదేశంలో చిరపూంజి అన్న ప్రదేశముంది. అక్కడ ఏడాదిపొడుగునా సరాసరి రోజు కొక్క పదును వాన కురుస్తుంది. అంతెందుకు? మన తెలుగుదేశంలోనే ఒక వైపున వరదల్లో దేశం మునిగిపోతుంటే, మరొకవైపున క్షామరాక్షసి బీభత్సం కనిపిస్తుంది. అమాటకొస్తే వర్షం కురవడానికి గానీ కురవక పోవడానికిగానీ కారణం ఋతుపవనాలు. ఇవి నైర్ఋతి ఋతుపవనాలనీ, ఈశాన్య ఋతుపవనాలనీ రెండు విధాలు. పడమటి కనుమలు అడ్డుతగలడం వల్ల నైర్ఋతి ఋతుపవనాలు, తూర్పు కనుమలు అడ్డు తగలడంవల్ల ఈశాన్య ఋతుపవనాలు మనకు వర్షాన్ని చాలినంతగా ప్రసాదించడం లేదు..."

నిజానికింతదూరం నా ప్రసంగం సాగడానికి వీలుండదు. మధ్యలో ఎక్కడో అడ్డుతగిలి "ఇదేం గొడవనాయనా! వస్నిగ తాళి చేస్తున్నావేమిటి?" అంటాడు నరసయ్యమామ.

యథార్థాన్ని ఎగతాళిక్రింద లెక్కగట్టే నరసయ్య మామ ఎదుట అప్పుడు నేను ప్రకాశంగా కొస్తా ఊహాగానం సలుపవలసి వస్తుంది!

'వెన్నెల కొన్నాళ్ళు, చీకటి కొన్నాళ్లు గదా నరసయ్య మామా! గడచిందంతా చీకటే ననుకో, రాబోతున్నదే వెన్నెల! వానకోసం అర్రులు చాచుకుని మింటివైపు చూస్తూ కూర్చునే రోజులు గతించాయి. వర్షంతో ప్రమేయంలేకుండా పైర్లు పండించుకోడానికి వీలుగా ప్రాజెక్టులు నిర్మాణమౌతున్నాయి. గొట్టపు బావులద్వారా పాతాళగంగ పైకి పెల్లుబుకుతోంది. అంతేగాదు. కృత్రిమంగా ఎప్పుడంటే అప్పుడు, ఎక్కడంటే అక్కడ వర్షం కురిపించడానికి గూడా ఉపాయాల్ని అన్వేషిస్తున్నారు. నువ్వు నీ అరవయ్యేళ్ళ పైచిలుకు వయస్సులో రేడియో చూచావు, బయస్కోపు చూచావు. అవసరమైనప్పుడు ఓ బిస త్రిప్పగానే నీ పొలంలో ఒక పదును వాన కురిసేరోజులుగూడా నీ కళ్లముందరే రావచ్చు. ఏం, ఎందుకు రాగూడదు?..."

కరువు కాటకాలకు మా రొడ్డి భూమి తల్లితో పోరాడుతున్న తరతరాల వ్యవసాయ జీవనానికి ప్రతినిధిగా—మా నరసయ్య మామ నా మాటల్ని వింటూ వింటూ చల్లగా నవ్వుకుంటాడు. చెట్టుపైవున్న వెలగకాయను చూపించినప్పుడు ఏడుస్తున్న బిడ్డ పెదవులపైన విరిసే నవ్వు సరిగ్గా యిలాటిదేనేమో!



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



"ఏటికెదురు"

చిత్రకారుడు: కళ్యాణ ప్రసాద్ శర్మ